
విషయానుక్రమణిక

# చిత్రములు

వర్ణచిత్రము:—శ్రీమహావిష్ణువు; 'ఫెయిజీ' కృతరామాయణమునందలి పత్రమొ, చిత్రము.

సాధారణ చిత్రములు:—మహాత్ముఁడు మదరాసు ఆయుర్వేదిక్ ఫార్మసీని తిలకించి వెడలుట; హిందూపత్రికాకార్యాలయమున మహాత్మునిచే జరుపబడిన కీ. శే. యస్. కస్తూరి రంగయ్యంగారి చిత్రప్రతిష్ఠాపన మహోత్సవము; తిరువల్లిక్కేణి సముద్రతీరమున మహాత్ముని మహోపన్యాసము; మైలాపూరు 'అంజుద్‌బాగు'లో మహాత్మునకు తోటవిందు; చెన్నపురి నేపియరుపార్కులో జరిగిన సభయందు మహాత్మునకు స్వాగతపత్ర సమర్పణము; చెన్నపురి తిరువల్లిక్కేణిలో నూలువడకు స్త్రీల పోటీప్రదర్శనము; గోక్లేహాలులో మద్యపాననిషేధ సంఘసభ్యులకు మహాత్ముని హితోపదేశము; ఆదిద్రావిడ జనసంఘమున మహాత్ముని ఉపన్యాసము; కృష్ణాజిల్లా, పెదపాళెం, కృష్ణాశ్రమంతాలూకు నాల్గుచిత్రములు; ఇతరచిత్రములును.



# వత్సరాది

వారణాశి సూర్యనారాయణశాస్త్రిగారు

ప్రకృతి లక్ష్మీవిలాస పరంపరలకు
నవనవోన్మేష భాగ్య సంధాయకంబు
విశ్వమానవ హృదయ సంప్రీతికరము
వచ్చె నేఁ డిదె నూతన వత్సరాది.

గీ. ఆఱు ఋతువులు నంకము లామనిదొర
నాయకుఁడు గాఁగ వల్లికల్ నవ్యరాగ
భరితముగఁ జూపు నాట్య ప్రబంధమునకుఁ
బరభృతము సూత్రధారుఁడై పాడఁదొడఁగె.

గీ. మెల్లమెల్లన మలయ సమీరణుండు
సౌధపర్యంకి కాతల శయితలైన
కుసుమగాత్రుల కుచశాటి కొదువఁ దీర్చి
సరస చికురాళి సవరింపు సవదరించె.

గీ. క్రొంజిగురులెత్తి బెడఁగారుగున్నతరుల
యలరుగుత్తుల నెత్తావి యలమికొనియె.
ఉదిత ముదితంబులై మించు యువజనాళి
హృదయముల నూత్న భావసంపదయుఁ బోలె.

గీ. శుభహరిద్రానులేప విస్ఫూర్జితముగఁ
గన్యకామణు లభ్యంగకం బొనర్చి
నింబ కుసుమంబు నూత్న చూతంబుతోడ
గలుపుచున్నారు పూతలై తొలుతఁ గుడువ.

# భారతీ ప్రశంస

చీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

ఆంధ్రపుత్రుల సారస్వతాభివృద్ధి
సొంపు చెడియుండఁ బునరుద్ధరింపఁదలఁచి
అలఘు వినుతాక్షరాకృతి వెలసినట్టి
భారతివి భారతీ! నమస్కారమమ్మ!

సీ. కనుగొల్పుచున్నావు కవికుమారుల రేఁచి
భావగీతమ్ములు పాడుఁ డనుచుఁ
గవియించుచున్నావు ఘనులఁ గొందఱఁ బూర్వ
పక్షసిద్ధాంతముల్ వ్రాయుఁడనుచుఁ
బురికొల్పుచున్నావు బుద్ధిమంతుల నాత్మ
దేశచారిత్రముల్ దెలుపుఁడనుచు
నెసకొల్పుచున్నావు రసికుల జాతీయ
శిల్పనైపుణిఁ బ్రదర్శింపుఁడనుచు

గీ. నొసఁగుచున్నావు తల్లి! చేయూఁత మాకు
చల్లుచున్నావు, విశ్వవిజ్ఞానబీజ
ములను, యువహృదయక్షేత్రముల ననంత
కరుణమెయి, భారతీ! పత్రికామతల్లి!

చ. పలికెద నిక్కువంబయిన పల్కు మఱొక్కటి ప్రొద్దుప్రొద్దునన్
గలకలలాడు నీమొగముఁ గాంచిన, ముద్దులుమూటగట్టు నీ
పలుకులువిన్న, నెట్టి జడభావునకైన మనంబు పల్లవిం
చు, లలితభావముల్ మొలపుసూపఁగ, విన్నను వొప్ప, భారతీ!

గీ. కోవిదోచిత కల్యాణగుణములెల్ల
పసితనంబుననే నీకుఁ బట్టువడియె
నింతకన్న మహోన్నతి నెనయుమమ్మ
భారతీ! శాశ్వతయశంబు, పడయుమమ్మ!



చెన్నపట్టణము, ఏప్రిల్ ౧౯౨౫
1925

సంపుటము ౨. క్రోధన సంవత్సరము చైత్రమాసము సంఖ్య ౪.

# ఆంధ్రకవిత్వ చరిత్రము

భోగరాజు - నారాయణమూర్తిగారు

## IX

### ఆంధ్రకవితాపోషకులు

ఉ. తమ్మికొలంకునందు, విరిదమ్మివసించి, కిరీటహారప
ద్మమ్ములురాజిలన్, బ్రణవమధ్యమునన్, "బరమాత్మలోననై
క్యమ్మగుచుండు నీప్రకృతిఁగన్గొనుఁడీ" యనుచుం గవీంద్రలో
కమ్మునకున్ వచించుగతిఁ గన్పడు నిన్ను స్మరింతు భారతీ!

ఏదేశమున నేభాషయందుఁ బరిశీలించినను సాధారణముగా సాహిత్యమును గవిత్వమును రాజాదరణముచేతనే ప్రవృద్ధిగాంచుచుండుట మనము కనిపెట్టఁ గలుగుచుందుము. ఈరాజాదరణము కొన్నిశతాబ్దములవఱకు నత్యున్నతి వహించియుండి, క్రమక్రమముగాఁ బ్రజాదరణముక్రింద మారిపోవుచుండుటకూడ మనము పెక్కుభాషలయందలి కవితాచరిత్రములలోఁ జూడఁగలము. నన్నయనాఁటి రాజాదరణ మాంధ్రకవిత్వమునకును, కాళిదాసాదులనాఁటి రాజాదరణము సంస్కృత కవిత్వమునకును నేఁడు లేకపోవుటయే దీనికిఁ దార్కాణము.

పదునాలుగు పదునేడవశతాబ్దములనాఁటి రాజాదరణము పందొమ్మిదవ శతాబ్దమున నాంధ్రకవిత్వమునకు లేకుండుటయు నీయంశమున కాధారమైనదే.

ఈసందర్భమున మనయాంధ్ర కవిత్వమునకు రాజాదరణదశయనియుఁ బ్రజాదరణ దశయనియు నప్రయత్నముగ రెండుదశలు గాన్పించుచున్నవి. ఈరెండింటిలో నాంధ్ర కవిత్వమేదశయం దత్యౌన్నత్యము వహించియుండెనో, యేదశయం దెంతవఱకు క్షీణతనొందెనో, యావృద్ధి క్షీణతల కెన్నెన్నివిధములైన కారణములు కలవో మొదలగు విషయములను జర్చించుట యవసరమగుటయేకాక, రాజాదరణమునుండి ప్రజాదరణములోని కాంధ్రకవిత్వము మేడపైనుండి దుమికిన ట్లొక్కమారే దుమికెనో లేక సోపానక్రమమునఁ గ్రమక్రమముగనే ప్రవేశించెనో, రాజాదరణ దశనుండి తప్పి, యెన్నెన్ని యంతర్దశలను బొందిపొంది కడకుఁ బ్రజాదరణదశయందుఁ జేరుకొనఁ గలిగెనో యను విషయములుగూడ మన మాయాసందర్భముల ననుసరించి విమర్శింపవలసియుండును.

పూర్వకాలపు విశ్వవిద్యాలయములు

ఒక్కకవిత్వమునేకాక పూర్వపురాజులు పెక్కుకళలను శాస్త్రములనుగూడ నభివృద్ధి నొందించుచుండుటచేత నేఁటివిశ్వవిద్యాలయములవంటి వాకాలములలో లేవని చెప్పుట కవకాశములేదు. మన కప్పటివిశ్వవిద్యాలయస్థానము లగ్రహారములే. ఇయ్యగ్రహారములున్నతవిద్యాప్రచారమునకై పునర్గ్రహణాధికారములేకుండ, రాజులచేఁ బండితులకు దానరూపమున నొసంగఁబడినట్టివి. సకల విద్యాతత్త్వవేదులు (Professors) బహువిధ శాస్త్రోపాధ్యాయులు (Lecturers) నొక్కచోఁ గూడి వివిధప్రదేశములనుండి వచ్చు విద్యార్థులకు నభిమతశాస్త్రంబుల బోధించుచు నాయాయగ్రహారములయందు సుఖజీవనము గావించుచుండిరి. పూర్వకాలపుఁ జరిత్రలలోఁ గథారూపముగాఁ జెప్పఁకొనఁబడుచుండిన కవులును బండితులునుగూడ నట్టి యగ్రహారవిశ్వవిద్యాలయములయం దుత్తీర్ణులైన మహామహులే కావచ్చును.

చీపురుపల్లి విశ్వవిద్యాలయము

తూర్పుచాళుక్యప్రభువగు మొదటివిష్ణువర్ధనుఁడు వేదవేదాంగేతిహాసన్యాయాద్యఖిల విద్యాప్రచారమునకై యాంధ్రదేశమున విశాఖపట్టణ మండలమునందలి విజయనగర సమీపమునఁగలఁ చీపురుపల్లిగ్రామమున నొకవిశ్వవిద్యాలయము స్థాపించినట్లును, తన వంశస్థుల కెవ్వరికిని బునర్గ్రహణాధికారము లేకుండ నవ్విద్యాలయముకొఱ కాగ్రామమును శాశ్వతదానరూపమున నొసంగినట్లును మన కీక్రిందిశాసనమువలనఁ గొంత తెలియఁగలదు.

Cheepurupally grant of Vishnuvardhana, the Ist (E-c) 632 A- D. :—

"(L-10) To the two sons' sons of Brahmaserman who studied and mastered the Veda and Vedangas—the sons of Durgaserman, who was intent upon performing his own proper rites prescribed by his own *Sakha*, which had been duly learned *by him*—Viz. to Vishnuserman and Madhavaserman, who knew the true meaning of the Vedas the Vedangas, the Epics, the Puranas, the Law

books, and many other sacred works, who are of the Gautamagotra, and who belong to the Taithiriya Charana, by me residing at the town of Cherupura in the Poka (?) Vishaya on the occasion of an eclipse of the moon in the month Sravana, this village has been given as an *agrahara* with exemption from all taxes, for the increase of (my) own religious merit and duration of life and good *health* and fame. No obstruction to the enjoyment of it should be caused by any one at all" †

పులకేసి – రాజరాజు

ఇట్టివిద్యాలయములలో సామాన్యముగ సకలవిద్యలు నభ్యసింపఁబడుచుండినను, తద్విద్యాలయనిర్మాణకర్తలగు రాజుల కభిమానమైన శాస్త్రములును, అభిమానమైన మతమును మాత్రము ముఖ్యముగా నెక్కుడు ప్రచారము నొందింపఁబడుచుండెను. నాఁడే కాక నేఁటివిశ్వవిద్యాలయములయందుఁగూడ నీయాచారము లేకపోలేదు కదా? ఏయే రాజుల కేయేశాస్త్రములు నేయేమతములు నభిమానములైయుండెనో మనకుఁ దెలిసిన యెడల నా యారాజులచేఁ బ్రోత్సహింపఁబడిన కవిత సైతము నిట్టిదియైయుండునని గుర్తించుటకుఁ గొంతయవకాశము కలుగకపోదు. ఇందు కజ్ఞాతయుగములోని పులకేసియు, నన్నయయుగములోని రాజనరేంద్రుఁడును మనకు నాధారముగాఁ గొనఁదగినవారు. పులకేసి జైనమతాభిమాని. రాజరాజు వేదమతప్రతిష్ఠాపరుఁడు. జైనమతప్రచారమునకై యాతఁడును వేదమతప్రచారమునకై యీతఁడును దమతమయుగములలో విద్యాభివృద్ధి గావించుచుండిరి. అందుచేతనే పులకేసికృతిపొందిన భారతము జైనమతానుకూలముగను, రాజరాజుకృతిపొందిన భారతము వేదమతానుకూలముగను రచింపఁబడినవి. ఆంధ్రకవితాపోషకులలో నగ్రగణ్యుఁడని యెన్నఁదగిన రాజరాజు సైతమును గవిత్వముతోఁ బాటు తదితర విద్యలను, శాస్త్రములను, విద్యాలయములమూలముననో మరియొకవిధముననో ప్రోత్సహించియుండవలయును. అట్లుగానిచో వానియాస్థానమునందు నన్నపార్యనారాయణభట్టాదికవులతోపాటు బహుశాస్త్రములయందు బ్రవీణులైన పండితు లుండుటతటస్థింపదు. అందుచే నాదిరాజవతంసులలోఁ గొందఱు కవిత్వముతోపాటు పెక్కువిద్యలకుఁ బ్రోత్సాహకారులై యుండిరనియు; వానిలోఁ గవిత వారి కభిమానవిద్యయై యలరారుచుండెడిదనియు ననుకొనవచ్చును.

ప్రాచీనవిద్యాపీఠములు

భారతవర్షమునందలి పూర్వపు విశ్వవిద్యాలయములనుగూర్చి "ప్రాచీనవిద్యాపీఠము"లనుపేర మ-రా-శ్రీ. చిలుకూరినారాయణరావు పంతులుగారిచే రచింపఁబడిన యుద్గ్రంథ మీసందర్భమున మనము స్మరింపఁదగినది. ఇందు మనయాంధ్రదేశముతోఁగాని యాంధ్రభాషతోఁగాని సంబంధించిన పూర్వపువిద్యావిశేషములఁ గూర్చి యంతగా లేకున్నను, విద్యాస్థానములని నుతికెక్కిన కాశ్మీరము, కాశి, నాలందా, ధాన్యకటకము, మధుర మొదలైన యున్నతవిద్యాపీఠములంగూర్చియు, నాయావిద్యాపీఠములయందుఁ బ్రచా

† I. A. Vol. No 20 Page 17.

రమునొందింపఁబడుచువచ్చిన విద్యావిశేషములనుగూర్చియుఁ దద్విద్యావిశేషములు ప్రచారము నొందుచుండిన విధానములం గూర్చియు పూతనాంశముల నేకములు సంపాదించి ప్రకటించిన నారాయణరావుపంతులుగారు మన కెంతయు వందనీయులు. నేఁటివిశ్వవిద్యాలయములవంటి వాకాలములో లేవనియు, విద్యాప్రచారమునకై పాశ్చాత్యసంపర్కజనితమైన నేఁటినాగరకత నాఁడు గానరాదనియు భ్రాంతి పడువారికెల్ల నీగ్రంథ ముత్తమాదర్శమని చెప్పఁదగును. ఇందుకు నిదర్శనముగాఁ దద్గ్రంథమునుండి విక్రమ శిలా విద్యాలయములోని విద్యాప్రచారవిధానములను గొన్నింటి నిందు బొందుపరచెదను.

"నాలందాయందువలె నిచటను నాలు కలాశాల లుండెను. భయపాలుని రాజ్యమున వీనిలో నొక్కొక్కకలాశాలకు [1] ద్వార పండితుఁడను నొకయధ్యాపకుఁ డధికారిగా నుండెను. ఈద్వారపండితుల ప్రశ్నలకు [2] సదుత్తరముల నిచ్చువారే యచటిమతములఁ జేరనర్హులైయుండిరి. మతమునకు నాలుగుమూలల నున్న నాలుగు కళాశాలలలోనికి నందఱు విద్యార్థులును బోయి చదువుకొన వీలులేకుండెను. ఆరామమధ్యముననున్న 'శాస్త్ర గృహము'నందు 'ప్రజ్ఞాపారమితసూత్రము'లను ధర్మగ్రంథములఁజదువుటకు శ్రమణులు మాత్రము చేరుచుండిరి. ఈమధ్యకళాశాలలో నధ్యాపకులుగనుండిన యిరువురుపండితులకును మతమునకుఁ [3] బ్రథమద్వితీయ స్తంభములను నామములుండెడివి. ధర్మపాలునికాలమున నీ మతమునకు శ్రీభద్రజ్ఞానపాదుఁడను వాఁ [4] డధ్యక్షుఁడుగా నుండెను.

ఇచటికి జదువుకొనుటకువచ్చిన విద్యార్థులందఱు నిందే నివసించుచుండిరి. మతము యొక్క నాలుగుద్వారములయొద్దనున్న నాలుగుసత్రములందును వీ రుచితముగ భోజనము చేయుచుండిరి. ఈసత్రముల నప్పటి రాజులును ధనవంతులును బోషించుచుండిరి".

తమిళ సంగములు

ఇంక నీవిద్యావిషయము లిట్లుండఁ బ్రాచీనకావ్యరచనంగూర్చియుఁ దత్కావ్యప్రాశస్త్యనిర్ణయముంగూర్చియుఁ బైగ్రంథమునం దిట్లు వ్రాయఁబడినది.

" బౌద్ధులకు సంఘారామము లెట్లో తమిళులకు సంగములు పూర్వకాలమున నట్లుండెను. ఇవి పూర్వకాలపు పరిషత్తులకు సరిపోవును. పరిషత్తులందు ధర్మసూక్ష్మములెట్లు నిర్ణయింపఁబడుచుండెనో యీతమిళసంగములందు గ్రంథకర్తల గ్రంథముల ప్రాశస్త్యమట్లు నిర్ణయింపఁబడుచుండెను. ఈసంఘసభ్యుల యామోదమును బడయనిగ్రంథము ప్రసిద్ధిలోనికివచ్చుటకు వీలులేకుండెను. ఇందలి సభ్యులు శాస్త్రములయందుఁ బ్రవీణులై తాము మొదటకావ్యరచనయందు బ్రఖ్యాతివడసినవారై యుండిరి. వీరు కేవలము నాయాగ్రంథములను బరీక్షించుచుండిరేకాని విద్యాగురువులుగానుండలేదని తెలియవచ్చుచున్నది."

1 Entrance examiner.
2 Entrance examination questions.
3 The Chief and the assistant lecturers
4 The principal.

"ఏగ్రంథములు దేశవాఙ్మయమునందుండఁ దగినవో యెట్టివుండఁగూడదో నిర్ణయించుటకుఁ బూర్వకాలమున నాంధ్రదేశమున సంఘము లుండినట్లుకాన్పించదు. అట్టి ప్రతిష్ఠాపనయొకటి యావశ్యకమా కాదా యను సంశయముతో మనకుఁ బనిలేదు. కావ్యకర్తలయూహల నరిట్టనెంచి, వాఙ్మయస్వరూపమును నిర్ణయించుటకుఁ గొందఱు పండితులు సమర్థులైయుండఁ జాలరు. కావ్యమామోదింపబడుటయు నుపేక్షింపఁబడుటయు ప్రజలచిత్తమునకు వదలి వేయవలసియుండును. అప్పుడే స్వతంత్ర వాఙ్మయము బయలువెడల వీలగును. ఆంధ్రవాఙ్మయ మిట్టిస్వాతంత్ర్యముతోడనే వ్యవహరించినది."

ఇట్లు తమిళసంఘములవంటి పరిషత్తులు గ్రంథప్రాశస్త్య నిర్ణయమునకై పూర్వమాంధ్ర దేశమున లేకుండెననియు, అట్టి పరిషత్ప్రతిష్ఠాపనయొకటి యావశ్యకమా కాదా యను సంశయముతో మనకుఁ బనిలేదనియు, కావ్యకర్తల స్వాతంత్ర్యమున కిట్టిపరిషత్తులు భంగకరములనియు సెలవిచ్చిన నారాయణరావు పంతులుగారే మరియొకచోట నిట్లు వ్రాయుచున్నారు.

"ఈరీతిగా నతివైభవోపేతుఁడై బ్రాహ్మణమతము నాంధ్రలోకమున వ్యాపింపఁజేయ సమకట్టి రాజరాజనరేంద్రుఁడు విద్వత్పరిషత్తు నేర్పఱిచి, వారితోఁ దెనుఁగుకావ్యమును రచింపవలసిన పద్ధతుల నేర్పఱచి, యాపద్ధతుల మీఁదనే భారతరచననడపించుచుఁ, దానును విద్వాంసుఁడగుటచేఁ దనకుఁ దోఁచినచోట కొన్నిపద్యములను జేర్చుచు, నీ పరిషత్తునకుఁ దన వంశము నాశ్రయించి చిరకాలముండిన వంశమున జనించి, యనురక్తుఁడై సకల పురాణేతిహాస కథా కథనదక్షుండై నిత్యసత్య వచనుఁడును మతిమంతుఁడునై యుండుటయేకాక శబ్దశాసన బిరుదమునకుఁ బాత్రుఁడైయుండిన నన్నయభట్టు నధ్యక్షునిగా నియమించి, తెనుఁగుభాషకు మహోపకారము గావించెను."

రాజనరేంద్రుని పరిషత్తులు

పైవచనము స్వవచనవ్యాఘాత మేమో యని సంశయింపవలసి వచ్చుచున్నది. పూర్వమునుండియు రచింపఁబడుచుండిన గ్రంథములలో మనకులభించినది ప్రథమగ్రంథమని కొందఱిచేతను, ఆంధ్రమునఁ గావ్యరచన సృష్టించుటచేతనే ప్రథమగ్రంథమని కొందఱిచేతను, భావింపఁబడుచుండిన నన్నయరచిత భారత భాగముతోడనేకదా మన యాంధ్ర వాఙ్మయము ప్రారంభించుచున్నది. అభిప్రాయములు వేఱైనను బ్రథమగ్రంథమని యుభయ పక్షములవారిచేత నంగీకరింపఁబడుచుండిన భారతమే రాజరాజు స్థాపించిన పరిషత్తునందు మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా 'విశారదు'లైన మహాకవుల యెదుటఁ జదువఁబడి, వారిచే విమర్శింపఁబడి పరిష్కరింపఁబడినపుడు, గ్రంథప్రాశస్త్య నిర్ణయము పరిషత్తుల మూలమునఁ గావించు నాచారము మనయాంధ్ర వాఙ్మయమున లేకుండెనని యెట్లు చెప్పఁగలము? వైయాకరణులు పౌరాణికులు తార్కికులు నాదిగాఁగలుగు విద్వాంసు లనేకులు తనయాస్థానమునందుండినను బలువురు

కవులచే నుత్తమకావ్యములు వ్రాయించుటకును దాను వ్రాయించినకావ్యములు ప్రసిద్ధివడయుటకై చక్కఁగాఁ బరిష్కరింపఁ బడుటకును రాజమహేంద్రమునందలి కవీంద్రులనెల్ల జేరఁదీసి రాజరాజొక సమాజము స్థాపించెనని 'రాజమహేంద్ర కవీంద్ర సమాజ సురత్నోజ'యని నన్నయగావించిన సంబోధనమువలనఁ దెల్లమగుచున్నది. రాజరాజు ప్రోత్సాహమువలన భారతముతోఁ బాటుగ మరికొన్ని గ్రంథములుఁగూడ రచింపఁబడి యుండును. లేదా రచించు ప్రయత్నములైనను జరిగియుండును. నన్నయ గావించిన విద్వత్సభాస్తవము వలనఁ గూడ నానాఁడు కవితా సంబంధమగు నిట్టి సభలు తరుచుగా జరుగుచుండెననుటకు మరింత యాధారము కలుగుచున్నది.

చ. పరమ వివేక సౌరభవి
భాసిత సద్గుణ పుంజవారి జో
త్కర రుచిరంబులై సకల
గమ్య సుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావన ప
యః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీరుహాంబుల ము
దంబొనరం గొనియాడి వేడుకన్.

రాజరాజు చోళరాజుల యల్లుండగుటచేత, తమిళ గ్రంథములు పరిషత్తులమూలమున నిర్ణయింపఁబడుచుండిన యాచారమును దాను గనిపెట్టి, కావ్యప్రాశస్త్యనిర్ణయమునకై యిట్టి పరిషత్తులు తన రాజధానియందును జరుపుచుండెననియుఁ జెప్పవచ్చును.

రాజాస్థానములే మనపరిషత్తులు

మొత్తముపైఁ గావ్య విమర్శకుఁ దమిళ సంగములవంటి పరిషత్తులు పూర్వ రాజాస్థానములేయని వాఙ్మయ విశారదులకు స్ఫురింపక మానదు. తమిళ సంగములు చేయుచుండిన పనులు మనయాంధ్రరాజుల యాస్థానములయందుఁ గొంతవఱకుఁ గావింపఁబడుచుండెడివి. తిక్కనవంటి మహాకవిసైతమును దన కావ్యము లిట్టిపరిషత్తులయందుఁ బరిష్కృతములైనట్లుగ

"......కావ్యంబు సరసులైన
కవులచెవులకు నెక్కినఁ గానినమ్మఁ
డెందుఁ బరిణతిగల్గు కవీశ్వరుండు."

అను వాక్యమూలమున సూచించుచున్నాఁడు. కాని తిక్కన కావ్యములను విమర్శించిన పరిషత్తు, ఆకాలమునందు యథాక్రమముగ స్థాపింపఁబడి యుండినట్టిదియో, లేక స్వకావ్యప్రాశస్త్యనిర్ణయమునకై తిక్కనచేఁ దాత్కాలికముగ నెలకొల్పఁ బడినట్టిదియో మనము చెప్పలేము. ఏదియైనను బరిషదాచారమునకు మాత్రము తిక్కన బద్ధుఁడు కాకపోలేదని పై వాక్యమువలనఁ దెలియుచున్నది.

విద్వత్కవి మండలియందుఁ దన కావ్యమును వినిపించుచుండ నందలికవులు తనకవిత్వము నాక్షేపించుట చేతనేకదా శ్రీనాథుఁడు

"ప్రౌఢిఁబరికించి సంస్కృత భాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాషయండ్రు
ఎవ్వరేమనుకొన్న నాకేమికొదువ
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష."

అను పద్యము చెప్పుటకుఁ గారణమైనది. దీనింబట్టి పదునైదవ శతాబ్దమునందుఁగూడఁ గావ్యప్రాశస్త్యనిర్ణయ సభ లుండుచుండెనని మనమేల యనుకొనరాదు? పదునాఱవ శతాబ్దమునందుఁ గృష్ణరాయల యాస్థానమునందలి కవులంగూర్చియు వారివారి కవితలంగూర్చియుఁ

ప్రాయికముగాఁ జెప్పుకొనఁబడుచుండిన కథలం బట్టి, తదాస్థాన కవిమండలి రచనా ప్రాశస్త్య నిర్ణయము తరుచుగాఁ గావించుచుండెనని స్పష్టమగుచున్నది. నిండోలగంబున సకల విద్వత్కవి సమక్షమునందు రాజునెదుట రామరాజ భూషణుఁడు తన వసుచరిత్రమును జదువుటకు నియోగింపఁ బడినట్లును జదువుటకుఁ బ్రారంభించినతోడనే 'శ్రీభూపుత్రి' యను పద్యమును రామకృష్ణుఁ డాక్షేపించినట్లు చెప్పకొనఁబడుచుండిన కథయు, రఘునాథరాయల యాస్థానమునఁ గవులమధ్య చేమకూర వేంకట కవి తనవిజయవిలాసమును వినిపించుచుండఁగా నందలి 'కంగుల్దీరిన పైఠిణీరవిక' యను పద్యములోని 'కంగు' శబ్దప్రయోగమును గూర్చి యొకవు లాక్షేపించిరని చెప్పకొనఁ బడుచుండిన కథయుఁగూడఁ బ్రస్తుతాభిప్రాయమును బలపరచుచున్నవని నామనవి. ఈకథలు నిజములైనను గాకపోయినను, ఒకానొక కవి రచించిన కావ్యము కొందఱు కవులమధ్యఁ జదువఁబడు చుండుటయుఁ, జదివింపఁబడి పరిష్కృతమైన పిమ్మటనే ప్రభువులు తత్కృతిపతిత్వము నంగీకరించుచుండుటయు, రాజాస్థానములయం దాచారమని మాత్రము చెప్పక తప్పదు. మన యాంధ్రదేశమం దట్టి యాచారము లేకుండినయెడల నిట్టికథలు కల్పింపఁబడుటకైనను వీలుండదుకదా?

### ఆంధ్రవాఙ్మయ స్వాతంత్ర్యము

ఇది యిట్లుండ తమిళసంగములవంటి పరిషత్తులు మనయాంధ్రదేశమునందు లేకపోవుటచేతనే యాంధ్రవాఙ్మయము స్వాతంత్ర్యముతో వ్యవహరించినదని నారాయణరావు పంతులుగారు సెలవిచ్చిరి. ఆంధ్రవాఙ్మయము స్వాతంత్రతతో వ్యవహరించినదియో యస్వాతంత్రతతో వ్యవహరించినదియో యింత సూక్ష్మముగా నిర్ణయించుట న్యాయముకాదు. మన వాఙ్మయ మహాసౌధమును నిలువఁబెట్టి యుంచిన ముఖ్యస్తంభములనందగు సద్గ్రంథములే కొన్ని స్వాతంత్ర్యరహితములు కొన్ని స్వాతంత్ర్యసహితములు. 'రాజరాజొక విద్వత్పరిషత్తు నేర్పఱచి, వారితోఁ దెనుఁగు కావ్యమును రచింపవలసినపద్ధతుల నేర్పఱచి, యాపద్ధతుల మీఁదనే భారతరచనను నడపించుచు' అను వాక్యములవలన నన్నయ రచించిన భారత భాగము కేవల మస్వాతంత్రగ్రంథమని నారాయణరావు పంతులుగా రూహించినట్లేకదా? వాస్తవముగూడ నంతియే. కాని తిక్కన భారతముగాని, పోతనభాగవతముగాని యొకరి యాజ్ఞకును, ఒకరేర్పఱచిన పద్ధతులకును లోఁబడి రచింపఁబడినట్టివి కావు. అవి కేవలము స్వాతంత్రగ్రంథములు. మహాకావ్యముల యందే యిట్టిభేదములుండ నింక సామాన్యగ్రంథముల స్వాతంత్రతా స్వతంత్రత లెవరు గణింపఁగలరు? మఱియు ముఖ్యోద్దేశ మొక్కటియే యైనను, తమిళసంగములకును మన రాజాస్థానకవి సంఘములకును గావ్యవిమర్శన నియమములయందువ్యత్యాసముండితీరవలెను. గ్రంథరచనకై యొకేవిధమైన నియమములను గొన్నిటి నేర్పఱచి యానియమములకు బద్ధములైనవానినే తమిళసంగములు పరిగ్రహించుచుండెనుగాఁబోలు! శాస్త్రసంబంధమైన కొన్ని

నిబంధనములుండిన నుండుఁగాక. కావ్య రచనయందు మన యాంధ్రకవులకుమాత్ర మంత విపరీతమైన విషమపద్ధతు లెప్పుడును దటస్థింపలేదు. మొత్తముపైఁ దమిళవాఙ్మయమునకుఁ గలిగినంత స్వాతంత్ర్య భంగము మన వాఙ్మయమునకుఁ గలుగలేదని చెప్పవచ్చును.

### ఆంధ్రవాఙ్మయమునందలి వివిధమార్గములు

కవితా విలాసమే ముఖ్య వ్యసనముగాఁ గడపిన యాంధ్రరాజులు తమతమ యాస్థానములయందుఁ గవులఁ బ్రోత్సహించుచు నొక్కొక రొక్కొకవిధమైన నూతనత్వమును వాఙ్మయమునకుఁ గలిగింపుచు వచ్చిరి. సాహితీ ప్రపంచమున విమర్శదృష్టితో సంచరించు వారి కాయానూతనత్వములు గోచరింపక పోవు. మామిడి సింగనామాత్యు నాస్థానమున వెలువడిన శృంగార నైషధాంధ్రీకరణము, రాయల యాస్థానమున వెలువడిన స్వారోచిష మనుసంభవ ప్రబంధము వేంకటాద్రి మహీవల్లభు నాస్థానమున వెలువడిన రాఘవ పాండవీయ ద్వ్యర్థికావ్యము మొదలగు పరస్పర భిన్నములైన యుద్గ్రంథములు మనవాఙ్మయమునం దవిచ్ఛిన్నముగాఁ గానవచ్చుచుండుటయే యట్టి విషమపద్ధతు లెన్నఁడును నాంధ్రకావ్యరచనకు లేకుండెనని చెప్పుటకుఁ బ్రబలతార్కాణము. ఇట్లు సకల విధముల నొక్క తమిళ వాఙ్మయమునేకాక దేశీయ వాఙ్మయముల నన్నింటినిమించి యన్నింటికంటెనునత్యంతమైన మార్దవముమాధుర్యము ప్రాబల్యము ప్రసిద్ధియు నాంధ్రవాఙ్మయమునకుఁ జేకూరుటకు నాంధ్రరాజుల నిరుపమానమైన కవితాపోషణమే ముఖ్యకారణము.

### అజ్ఞాతయుగములోని కవితాపోషకులు

అజ్ఞాతయుగమునందలి కవితాపోషకులం గూర్చి ప్రసంగింపవలసివచ్చినప్పుడు వివాదాస్పదుఁడైయున్న సత్యాశ్రయుని, యుద్ధమల్లుని మొదటఁ దలంపక తప్పదు. ఈయిరువురును గాక యాంధ్రకవిత్వప్రచారమునకుఁ దోడుపడినవా రింకెవ్వరైనఁ గలరాయను విషయమునుయుగవిభాగవ్యాసములోఁ గొంత చర్చించితిమి. ఈయజ్ఞాత యుగమునందు బౌద్ధయుగమని జైనయుగమని రెండుయుగములుండియుండవలయుననియు, ఈబౌద్ధజైనుల మూలమున నాంధ్రకవిత్వమునకుఁ గొంత ప్రచారము కలిగియుండవలయుననియు మనమూహించితిమి. అందుచే నజ్ఞాతయుగమునందలి కవితాపోషకులలో బౌద్ధులనుగూడ మనము చేర్చుకొనవలసియుండును. వీరిలో జైనులు మనయాంధ్రకవిత్వమునేకాక తమ మతప్రచారమునకై దేశీయకవితలనన్నింటిని గూడ నభ్యసించుచుండిరి. అందుచే నొక్క యాంధ్రకవిత్వచరిత్రమునేకాక కర్ణాటాదిదేశీయకవిత్వచరిత్రములలో నెయ్యది వ్రాయవలసివచ్చినను నజ్ఞాతయుగమునందుఁ దత్కవితాపోషకులు జైనులని చెప్పకతప్పదు.

The Editor of Pampa's Adipuranam says—" Among the various elements which contributed to the growth and development of the Kannada literature, the adoption of the Kannada language by the Jain settlers of the Kannada country both for secular and religious purposes, seem to have been the earliest and most effective whatever the Jains colonised, they were great patrons of learning and literature. To-day we have in Kannada a great number of classical works

written by Jain authors than those written by authors of any other denomination."

నన్నయయుగమునందలి కవితాపోషకులు

ఇట్టి నిశ్చయముతో నజ్ఞాతయుగమును గడచి, నన్నయయుగమగు పదునొకండవ శతాబ్దమునఁ బ్రవేశించినంతనే యాంధ్రసాహిత్యోద్ధారకుఁడగు రాజరాజు మనకుఁ బ్రథమ కవితాపోషకుఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు. బౌద్ధజైనులమూలమునఁ దత్పూర్వమాంధ్ర కవితాప్రచారము కొంతవఱకు జరిగియుండునని మనమూహించుచుండినను గావ్యములను వ్రాయించి కృతిపతిత్వమును వహించిన కవితాపోషకులగు రాజులెవరైనఁ గలరాయని చర్చించుటకు మాత్ర మాధారము లేమియుఁ గానరావు. యుద్ధమల్లుఁడు గ్రంథములు వ్రాయించినట్లుగాని, కృతిపతిత్వము వహించినట్లుగాని యెందును గోచరింపదు. అందుచే నాంధ్రమునం దుద్గ్రంథములను వ్రాయించి కృతిపతిత్వమును బొందు నాచారమునకు రాజనరేంద్రుఁడే మార్గదర్శకుఁడని చెప్పవలసియున్నది. ఈతఁడే మార్గమును గర్ణాటకవితాపోషకులైన పులకేసిప్రముఖులనుండి యవలంబించియుండును. రాజరాజునకు సమకాలికుఁడగు భోజరాజు సైతము క్షేమేంద్రకవిచే నొకకావ్యమును గృతినొందెనని చెప్పెదరు. ఈకావ్యమెట్టిదో మనకింతవఱకుఁ దెలియదు.

శైవవాఙ్మయము

రాజనరేంద్రుఁడవలంబించిన యీకృతిస్వీకారాచారమే కారణముననో కాని వానితరువాత రమారమి రెండువందలసంవత్సరముల వఱకు ననఁగా మనుమసిద్ధివఱకు నితరరాజులెవ్వరు నవలంబించినట్లు కానరాదు. ఈమధ్యకాలములో రచింపఁబడిన కావ్యములు సైతము నతిస్వల్పసంఖ్యాకములగుటచేఁ గవితాపోషకులైన రాజులు మిక్కిలియరుదుగా నుండియుందురు. ఈస్వల్పగ్రంథజాలమైనను రాజాస్థానములందు రచింపఁబడినది కాక, కేవలభక్త్యావేశమునఁ జెలరేగిన శైవవాఙ్మయమగుటచేఁ దత్తత్కావ్యకర్తలగు శివకవులు తమ శైవకావ్యములను గృతియొసంగ రాజులకడకుఁ గొనిపోవునవసరము లేనివారై యుందురు. మఱియు మనయాంధ్రవాఙ్మయమునం దంతటంగల శైవగ్రంథముల నేకములు భగవదంకితములుగనే రచింపఁబడియుండుటచేత శివకవులు భవకవులచందమునఁ గాక నరాంకితము నిరసించుచుండిరేమో యని తోఁచుచున్నది.

మఱియు నీనన్నయయుగమునందలి పండితారాధ్యవిరచితమగు శివతత్త్వసారము పాల్కురికిసోమనాథుని బసవపురాణాదులు మొదలగు కేవల శైవమతగ్రంథములు మాటయటుండ, పావులూరిమల్లన తనగణితశాస్త్రమునుగూడ శివాంకితముగానే రచించెను. నన్నెచోడుని కుమారసంభవమును నట్టిదియే. అందుచే నీరెండువందల సంవత్సరములలో ననేకకావ్యములకుఁ గృతిపతిత్వము వహించిన రాజమౌళియే రాజరాజు తరువాతఁ బేర్కొనవలసిన ముఖ్యకవితాపోషకుఁడు.

మనుమసిద్ధిపూర్వులు కవితాపోషకులు

ఈయుగములో శైవగ్రంథములు కానివి రంగనాథ భాస్కరుల రామాయణములు

మాత్రమేయని తోఁచుచున్నది. వీనికృతిపతులైన కోనబుద్ధరాజ సాహిణిమారులంగూర్చిన చారిత్రకాంశములు వివాదాస్పదములైయున్నవి. కవిభల్లటవిరచితమగు బేతాళపంచవింశతికిఁ గృతిపతియైన చాళుక్యవిక్రమాదిత్యునిసైతము మన మేతద్యుగకవితాపోషకులలోఁ గణింపవలయును. నిర్వచనోత్తరరామాయణమున మనుమసిద్ధివంశమును వర్ణించుచుఁ దిక్కన వానిపూర్వులలోఁ గొందఱిని గవితావిదులుగాఁ జేర్కొనియుండెను. సామాన్యకవితావిదుండగుటయేకాక మనుమసిద్ధి ముత్తాతయగు తిక్కభూవిభుఁడు

"సకల విద్యాపరిశ్రమము దెల్పఁగ నేల
కవిసార్వభౌమాంక మవనిఁ జెల్ల"

అని వర్ణింపఁబడుటచేతఁ దననాఁటి కవులకెల్లరకును మేటియై కవిసార్వభౌముఁడై యాంధ్రకవితాప్రచారమునకై కొంతవఱకుఁ బాటుపడియుండును. ఈ తిక్కభూవిభుఁడు మనుమసిద్ధికి ముత్తాత యగుటచేత వీరేశలింగముపంతులుగారి పద్ధతిప్రకారము తరమునకిరువదియైదుసంవత్సరముల చొప్పున గణించినను, 1200 సంవత్సర ప్రాంతమువాఁడని తేలుచున్నది. కావున వీనిని నన్నయయుగములోని కవితాపోషకులలోఁ జేర్చుట కభ్యంతర ముండదు. ఈతిక్కరాజు తండ్రియైన మనుమసిద్ధియు

'కరుణాదీనానాథకవిబంధుజనచకో
రములకుఁ జంద్రాతపముగఁ జేసె'

అను తిక్కనవాక్యములోఁ గవిసన్మానకుఁడుగా వర్ణింపఁబడుటచేత వీఁడును నేతద్యుగ కవితాపోషకులలోఁ జేరవలసినవాఁడే. ఇట్లు మనుమసిద్ధి పూర్వులెల్లరును గవులుగను గవితాభిమానులుగను దద్వంశావతారమునందుఁ దిక్కనచే నుతింపఁబడినవారగుటచే నప్పటి కించుమించుగ నూఱుసంవత్సరములకుఁ బూర్వమునుండియుఁ బ్రస్తుత యుగమునందుఁ జేర్పఁదగినట్టియు, మనుమసిద్ధి వంశమునకు సంబంధించినట్టియుఁ, గవితాపోషకులయిన రాజులు కొందఱు కలరనియు, వారు కొన్ని కావ్యములను వ్రాసిగాని వ్రాయించిగాని యుందురనియు నూహింపవచ్చును. కృష్ణామండలమునందలి షట్సహస్రదేశాధీశ్వరుండగు బద్దెభూపాలుఁడు రచించిన నీతిశాస్త్రముక్తావళియు సుమతిశతకమును నాంధ్రదేశమునఁ బ్రచారమునను౦డుటచేఁ బైనివివరించిన కవితాపోషకులకంటె నీతఁడు ముఖ్యముగా గణింపఁదగినవాఁడు.

### మనుమసిద్ధి

ఈనన్నయయుగమునందుఁ జేర్కొనఁబడిన యితరరాజులు కవితాపోషకులైయుండిరని యూహించుటయేకాని మరియొకవిధమైన ప్రబలనిదర్శనము లేమియుఁ గానరానందున మనకవిత్వచరిత్రమునందు రాజరాజు తరువాత సుప్రసిద్ధకవితాపోషకుఁడు మనుమసిద్ధియేయని చెప్పవలసియున్నది. ఈమనుమసిద్ధితోడనే తిక్కనయుగము ప్రారంభించుచున్నది. కవిబ్రహ్మ రచించిన నిర్వచనోత్తరరామాయణమునకుఁ గృతిపతిత్వమును గాంచు మహాభాగ్యమును బొందుటచేతనే యీసిద్ధిరాజు సకలవిధముల నన్నయయుగములోని

రాజరాజుతోఁ దులఁదూఁగుచున్నాఁడు. కాని వానికింబోలె భారతకృతిపతిత్వము మాత్ర మీతనికి లభింపలేదు. మహాభారతమునందు నన్నయకంటెఁ దిక్కన వహించిన పవిత్రభావమే యిందుకు ముఖ్యకారణము. భారతాఖ్యంబగులేఖ్యంబైనయామ్నాయమును నరాంకితముగా రచించుచు వచ్చుటచేతనే నన్నయ యుద్యమము నిర్విఘ్నముగాఁ గొనసాగక పోయెనని తిక్కన యూహించి యుండును. నన్నయవలెనే యతఁడును రాజోద్యోగియై యాదివఱకొక గ్రంథమును బతికిం గృతియిచ్చి క్రమక్రమముగఁ గలిగిన హృదయ సంస్కారమువలన నట్టినరాంకిత మేహ్య మనియుఁ గావ్యగౌరవమునకొక పెద్దలోపమనియు నందు మహాభారతమువంటి పవిత్రగ్రంథమునకు నట్టి సంబంధము లేశము నుండరాదనియు నిశ్చయించి సోమయాజి తన భారతభాగమును దైవాంకితముగనే రచింప నారంభించెను. అది యునుంగాక తన రచింపందలంచిన మహాభారతమును నరాంకిత మొనర్పనని చేసికొన్న నిశ్చయమును దత్కావ్యమునందుఁ దాను వహించిన గౌరవభావమును బరికించి పరమేశ్వరుండు తన్ను శ్లాఘించినట్లుఁ దిక్కన యీ పద్యములలో సూచించుచున్నాఁడు.

క. పారాశర్యుని కృతియై
భారతమను పేరఁ బరగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్.

గీ. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కెద నియ్యకొని వేడ్కనూని కృతి ప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ!

మనుమసిద్ధి - భారతకృతి పతిత్వము

భారతము నాంధ్రీకరించు సంకల్పము తిక్కనకుఁ గలిగినట్లు తనకుఁ దెలిసినంతనే రాజరాజ నరేంద్రునివలెఁ దత్కృతిపతిత్వ మహాభాగ్యమును బొందవలెననునాశ సిద్ధిరాజునకు సైతమును బుట్టియుండకపోదు. నన్నయతో సమానుఁడగు మహాకవి తనయాస్థానమునఁ గూడ నుండుటయు, నన్నయవలెనే యాతఁడును నమ్మహాకావ్యరచనకుఁ బూనుకొనుటయు, నన్నయరచించిన భారతభాగమునకుఁ గృతిపతిత్వము వహించిన రాజనరేంద్రునియశశ్చంద్రిక లాంధ్రరాజ్యముల నెల్లెడల వ్యాపించియుండుటయు, తానును రాజరాజువంటి కవితాభిమానాయత్తచిత్తుండైన మహారాజైయుండుటయు, మనుమసిద్ధికి భారతకృతిపతిత్వకాంక్ష యేలకలిగింపకుండును? ఆతఁడు కీర్తికాముఁడు కాఁడా? కాని తిక్కనకుఁ దానెంతటి ప్రభువైనను, సకలవిధముల వానిచేనుద్ధరింపఁబడినవాఁడగుటవలన మనుమసిద్ధి వానియందు గౌరవాభిమానములే కాక భయభక్తులు సైతమును గలిగియుండి, యొకప్పుడు తనకృతిపతిత్వకాంక్ష నాతఁ డుపేక్షించినయెడలఁ దనకది లాఘవమనియెంచి,

"ఏనిన్ను మామయనియెడు
దీనికిఁ దగనిమ్ము భారతీకన్యను"

అని పూర్వమువలె విస్పష్టముగాఁ నడుగక, మఱియొకవిధముగాఁ దనయభీష్టమును వానికి స్ఫురింపఁజేసియుండును.

అమ్మహాకావ్యమును బరమేశ్వరార్పిత మొనర్పవలయునను సంపూర్ణసంకల్పముతో రచనాకౌతుకమువహించిన తిక్కనప్రభువాంఛితము నెఱింగిన పిమ్మటఁ గొంతవఱకు డోలాయమానమానసుం డైనట్లుగ నీ క్రిందిపద్యము సూచించుచున్నది.

"క. అనిరచనా కౌతుకమున
మనములరఁగ నీప్రబంధమండలి కధినా
థునిగా నేపురుషుని జే
ర్కొనువాఁడనో యను తలంపు కూరినమదితోన్."

నన్నయవంటి లోకజ్ఞుఁడు తన ప్రభువు నభీష్టము నీడేర్చి వానికత్యంత విఖ్యాతి చేకూర్చియుండఁ దానును నంతవాఁడై తన ప్రభువునకట్టి కీర్తిగౌరవములఁ గలిగింపకుండుట యుక్తమా యని తిక్కనవంటి స్వామిభక్తుఁడు సందేహించియుండకపోఁడు. అందుచేఁ దన ప్రభువును గౌరవించి కావ్యమునో, కావ్యమును గౌరవించి ప్రభువునో యగౌరవింపవలసిన యవస్థ తటస్థించుటచేతఁ దన ప్రబంధమండలి కధినాథుఁడుభూపతియాజగత్పతియా?ఏపూరుషుని బేర్కొనవలయునో యను తలంపు కూరిన మదితో, సోమయాజి యించుక నిమీలితనేత్రుం డైనంతనే దైవసాక్షాత్కారము వాని సందేహమునెల్లఁ దొలంగించెను. ఆస్వప్నవృత్తాంతమును వినినంతనే తద్భూకాంతుఁడును సంతసించి, తనకృతిపతిత్వకాంక్షను విసర్జించి, భారతరచనలోఁ దిక్కనను హెచ్చరించుచు నమ్మహాకావ్యనిర్మాణమునకు వలయు సౌకర్యములనెల్లఁ జేకూర్చుచుఁ గొనసాగింపఁ జేయుటచేతనే మనుమసిద్ధి కలంకములేని యశమ్మును సంపాదింపఁగలిగెను!



# సంసారజలధి

సంద్రంబులోమున్న భయమొందగాను
ఒడ్డునేనిల్వగా గోరితినేను
సంద్రంబులోమున్గి చూచితే అడ్డు
ఒడ్డుపై నేమి లేదనుకొంటినేను
సంద్రంబుపై దేలి చెప్పినానండి
ఒడ్డుపై వారి కచ్చటివింత నేను
సంసారసాగరం బునుగూర్చికూడ
అటులనే గ్రహియించి నానండి నేను.

(సాధకుడు)



# ముక్కు తిమ్మనార్యుఁడు

మండలేముల వేంకటశాస్త్రి గారు, బి. ఎ., యల్. టి.

ప్రబంధకవుల ననుసరించియు రసపోషణము నకైకొన్ని యవసరములయం దితఁడు భిన్నమార్గము నవలంబించియుండెనని వెనుకటిభాగమున దిక్ప్రదర్శనముగఁ దెలుపఁబడినది. తన ప్రబంధమున కుత్కృష్ట లక్షణముల నితఁ డెట్లు సంఘటించెనో కొంతవఱ కిచట విమర్శించెదము.

### కథ

ఈ ప్రబంధమునఁగల కథలోఁ గవికల్పితమగుభాగము చాలతక్కువ. కేవలము యథార్థమగుకథ యటులనే యుండనిచ్చినచో రసవంతముగ నుండుట యరుదు. కావున తిమ్మనార్యుఁ డీసందర్భమున నవసరములగు ఘట్టములలో మిగుల రసవంతముగఁ జేసెను. శ్రీకృష్ణుఁడు తనజవరాండ్ర నందఱి నర్మోవిధములఁ దనుపుచు, నొకనాఁడు రుక్మిణీరమణి మందిరమున నుండఁ గలహాసనముని యచటికి వచ్చి, మన్ననవడసి, పారిజాతకుసుమము నొకదానిని సమర్పించెను. "ఎవ్వరికి దీనినిత్తునా" యనునారాట మతనిమానసమునఁ దోఁచెను. అతనియనుజ్ఞచే నారదుఁ డాకుసుమమును రుక్మిణికి సమర్పించి, దానివైభవమును వర్ణించి యదితాల్చినకతమున దేవేరులం దామె మిన్న యని పొగడఁజొచ్చెను, కృష్ణున కియ్యది ప్రీతిఁ గొలుపకపోయినను, సహించి యూరకుండెను. కారణము, స్పష్టము. ఈవృత్తాంతము నితర స్త్రీజన మెఱిఁగిన ముప్పుగలుగు ననుభయ మతనిడెందమునఁ గలదు. అట్టిసందియమును దిగులును మనోవీథిని బాడము చుండఁగఁ గృష్ణుఁడు సత్యభామమందిరమునకు వచ్చినతోడనే, తనసంశయము నిక్కమని యతఁడు గ్రహించునటుల మందిరము పాడువారియుండెను. పేరలుకఁ జెందిన సత్యభామ నతఁ డనునయించుటయు, తనపాదముల కెరఁగినభర్తశిరమును వామపాదమున నామె తొలఁగద్రోయుటయు మొదలగు శృంగారరసప్రధానములగు ఘట్టములు చక్కఁగ వర్ణింపఁబడినవి. పారిజాతము నపహరింపఁ గృష్ణుఁడు కృతనిశ్చయుఁ డాయెనని మనకుఁ దెలిసినతోడనే ప్రథమాశ్వాసము ముగిసినది. శ్రీకృష్ణుల ప్రయాణసన్నాహమును, ప్రయాణమును ద్వితీయాశ్వాసమునఁ దెలుపఁబడినవి. సత్యభామకై కృష్ణుఁడొనరించిన మేరునాకవర్ణనము లిందుఁగలవు. అష్టదిక్పాలకులును శౌరిని దర్శించుటయు, నతని యవతారవిశేషములఁ గొనియాడుటయు, వైజయంతమున విడిసిన శ్రీకృష్ణుఁడు సత్యభామఁగూడి విహరించుచు,

పారిజాతమును జూచుటయు మూఁడవయాశ్వాసమునఁ దెలుపఁబడినవి. జలక్రీడాది విహారములు నాల్గవ యాశ్వాసమున సమంజసముగ వర్ణింపఁబడినవి. శ్రీకృష్ణుఁడు పారిజాతము నపహరించుటయు, నందనవనపాలకులతని నడ్డగించుటయును, నీవృత్తాంతము నెఱిఁగి దేవేంద్రుఁ డతనితోఁ బోర సమకట్టుటయు, సైన్యముల సిద్ధపఱుచుటయును గూడ నీయాశ్వాసమునఁ గలవు. యుద్ధమును, అందలి శ్రీకృష్ణవిజయమును, సత్యభామ వనమునఁ బారిజాతమునుఁ బ్రతిష్ఠించుటయును బంచమాశ్వాసమున వర్ణింపఁబడినవి. సత్యభామ పుణ్యకవ్రతానుష్ఠానము సలుపుటతోఁ గథ ముగిసినది.

కవివర్యుఁ డీకథను నిర్వచించుటలోఁ గొన్నివిశేషములఁ జూడవచ్చును. నాయెఱిఁగినంతవఱకుఁ బ్రథమాశ్వాసమునఁ గథనింతవఱకుఁ దెలిపిన ప్రబంధములు చాలఁదక్కువ. అలుకఁజెందిన సత్యభామను కృష్ణుఁ డెట్లనునయించుననియు, నామె యాతనియెడ నెట్లు ప్రవర్తించుననియుఁ దెలిసికొనఁ బాఠకులకుఁ గుతూహలము గలుగునని గ్రహించి, తనకథ యందనన్యసామాన్యమగు పరిణామమును గల్పించి దానిని బాఠకు లెఱుఁగుటకు వ్యవధి యుండరాదని తలఁచి, యనావశ్యకము లగు వర్ణనములను లోపింపఁజేసి, కవివర్యుఁడు ప్రశస్తి వడసెను. సామాన్యపుఁగవులు రుక్మిణి మందిరమునఁ గృష్ణుఁడు విహరించు ఘట్టమును సవిస్తరముగ వర్ణించి, నారదాగమనముతో మొదటియాశ్వాసము ముగించి యుందురు. మఱియొక విషయము; శ్రీకృష్ణుఁడు ప్రయాణమునకై కృతనిశ్చయుఁ డాయెనని తెలిసిన పిదప జలకమాడుట, భోజనము మొదలగునవి వర్ణింపఁబడినవి. సాయంకాలము, అంధకారమును, సతీసమేతుఁడై కృష్ణుఁడు నందనవనమున శృంగారవిహారము సలుపుటయు మొదలగునవి సమయోచితములుగను, సంగ్రహములుగను, మిక్కిలి మనోహరములుగ నుండునట్లును వర్ణింపఁబడినవి. ఆయాసందర్భములయందలి కథావేగమున కయ్యవి భంగముఁ గలిగించునవి కావు. మఱియు హృద్యములుగ నున్నవి. కావున, కథావేగమునకు భంగము గలుగని వర్ణనలనుమాత్రము తిమ్మనార్యుఁడు సమంజసములుగఁ జేయునని మన మెఱుఁగఁదగును.

పాత్రములు

ప్రబంధములందుండుపాత్రములఁ గూర్చి విమర్శకు లొక రీతిగ వ్రాసియున్నారు. "పాత్రములన్నియు నొక్కతీరుఁ దాల్చిన బొమ్మలు. అలంకార శాస్త్రప్రకారము చెక్కఁబడినవి. ఆయాకావ్యములలోని పాత్రములు నిర్జీవములట్లుండుటతోఁ బోయిన నెంతో పుణ్యము. అన్ని కావ్యములందలిపాత్రములు నొండొంటి ననుకరించు ప్రతిబింబములు. పేరుఊరుమాత్రము మార్చియుందురు.....స్వభావము, చరిత్రము, నడవడి, తీరు, మొదలగు లక్ష్యగుణములన్నియు నెరవలిసొత్తులు" ఈయభిప్రాయము పెక్కు ప్రబంధములయెడ యథార్థమని తోఁచును. దీనిననుసరించిచూచినచో, పాత్రములన్నియు ననితర

తుల్యములుగ నుండవలయును. మఱియు, నవి నిర్జీవములట్లుండక తీగలవలె నల్లుకవిగా నుండవలెను. అట్లయిన, సత్యములై మనోహారములుగ నుండును. స్వభావము ననుసరించవలెననిన చో నయ్యవి మిశ్రములై యుండవలయు. మన ప్రబంధమునఁ బ్రధానములగు శ్రీకృష్ణసత్యభామాపాత్రము లెంతవఱకు నిర్దుష్టములో, యించుక చూడవలయును.

శ్రీకృష్ణుఁడు భగవంతుని యవతారము. అతనియందు దైవమానుషచర్యలు మిశ్రితములై యున్నవి. తా నవతారపురుషుఁడని, తనసతీతిలకములు, నితరులును సామాన్యముగఁ దలఁచుట కవకాశము కలుగకుండునట్లతఁడు బ్రవర్తించును. బహుళముగఁ గళత్రవంతులగు మానవు లొందు కష్టసుఖములన్నియు నితఁడు స్వేచ్ఛగా ననుభవించెను. కథానాయకుని పాఠకుల కెఱుకపఱుచుచు, నతనియంగసౌష్ఠవముఁగాని, గుణలక్షణ కథనముఁగాని కవి చేసియుండలేదు. అట్లుచేయుట సామాన్యులపద్ధతి. ఆమహాత్ముఁ డెల్లర హృదయసీమలను నిత్యనివాసియై యుండుటచే నియ్యది యప్రస్తుత మగును. ఈవర్ణనకుఁ దొడఁగుట చర్వితచర్వణమగు మార్గము. నరకాసురునింటనుండిన "నెలజవ్వనమున్ బాలివోని వారి"ని "తన్వరునిగ గోరువారి"ని, బదియాఱువేవుర లలనామణుల నతఁడు వివాహమాడి యుండెనని తొలుదొల్తఁ దెలుపుట చక్కఁగ నున్నది. కథాసందర్భమునకు నాయకునిఁగూర్చి యీవఱకుఁ బాఠకు లెఱిఁగినఁ జాలును. సౌఖ్యైకలోలుఁడై, నారదుని పంపున నతఁ డెట్లొనరించెనని వ్రాయఁబడి యుండుటచే నాయకుని కిందు దోషముగలుగదు. ఎనమండ్రు పట్టమహిషులతోడను, వీరితో నతఁ డెట్లు ప్రవర్తించెనని పాఠకు లెఱుఁగఁ గోరుదురని తలఁచి.

శా. ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
ఛాయం జూచినఁ దానయై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి
నోలాడుభో, గాయత్తుండయి పెక్కురూపముల
మాయా కల్పనాచాతురిన్.

అని వర్ణించెను. మాయాకల్పనాచాతురి లేనిచో నిట్టికౌశల మలవడ నేరదు. దీనివలనఁ గృష్ణునియందు మానవస్వభావము పూర్ణముగఁ బొందు పఱుపఁబడినది. రుక్మిణీమందిరమున నతఁడు వినోదించుచుండఁగా నారదుఁడు విచ్చేయఁ దానును సతియు లేచి, నమస్కరించి, యాతనిఁ బరిచరించి, యనుమతి వడసి, తా నత్తినయవతారమున కనువగు ప్రాకృతపూరుషుని విధము ననుకరించుచు,

క. సురసంయమివర! మీ రిట
కరుదేరఁగ నిప్పు డేఁగృతార్థుఁడ నైతిన్
నిరతంబు మీరు నాపైఁ
గరుణ గలిగియునికి యిదియ కారణము సఖీ.

అని పలికెను. నారదునిరాకకుఁ గల కారణము దానెఱిఁగియు, నెఱుఁగనివానివలె నటించి, యతనిరాకచేఁ దనమందిరముఁ బవిత్ర మాయెననియుఁ దాను గృతార్థుఁడ నైతి ననియుఁ బలికి సామాన్యమగు గృహస్థధర్మము వెలయించెను. తనగృహమునకతిథియగు ఔషధసిద్ధునితో బ్రవరుఁ డాడినవిధము జ్ఞప్తికిఁ

చెచ్చుకొనిన, నీయవసరములు సమానము
లని తోఁచును. నారదుఁడు కృష్ణుని యవ
తారవిశేషములఁ గొనియాడి, పారిజాతము
నర్పించినతోడనే, నాయకుని మానసమున
నారాట ముదయించి యతని మానుషలక్షణ
ములను రెట్టించెను. ఆపాత్రము నిర్జీవమట్లు
బిఱ్ఱబిగిసియుండక, స్వాభావసిద్ధమగు మాన
వునివిధము ననుకరించుచున్నది. ఇంతవఱకుఁ
బ్రతివిషయము నీయర్థమునే బలపఱుచుచు
న్నది. కృష్ణుఁ డీఘట్టములలో దివ్యపురుషు
నట్లు ప్రవర్తించియుండలేదు. ఇది ప్రశంసా
పాత్రము. సత్యభామ మందిరమునకుఁ బోవు
నప్పు డతనిమనోధర్మముఁ జూడుఁడు! "కేతన
పటాంచల చంచలమై" యతనితాల్మి యొప్పె
ను. తత్తరము "తురఁగజవంబు మున్గడవఁ
ద్రోచికడఁగు"చుండెను. మనసు "తిరిగెడు బండి
కొండ్ల పగిదిన్" భ్రమియించుచుండెను. ఈవర్ణన
మెంతసత్యము; ఎంత స్వాభావసిద్ధము; మానుష
స్వాభావము నెట్లు ప్రకటించుచున్నది! సవి
మర్శకదృష్టితోఁ జదివి యీపద్యమునఁ గల
రసమును గ్రహించిన పాఠకులకెల్లరకు గృష్ణుని
పాత్రము తమహృదయముల కనతిదూరమై
యున్నదని తప్పక తోఁచును. ప్రత్యక్షమగు
పురుషుఁడా? కవికల్పితపాత్రమా? యనిసంది
యపడు నట్లుండును. తనసందియము యథా
ర్థమని గ్రహించి పేరలుకఁ జెందిన తన కాంత
ననునయింపఁబోయి పరిచారికచేతనున్న తాళ
వృంతముఁ గైకొని వీవఁజొచ్చెను. శృంగార
రసప్రధానమగు గంభీరోపన్యాసము సలి
పెను. మామామాచిత్వము, చెలిమెఱఁ దనకుఁ
గలకూర్మియు, విధేయతయును, ఆమె పనుపు
సెల్లించుట తనకుఁ బ్రాభవ మనుటయు,
మున్నగునవి కాముకుల నైజలక్షణములు.
కృష్ణుఁడు వీనినెల్లఁ బ్రకటించెను చూడుఁడు.

చ. మన మరయందలంచి యొకమార్గము
  వన్నితొ? నవ్వుటాలకో?
నను వెఱపించెదో? యకట! నాయెడ
  నిక్కము దప్పు గల్గెనో?
వనజదళాయతాక్షి! పగవాఁడనె?
  నన్నిటు లేల చూడ? వో
క్కనిముసమైన నీవు దయఁ
  గన్గొనకుండిన నిల్వనేర్తునే?

చ. పలుకుల తేనె లుట్టిపడఁబల్కువునేఁ
  డిదియేమి? వాలుగ
న్నుల నను సిగ్గునూల్కొనఁ
  గనుంగొనవేల? యురఃస్థలంబుఁ జ
న్నుల నెదురొత్తి మక్కువ ననుం
  బిగిగౌఁగిటఁ జేర్పవేటికే?
చిలుకలకొల్కి! యెవ్వ రెడఁజేసిరి?
  నీకిటు లేల చింతిలన్.

చ. మనమున మాటలం గ్రియల మన్ననలీ నొకనాఁడు
  నెట్టి కామినులకు గౌరవంబు మెఱమెచ్చులకై ఘట
  రింతుఁ గాని పాయనియనురక్తి నీయెడన యగ్గలమై
  కనుపట్టు నాకు నీ, పనిచిన పంపు సేయుటయుఁ
  బ్రాభవమా టది నీ వెఱుంగవే.

శృంగారరస ప్రధానమైన యీ పాత్ర
మున కారసము పోషించుట కన్నియవకాశ
ములు కల్పింపబడినవి. తన చేఁ గలప్రయ
త్నములన్నియు వ్యర్థము లగుటచే ఆ "జగ
న్నాటక సూత్రధారి యదునందనుఁ డర్మిలి
మ్రొక్కె" ననికూడఁ జెప్పఁబడియున్నది.
సత్యభామ తనవామపాదమున నతనిఁ దన్ను
టయు అదియే తనకు మన్ననఁగాఁదలఁచి

యతఁడామెను గోప ముడుగుమని ప్రార్థించుటయు మొదలగు నవసరములలో శృంగారరస మపూర్వముగా వర్ణింపఁబడెను.

శ్రీకృష్ణునిపాత్రము వీరరసముతోఁ గూడ నొప్పుచున్నది. కావుననే యతఁడు పారిజాతమును దప్పక తెచ్చెదనని బాసచేసి, పయనమాయెను. సతీసహితుఁడగుచు దిక్పాలకులమన్నన వడసి, వైజయంతమున విడిసియున్నతఱి, పారిజాతము నతఁ డపహరించెను. సురవీరులతో నతనికి ఘోరమగు సమరము గలిగెను. అతని బలప్రతాపము లెట్లు వర్ణింపఁబడియుండెను! చూడుఁడు!

సీ. కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప
నది శార్ఙ్గి తేజంబునందు డిందె
గనలి వృద్ధశ్రవుం డనిలాస్త్ర మేసిన
నది యదూద్వహుమూర్పునందు డిందె
నలిగి బలారి సౌరాస్త్రంబు నిగుడింప
నది శౌరి వలచూడ్కి యందు డిందెఁ
నడరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు పయిఁగొల్ప
నది మురాంతకునాభి యందు డిందె
ఆ. బాక దమ్మనఘుక్త పాశుపతాస్త్రంబు
హరినిజార్ధతనువునందు డిందె
నేమి వేయవచ్చు నీశ్వరుం డఖిలాత్ముఁ
డతని గెల్వఁ దనకు నలవి యగునె?

సీ. తలలు వీడంగ విద్యాధరుల్ పఱచిరి
గ్రగ్గులకాండ్రైరి ఖచరవరులు
చట్టుపై పోకలై చనిరి గంధర్వులు
గరుడులు పంచబంగాళమైరి
కన్నదిగతిగాఁగఁ గిన్నరు లరిగిరి
పన్నగేంద్రులు పటాపంచలైరి
పోయినపోకలై పోయిరి సిద్ధులు
దిక్కుమొకములైరి దిగధిపతులు.

గీ. హరిహయుఁ ద్రాణనాయత్తుఁ డగుచు వచ్చి
మునులు సంప్రార్థనావచోముఖరులైరి,
పూనితన మీఁదవచ్చు దంభోళినిట్లు
పంకజోదరుఁ డొడిసి చేపట్టుటయును.

ఇది వీరరసము! ఇటులనే యర్థము సంగ్రహముగ వర్ణింపఁబడి హృద్యముగనున్నది. వీరరసమునకుఁ జక్కని సహకారి యౌదార్యము; కనుక శ్రీకృష్ణునిపాత్రమున కిదికూడఁ బొందుపఱుపఁబడినది. పరాజితుఁడగు బలారి శరణు వేఁడి రక్షింపుమని జనార్దనుని వేఁడుకొనఁగా నతనివలనఁ దప్పేమియు లేదనియును, "నీమఱంద లీకొమ్మ, వదాన్యభూరుహము కోరినఁ దెచ్చితిఁగాని, కొమ్ము నీసొమ్మని వజ్రి కిచ్చి మధుసూదనుఁ డా తరువీఁ దలం"చెను. మేటియుద్ధమున గెలిచిన పారిజాతము నొక్కమాటలో నింద్రుని కిచ్చివేయ సమకట్టుట యుదారస్వభావమును బ్రకటించును. ఈ పాత్రమున నింకొక్క విశేషముఁ జూచి విరమింతము. పుణ్యకవ్రతానుష్ఠాన సమయమున సత్యభామచేఁ దాను ధారవోయఁబడి నారదునికి వలయు పరిచర్య సేయుట కొడంబడుట గడువిచిత్రము. హాస్యమున కతఁడుగూడఁ బనులఁ గొనుచుండెను! భక్తపరాధీనుండగు భగవంతుఁడు నారదునియభీష్టముల నెరవేర్చుట సామాన్యమేయైనను, కథా సందర్భమునఁ గృష్ణునిపాత్రమున కీవిశేషముగూడఁ బొందుపఱచియుండుట ప్రశంసాపాత్రము.

"సతీతిలకమగు సత్యభామపాత్రము నిటులే యనన్యసామాన్యముగ నిరూపింపఁ బడినది. కొంతవఱకామె సామాన్యస్త్రీవలెనే

సంచరించియు ననన్యసామాన్యములని చదువరు లేకాగ్రీవముగ నొప్పుకొనకతప్పనిలక్షణములఁగూడఁ గలిగియున్నది. 'కులమును రూపమున్ మగనికూరిమియున్ గలదాన నంచు' నామెకుఁ గొంతదర్పము గలదు. మఱియు శ్రీకృష్ణుని సతీతిలకములయం దామె సౌందర్యవతియనియు, మిగుల మానవతియనియు మహనీయసౌభాగ్యవతియనియుఁ గూడ వర్ణింపఁబడినది. కావుననే తనపతి సలిపినయవజ్ఞ యించుకైనను సహించు స్వభావము గలదికాదు. ఈమెగుణకీర్తన మెందైనఁ గవిచే నొక్కచోఁ జేయఁబడియుండ లేదు. కాని మానవతియని గ్రహించుటకుమాత్రము చాలయవసరములు గల్పింపఁబడినవి. తన శృంగారవనమునందు "చంద్రోపలవేదిపై సరసగోష్ఠిన్ బోటియున్దాను" నుండఁగా, దక్షిణనేత్రస్పందన మాయెను. తోడనే యామె యేమనుచున్నదో చూడుఁడు! ఈవఱ కింకను బారిజాతవృత్తాంత మామె కించుకయుఁ దెలియదు.

చ. అకట! యిదేమికో యెడమ గనయ్యెదితొయ్యలి!;
దక్షిణాంసమ్ము,చుకనేత్రప్రకంపమునూచన లేమి కో
పన్నగావు! సా,రెపు పద్మజాలిఁబొంది యొకరీతి డలం
కెడు; ప్రాణనాథుఁ డొండొక చపలాక్షిఁగూడి నను
నొల్లనిచెయ్దము లేమిచేసెనో.

మగనికూరిమి తనయం దధికముగఁగల దని సత్యకు గరువతనముగలదని కవి వర్ణించియుండుట యెంత హేతుసహితమ్మైయున్నది! తన బోటివలనఁ బారిజాత వృత్తాంతము నాలకించినతోడనే యామె మానసమునఁ గ్రోధముద్భవించినది. ఇది యీసునఁబుట్టినదని మనము గ్రహించదగును. అంతటి గరువతనము గల యామె కిట్టిమాటలు వినఁబడినచో, నొక్కపెట్టునఁ గ్రోధశోకము లుద్భవించియుండుట సామాన్యము. ఒకప్పు డవి మతిభ్రమను గలిగించునంతటి శక్తిగలవై యుండును. కొంత మానహానియును మగనికూర్మికిఁ గొంత భంగమునుఁ గలిగియుండుటచే, సత్యభామ "వ్రేటువడ్డ యురగాంగన"వలెనుండెనని వర్ణింపఁబడినది. ఈవర్ణన మెంత రసభరితము! ఎంతభావగర్భితము! తానంతటి మానహానిసైఁచి ప్రాణములు నిలుపుకొనఁజాలననియు నిర్లక్ష్యముగ నుసురుల విడువ సమకట్టియున్నట్లును సత్యభామ ఎటులు ప్రలాపించుచున్నదో చూడుఁడు:

ఉ. ఇన్నిదినంబులున్ మనతు రిందఱిలోఁగడుగారవమ్మొ
నన్, గన్నియ నన్ను వల్లభుడు గన్నులగప్పు కొనం
గ నుండి, యాయన్నెయు వారియున్ దఱిగి, వారు
ననున్ వల నెత్తిచూడఁగా, సన్నలఁజాయలన్ బలుక
సైఁతునె? ప్రాణము లెంతతీపొకో.

ఉ. ఓచెలి! శౌరి కిచ్చెనట నొక్కలతాంతమఁ దెచ్చి
నారదుం; డాచపలాక్షి కిచ్చెనట యాతడు నవ్విరి;
యిట్టిమాట లా, హా! చెవులో వినంబడియుఁ బ్రాణము
దాల్చెద మేన నింతగా, నోచితి నింక నిట్టివి గనుంగొన
నెమ్మెయి నున్న దానశో.

తన మగనికూరిమి యితరులయందుఁ గూడఁ గలదని దెలిసినచోఁ గులసతి యోర్వఁజాలదనుట కిది మంచిదృష్టాంతము. మానవకాంతఁబోలె యెట్లు విలపించుచున్నదో! స్త్రీస్వభావ మిందుఁ జక్కఁగఁ బొందుపఱుపఁబడినది. వారి సంభాషణములు, వారి యభి

ప్రాయములును, నాశయములును జక్కఁగ వ్యక్తపఱుపఁబడినవి. స్త్రీస్వభావము నింత చక్కఁగ గమనించి యీయుత్తమలక్షణముల సత్యభామపాత్రమునఁ బొందుపఱచియుండుట కవివర్యుఁడగు తిమ్మనార్యుని ప్రతిభకు మేటి నిదర్శనము. ఈవిషయము హేతుసహితముగ మనము గ్రహించుట కనువగుఘట్టమునుండి కొన్ని పద్యములుమాత్రము క్రింద నుదాహరించెద. పాఠకులే గ్రహించెదరుగాక! తన భర్తచేఁ బారిజాతము సవతి కియ్యఁబడినదని వినినపు డామె ప్రలాపించినవిధముఁ జూడుఁడు!

క. మునియేమి సేయును? రుక్మిణి
నొవ్వఁగ నేమి? ధూర్తగోపాలుఁడు చే
సినచెయ్ది మేను చెప్పను?
మనమెరిఁగెదు ప్రాణమైన మగఁడిట్లయినన్.
ఆ. ౧. ప. ౮౯.

క. పరికింపరు తమజాడలు
తరుణుల తగులములు నమ్మఁదగదండ్రు; వడిన్
శరవంబుచలచిత్తులు
పురుషులెపో; వారినమ్మఁబోలునె చెలియా!

క. కలకాల మొక్కఁగతిఁబూ
సలలోదారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడు పురుషులు గలుగుట
తొలుజన్మము నోముఫలము తోయజనేత్రా!

క. ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నొర్వంగవచ్చు మగఁడింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె! యింక నేటిమాటలు చెప్పుమా.

సతీతిలకములు దమకుఁగలిగిన భంగపాటునకుఁ గొంతవగతురు. అది తమ సవతుల కెఱుకపడినచో వారిదుఃఖము రెట్టించినదగును. ప్రాణనాథుఁడు దమ కగౌరవము గలుగుచుండఁ జూచియు, వినియుఁ దటస్థుఁడై యుండినచో నా క్రోధాగ్ని మఱియు దీపించును. మగనిచే నవమానింపఁబడిన సతి కెల్లరచేతను గూడ నగౌరవమే కలుగునను సిద్ధాంతము చేయుట స్త్రీస్వభావము. కావుననే "మగఁడు కొట్టినచో మాధవకబళపువాఁడు గొట్టు" ననుపామెత. సత్యభామగూడ నిట్టి సందర్భమున నేమనుచున్నదో చూడుఁడు!

చ. అతులమహానుభావుని యవ్విరిదాలిక పెద్దఁజేసియు,
చ్యుతునకు నిచ్చకం బొదవ సూడిద యిచ్చిన
నిచ్చెఁగాక తా, నతఁడు ప్రియంబుగల్గు నెడ కర్పణఁ
జేసినఁ జేసెఁగాక యీ, మతకరి వేలుపుం దపసి మమ్ముఁ
దలంపఁగ నేల యచ్చటన్.

పైఁ గనిన భాగమునందంతటను సత్యభామ మిగుల గఱువయని సూచింపఁబడినది. కావ్యమందంతట నిటులనే యేకరీతిగా నామె పాత్రము నిరూపింపఁబడినచో, మన కా పాత్రమునందును గవియందును గూడ గణ్యత చాల తఱిగియుండును. కేవలము సామాన్యమగు ప్రవర్తనమును గవి యలవఱచి జేసినచోఁ గవికల్పితపాత్రము మన హృదయసీమలయందు నిత్యముగ నివాసము గలిగి యుండఁజాలదు. అందువలనఁ గవివర్యుఁ డీపాత్రము ననన్యసామాన్యముగ నుంచుటకుఁ బ్రయత్నించి దాని కనువగు లక్షణము లొకటిరెండు మాత్రము పొందుపఱచెను. మగనికూర్మి నట్లు చూరఁగొనినదని వర్ణింపఁబడిన సత్యభామ యంతటి మానవతి, కింతటియవమానము గలిగినచో, నట్టియలుక సామాన్యముగఁ దీరిన విశేష ముండఁబోదు; అనునయించుటకుఁ బురుషపాత్రి [illegible]

ప్రయత్నము సేయవలయును. కావుననే డోలాయమానమానసుఁడగు శ్రీకృష్ణుఁడు సత్యభామమందిరమునకువచ్చుచుఁ జాలభయపడుచుండెనని వర్ణింపఁబడినది. నిత్యకల్యాణి యగు నామెవిలాసము క్రోధావేశముననుండ నెట్లు వికృతమయ్యెను, చూడుఁడు!

ఉ. మాసినచీర గట్టుకొని మానముతోడ నిరస్తభూషయై
నా సెనకట్టుగట్టి నిడువాలికగస్తురిపట్టువెట్టి, లోఁ
గాసిలి చీకటింటికడ కంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజవిషాదవేదనన్.

చ. ఒసరుహపత్త్రలోచనకుఁ
బెల్లగుమోహము సంఘటిల్లె, వె
క్కసమగు నవ్వగల్ వొడమె,
గంపము పుట్టెఁ, జెమర్చె మేను, మా
నసమున విన్నఁబాటొదవె,
నాటెఁ గడున్ బరితాపవేదనల్
మసకపుఁబాముకాటుగతి
మత్సరమన్ విస మగ్గలింపఁగన్.

చ. పెడవెడఁ గన్నుమూయుఁ గను
విచ్చు నగున్ దలయూఁచుఁ బాన్పుపైఁ
బడు నుసురందు లేచుఁ బడ
బాటును దత్తరమున్ జలంబులో
నడరఁగఁ గోపవేగమున
నగ్గలమైన మనోజబాధలన్
బడి మదహస్తిహస్తగత
పద్మినియున్ బలె సొంపు పెంపఱన్.

సత్యభామయున్న యవస్థను గవి వర్ణించిన విధము ననుసరించి మనఃఫలకమునఁ జిత్రించుకొనిన నీవర్ణన మెంతవఱకు స్వాభావసిద్ధమో మనకుఁ దెలియఁగలదు. క్రోధావేశమున నామె "మధ్యందినభాను మండలకరావళి హావళివాడియున్న తీగెం దలపించు" చుండెనట. తనవల్లభునిరాక పారిజాతవాసనలచే గ్రహించి, విస్మయమంది యామె ముసుంగు ద్రోచి నల్గడలఁ జూచుసరికి "సంభృతతాలవృంతుఁ"డగు కాంతుడు చూపట్టెను. దైవోపహతి నొంది, బంధుపరామర్శచే విషాదమధికముగఁబూను పామరస్త్రీజనము ననుకరించుచు నామె కన్నీరు నించినది. తిరుగ ముసుఁగిడినది. ఏమికారణము? భర్త తనక్రోధమును గమనించి, యనునయింపఁ గృతనిశ్చయుఁడై యుండెనని యామె గ్రహించినది. ఇఁక నెంత బింకముఁ బూనినను గార్యము ఫలించుననుటలో సందియము లేదు. శ్రీకృష్ణుఁడు గంభీరోపన్యాసమును జేసెను. లాభము లేకపోయెను. ఆమె యనుగ్రహము రవంత దప్పినచో నిలువఁజాలనని తెలిపియుండెను. ఇంత మాత్రమున నామె క్రోధముచల్లారినచో నేమి విశేషము గలదు? తన్నవమానించినవారికిఁ దనచే సరియగు భంగపాటు గలిగినఁగాని మానవతి క్రోధము చల్లారకుండుట గొప్ప మనస్తత్త్వము. అందుచేతనే గ్రంథములందుఁ గని వినియెఱుఁగని నూతనపరిణామ మీపాత్రమునకుఁ గవి పొందుపఱచెను.

ఉ. పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబు దీర్ప
నై, ప్పాటను బాటఁగామి మృదుపల్లవకోమలతత్పద
ద్వయి, పాటలకాంతి మౌళిమణిపంక్తికి పన్నియ
వెట్ట నాజగన్నాటకసూత్రధారి యదునందనుఁ
డర్థిలి మ్రొక్కె మ్రొక్కినన్.

మ. జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధుకన్న తండ్రిశిర మచ్చో వామ
పాదంబునన్, దొలఁగం ద్రోచె లతాంగి, యట్లయ
గు నాథుల్ నేరముల్ సేయఁ, జేరలుకం జెందిన
యట్టి కాంత లుచితవ్యాపారము ల్నేర్తురే!

ఇట్టిపరిణామము కేవలము విపరీతము. అనన్యసామాన్యము. పాఠకుల కిట్లుతోఁచిన స్వభావ విరుద్ధముగఁ దనపాత్రము ప్రవర్తించుదోషము గలుగునని తలఁచి, యీస్థితిని గవి యెట్లు సమర్థించెనో గ్రహించునది. క్రోధావేశమున నిట్టి ప్రవర్తనము సహజమేయని పాఠకులచే గ్రహింపఁగలిగి యుండుటచే, మనోధర్మములను గవి పాటించెనని తెలియుచున్నది. సామాన్యుఁడగు కవీశ్వరుఁ డిట్టియౌచిత్యమును దన పాత్రమునకు సంఘటించుటకు వెనుదీయును. సత్యభామ క్రోధరసము క్రమముగ విజృంభించి, యొక్కసారి పొంగి పొరలినది. కావుననే తనభర్తను వామపాదమునఁ దన్నినది. ఇదియే క్రోధరస ముప్పొంగిన యవసరము. ఇంకను బ్రాణనాథుఁ డనునయించుచునే యుండెను. తోడనే క్రోధము పలుచఁబడుచుండెను. తొలుత మాటాడనోడిన సత్యకుఁ దన భర్తను దూరుటకు శక్తి గలిగినది. తాను బ్రాణముల విడుచుటకుఁ గూడ సిద్ధపడియుండెననియును, మానవతికి ప్రాణముకంటె మానమే యధికమనియు నుపన్యసించి తన్నంత చుల్కన చేసెఁగదా యను తలఁపున గ్రోధరస మింకొకసారి పొరలివచ్చుటచే, "సంతర్బాష్ప యగుచు, నవనతముఖియై, ఘనతరగద్గదికా నిస్వనమున మరి మాటలాడ శక్యముగామిన్.

ఉ. ఈసునబుట్టి డెంపమున హెచ్చిన శోకదవానలంబు
చే, గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లతాం
గి పంకజ, శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి
బాలపల్లవ, గ్రాసకషాయకంఠ కలకంఠవధూకలకాక
లీధ్వనిన్.

ఆక్రోశమున కిదియు మంచి పరిణామము. దీనితోఁ గ్రమముగ నారసము నీరసమగుచుండుట సామాన్యము. ఇదియెంత స్వభావసిద్ధము!

మఱియొక విషయము. సత్యభామవీరపతివ్రతాలక్షణము లధికముగఁ గలమానిని. గఱువతనముగూడ మెండు. కావునఁ బారిజాతాపహరణోద్యోగమున దనభర్త ననుసరించి నాకమునకుఁ బోయియుండుట సహజమే. నరకాసురుని గెలుచునవసరమునఁ బ్రాణనాథునికి సాయపడినమేటి! నారదుఁ డీవిషయమును ధ్రువపఱచుచు "అనికై నన్ బతి నిన్నుఁ బాసి చనునో" యని సత్యభామను బ్రశంసించెను. నాకభటులు శ్రీకృష్ణునడ్డగించు నవసరమున సత్యభామ వారితోఁ బలికినవిధముఁ గనుఁగొనుఁడు.

సీ. వినుఁడు సురేశ్వరువనపాలకులు! వార్ధిఁ
బొడమిన యీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె? యింద్రుండు నెవ్వఁడు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె, నతఁడె చేకొనఁగాక
లేక లేర యిదియేమి యొకరిసొమ్ము!
యిదె నాదువిభుచేత నీవదాన్యనగంబు
నోడియించుకొని యేగుచున్నదాన!
గీ. బలుకు లేటికిఁ దా వీరపత్ని యేని?
మీశచీదేవి తనదుప్రాణేశుఁడైన
మఘువు నిటఁ బంపి సత్యభామాభిధేయు
వలన మరలంగఁ గొనుట పోవాసితనము.

ఇదియుఁగాక సత్య చేజరిగిన పుణ్యకవ్రతానుష్ఠాన మామెయందు భక్తిరసమును వృద్ధిచేయఁదగియుండెను. ఆ వ్రతవిధాన మంధుల కనుకూలముగనే నారదునిచే నివేదింపఁ

భడియె, సత్యాకు గాలివతనము చాలపాలకుఁ దత్తిగి వినయసంపద యబ్బుటయే పుణ్యక ప్రతానుష్ఠాన ఫలసిద్ధియని శ్రీకృష్ణుఁడును, నారదుఁడును దలఁచియుందురు. అదియు యథార్థమని మనముగూడ గ్రహించుట యుక్తము.

పాత్రనిరూపణమునందుఁ దిమ్మనార్యుని కళాపాండిత్యమును దిక్ప్రదర్శనముగఁ దెలుప నింతవఱకుఁ బ్రయత్నింపఁబడినది. తక్కుంగల పాత్రములు నిట్లు నిరూపింపఁబడి నవని గ్రహించఁదగును.

వర్ణనములు

గూడ్డ సమయోచితముగ దిమ్మనార్యునిచే జేయఁబడియున్నవి. సామాన్య ప్రబంధములలో నివియ ముఖ్యము. ఇందు సమంజసము లనిపించునట్లున్నవి. అనఁగా నియ్యవి కథావేగమున కాటంకముఁ గలుగఁజేయఁజాలవు. మఱియు సంగ్రహములును, భావగర్భితములును, మనోహరములు నైయున్నవి! ప్రబంధములయందు సాధారణమయిన అష్టాదశవర్ణనలు నుకలవు. ఒకటి రెంటినిమాత్రము చూపెదను! ద్వితీయాశ్వాసమున నక్షత్రములను వర్ణించు నవసరమున :

సీ. కార్కొన్నకటికి చీకటి మొగల్మాత్తంబు
    గురిసిన వడగండ్లగుంపు లనఁగఁ
గవజక్కవలు వాయఁగర వాశములఁ జందు
    రుండాడు పటికంపుటుండ లనఁగ
నల్లెడ మిన్నేటియిసుమున నచ్చర
    కొమ లిడ్డ వెన్నెలకుప్పలనఁగ
దెలివి వెన్నెల వెంజితీగలు నిగిడెంచు
    [illegible] కవ్వాచ్చు బెజ్జములనంగ

గీ. జగము గెల్వంగ దండెత్తు మరునిఖాఁడ
    లీల రతిచల్లు దీవనప్రాలనంగ
    వేడిమెలుఁ గొండఁ గ్రాగినవిన్ను వేన
    నెక్కొనెడు చెమటబొట్టులనాఁ జుక్కలమరె.

స్వభావసిద్ధములగు మనోధర్మములను గూడ నతఁడు వర్ణించినవిధము నిదివఱకే జూచియే యున్నారము.

ఇన్నివిధములఁ దిమ్మనార్యుఁడు దన కృతికి వన్నెవెట్టి ప్రశస్తి వడసెను. సంగ్రహమయ్యు రసభరితమగు కథయును ఔచిత్యమునకుఁ బెట్టినపేరులగు పాత్రములును కవి కల్పితములయ్యుఁ బాఠకుల హృదయసీమల నాటుకొనఁజాలు లక్షణముల నయ్యవి వెలయించుటయును బ్రశంసాపాత్రములు. చేయఁబడినవర్ణనము లప్రస్తుతములుగాక, సందర్భశుద్ధిగలిగి, కథావేగమున కించుకంతయు భంగము గలిగింపనివిగా నుండుటయుఁ గవివర్యుని యసాధారణప్రతిభకు మేటినిదర్శనము. శైలి వీనికనుగుణమై, ద్రాక్షాపాకముగ నుండుటచేఁ బాఠకులకు మరియు హృద్యమౌ. "ముక్కు తిమ్మనార్యు ముద్దుపల్కు" అను సార్థకబిరుదమును జదువరులెల్లరు యథార్థమని గ్రహించుటకుఁ దగిన నిదర్శనములు పెక్కు లీవఱకే చూపఁబడినవి. ప్రబంధకవుల యందు దుత్తమస్థానమీ కవివర్యునకుఁగలదా యని సందేహించువారుండరని నాయభిప్రాయము. అట్టివా రుండిరేని, యీ ప్రబంధము నామూలాగ్రముగ, సవిమర్శకదృష్టిని జదివినచో నీవ్యాసమునఁ దెలుపఁబడినది కేవలము యథార్థమని తోఁచును.

# జీవమా! నీ రహస్యంబుఁ జెప్పవేల?

మల్లాది చంద్రశేఖరరావు గారు, బి. ఏ.

ఇంతయాస నీకేలనో! సుంతయైన
చింత సేయవు, నీకెట్టి చింత లేదో?
నీవునివసించు గేహంబు నిత్యమానె?
చాలచిత్రంబుగాదె, నీజాడచూడ?
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

ధాత్రినీదు గేహంబు నిత్యంబుగాదు,
చూడ బుద్బుదప్రాయంబు సుమ్మియిద్ది,
నీకునచ్చిన నిముసంబు నిలుతువిచట,
విసుగుజెందినక్షణములో వెడలెదీవు,
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

చక్రవర్తిని జేయంగఁ జాలెదీవు,
ఎంతయో, నిరుపేద నిర్మింతువీవు,
సుఖముగా దేహిజీవింపఁ జూచెదీవు
కష్టసంతతి నొందంగఁ గాంచెదీవు.
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

సంతతానందవారిధిముంతువీవు,
తీరరానిదుఃఖాబ్ధిని దేల్తువీవు,
ఆసఁగల్పించి, యొకసారి యలరెదీవు,
పెట్టియాసయు లేదంచు నేడ్చెదీవు,
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

సోదరులటన్న మిత్రతఁ జూపెదీవు
పరులయెడ ద్వేషముం గనబరతువీవు
శాంతియే నొకసారివీక్షింతు వీవు
కనులరక్తప్రవాహంబుఁ గాంచెదీవు.
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

భర్మహర్మ్యంబులందున వరలెదీవు
పూరికొంపలలోపలఁ బొగిలెదీవు
సాధుమార్గానకాలంబు జరిపెదీవు
చెడ్డమార్గానఁ బోయెడి చెనఁటివీవు.
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

సింహమై వనిలోన గర్జింతువీవు
శునకమై యింటికావలిఁ జూచెదీవు
హరిణమౌచు నడవులందుఁ దిరిగెదీవు
గోవువై పడసెదవు మ్రొక్కులనునీవు.
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

కీర్తిచంద్రికల్ వెదచల్ల నేర్తువీవు
మానభంగంబుగల్గిన మనియెదీవు
దానధర్మంబుఁ జేసెడి దాతవీవు
గృద్ధిగవ్వయు నీయనిలోభివీవు
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

మోహబంధంబుల న్బెంచి మురిసెదీవు
ప్రేమపాశంబులం ద్రుంచి వేతువీవు
ధరణి నీయాత్ర స్థిరమంచుఁ దలఁతువీవు
చిటికలోఁ బోయెదనటంచుఁ జెప్పెదీవు.
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

ధర్మపథమును శోచంబుఁ దప్పవీవు
సత్యమొక వేళ విడనాడఁ జాలెదీవు
పృథ్విఁ గొండంతయాసఁ గల్పించెదీవు
అక్కటా! మృగతృష్ణ వెంటాడెదీవు.
జీవమా! నీరహస్యంబుఁ జెప్పవేల?

# శ్రీనాథుని పలనాటి వీర చరిత్రము

ఓగేటి వెంకట సుబ్బయ్య శాస్త్రి గారు

ఆంధ్రదేశమున నీ పలనాటి వీరులచరిత్ర మనేకులచే పాడబడుచున్నది. జంగముకథగా చెప్పబడుచున్నది. ఈకథను వినినవారెల్ల పౌరుషావేశ పరవశులగుదురు. ఈ వీరకథానులాపముచే జొక్కి పరవశము నొందనివా రెవ్వరు నుండరు. జడపదార్థములనుగూడ కరగించి ఘనకార్య సమాచారమునకు ప్రోత్సహించు దివ్యశక్తి యీకథయందు గలదు. బ్రహ్మనాయుడు, బాలచంద్రుడు, కన్నమనీడు, అనపోతు, అమిత పౌరుషవంతులు. వీరికన్నను, అలకామరాజు మంత్రిణియై రాజ్యమును నిరంకుశముగా నేలిన వీరవనిత నాగమ్మ పౌరుషవంతురాలు. రాణివాసము కాపాడ నియోజితయై వీరులందరును యుద్ధరంగమునకుబోయినప్పుడు రాణివాసమున నుండనొల్లక యుద్ధమునకు వెడలిన కాంతమాడచి పౌరుషవంతురాలు. వయస్సునఁ జిన్నదియయ్యు, మున్నెన్నఁడు భర్తృసుఖము జవిచూడనిదయ్యు, వీరమరణము నాసించుచున్న బాలచంద్రుని నాశీర్వదించి ఖడ్గమునిచ్చి పంపిన మాంచాల పౌరుషవంతురాలు. ఇట్టి వీరచరిత్రల సంస్మరించుటవలననే తరతరమువారు ధన్యులయ్యెదరు. ఇట్టి వీరుల చరిత్రలను ప్రతియాంధ్రుడును, ప్రతి భారతీయుడును నెరుంగకుండుట యెంతయు లజ్జాకరము.

## శ్రీనాథ విరచితము

ఈ పలనాటివీరుల విక్రమప్రౌఢిమను ఆంధ్రదేశమున శాశ్వతంబుగ వరలునట్లు రచియించిన శ్రీనాథకవిరాజు నుతింప నేరికి తరము? గ్రంథము చదువమొదలిడిన నాపుటకు బుద్ధిపుట్టదు. ఎన్నిసారులు చదివినను వన్నె తరుగదు. ఎన్నిసారులు విన్నను ప్రోత్సాహరసము కొరవడదు. మహాకవుల రచనలన్నియు నిట్టివియే. ఈకథయందు వీరరసము, రౌద్రము మాత్రమే కాక శృంగార, హాస్య, కరుణరసము లన్నియు నాయాచోట్ల శ్రోతల మనములకు రసాతిరేక మొనగూర్చుచున్నవి. చిత్రవర్ణనలయం దీకవి యసమానుడు. మానవులకు తమ దేశముపట్ల ప్రేమను గలిగించి, దేశ గౌరవమునకును, దేశ క్షేమమునకును తమ సర్వస్వమును ధారబోయగలుగు త్యాగులను జేయుటయం దీయనకుగల ప్రజ్ఞ మరెవ్వరికిని లేదు. ఈతడొక్కడే ఆంధ్రప్రజల హృదయమును సరిగా నెరింగినవాడు. ఈతడొక్కడే ఆంధ్రవ్యక్తిత్వమును నిలువబెట్టినవాడు. శివభక్తిపరుడనని చెప్పుకొనినను, విష్ణుభక్తులయెడల నీతనికి గౌరవము మెండుగానుండెను. తానుచంద్రశేఖరు నెట్లు స్తోత్రముజేసెనో, నారాయణుని గూడ నట్లే కీర్తించెను. పార్వతీదేవి నెట్లు కీర్తించెనో, లక్ష్మీదేవినిగూడ నట్లే వర్ణించెను. ఈకవివర్ణన లతి మనోహరములును, హృదయాకర్షకములును నైయున్నవి. అతడు పరవశుడై విష్ణునిట్లు కీర్తించమొదలిడినాడు:

"కమలామనోహర గజరాజవరద
కాంచనాచలధీర కందర్పజనక
పక్షీంద్రవాహన పన్నగశయన
శశిరవిలోచన జలజాతనాభ
పరమదయాకర పాపవిదూర
కామితమందార ఘననీలవర్ణ
మాకాంక్షలీడేర్పు మాచెర్ల చెన్న"

ఇట్లే పెక్కుచోట్ల శివునిగూడ కీర్తించియున్నాడు. శ్రీనాథమహాకవి పలనాటిసీమయం దుండు గట్లకును, నదులకును, చెట్లకును, లతలకును, రాళ్లకును చైతన్యమొసంగి వాటిని పుణ్యవంతముగా నొనర్చిన ఘనుడు. కార్యమపూడి, గురజాల, మాచెర్లపట్టణము లతనికి కాశీ, గయా, ప్రయాగలకన్న ప్రియతమములు. కార్యమపూడి యుద్ధరంగము, కురుక్షేత్రభూమికన్న పుణ్యవంతమైనది. నాగులేరాయనదృష్టియందు, ఆకాశగంగయే. నాగులేటియందు పడియుండు చిన్నచిన్న రాళ్లతనికి శివలింగములే. నాగులేటి నాయన యిట్లు వర్ణించియున్నాడు:



మహాత్ముడు మదరాసు ఆయుర్వేదిక్ ఫార్మసీని తిలకించి వెడలుట

ప్రెస్ ఫోటో బీరో, చెన్నపురి.



హిందూపత్రికా కార్యాలయమున మహాత్మునిచే జరుపబడిన
కీ. శే. యస్. కస్తూరిరంగ అయ్యంగారి చిత్రప్రతిష్ఠాపనమహోత్సవము
గా. శ్రీ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు అధ్యక్షులు
హిందూపత్రికా సంపాదకులు శ్రీ యస్. రంగస్వామిఅయ్యంగారు
స్వాగతపత్రమును జదువుచున్నారు

ప్రెస్‌ఫోటో బ్లాక్, చెన్నపురి.

"వెనుకటిరాజులు విక్రమస్ఫూర్తి
గట్టునచెలరేగి కదనంబుసలుప
'వీరులరక్తంబు విసువకత్రావి
మత్తిల్లియల్లన మలయుచునున్న
నాగులేఱల్లదే నాయనిసుతుడ!
పాలేటియఱుముచే బగిలి భూధరము
నాగాధిపతి ప్రాణనష్టంబుచేసి
నడుముగాబాటిన నాగులేఱాయె
గన్నులపండువై కన్పించెజూడు.'"

తన మాతృదేశమునం దుద్భవించిన సమస్త వస్తువులును అతని కత్యంతప్రియములు. వాటినన్నిటిని ఆయన మిక్కిలి మనోహరముగా వర్ణించియున్నాడు. ఎద్దులను గుఱ్ఱములను, గజములను నత డత్యంతశ్రద్ధతో వర్ణించియున్నాడు. పలనాటి యడవులయందు కడుపార మేత మేసి,నాగులేటినీరుద్రావి బలిసి, కన్నులపండువుజేయు, యెద్దులను పేరుపేర బిలచి

"వచ్చినయెద్దుల వరుసతో జూచి
'వన్నెలు చిన్నెలు వడిచెప్పికొనుచు
నెత్తురుకొమ్ముల నేదైనవాని
కణుపుతో కలుగల కరిబొల్లివాని
నచ్చుగాకరినన్నె లమరినవాని
డిల్లనివన్నెల తెలినైనవాని
బచ్చనివన్నెల ప్రబలినవాని'.

బండ్లకుగట్టి వీరులందరు యుద్ధభూమికి కదలిరి. నిజముగా నొకజాతి యైశ్వర్యమును చాటుట కాదేశము నందుండు పశుగణమే చాలును. వ్యవసాయమునకుపశువులు ముఖ్యముగనుకనే, గోవులను మనవారు పవిత్రముగా నెంచి వాటి కేమాత్రము హింస గలుగజేసినను సహించకున్నారు. వృషభమును శివుని వాహనముగా చేర్కొనియున్నారు. వృషభములను మాత్రమే కాక, మదపుటేనుగులను, అశ్వములను శ్రీనాథకవి చక్కగా వర్ణించియున్నాడు.

పలనాటి వీరచరిత్రమున శ్రీనాథకవి తన రాజకీయపరిజ్ఞానమంతయు చాటియున్నాడు. భట్టు నలగామరాజుసభలోని కేగి, యాతనితో సంభాషించిన విధము మిక్కిలి హృద్యముగా నున్నది. మహారాజ సభలయందు మెలంగుచు, రాయబారులను చూచుచు, వారి సంభాషణములను వినుచుండినమహాకవికీవర్ణనలు లెక్కా? పరతంత్రజనముల పాలికష్టములను శ్రీనాథుడు చక్కగా గుర్తెరింగియున్నాడు. ఈ మహావాక్యములను ప్రస్తుత కాలమున నందరును చదివి,మనలను పీల్చిపిప్పిచేయుచున్న పారతంత్ర్యమునుండి తప్పించుకొనుట కుపాయము లరయుదురు గాక!

"పరతంత్రజనముల పాలికష్టములు
చెప్పంగనలవియే శిశువునకునైన
బంజరంబుననున్న పక్షులరీతి
(బంధించి పాములవాడు పెన్బుట్ట
బదిలతబెట్టిన పాముల భంగి
గంగిరెద్దులవాడు కావరమడచి
ముకుదాడు పొడచిన పోతెద్దులట్ల
బోనులో నుంచిన పులులవిధంబు
స్వాతంత్ర్యరహితతబడియుండవలయు
బరికింపగా మనోవాక్కాయములను
నైజదుర్గ్రాహ్య మానసమరితప్ప
వాక్కాయములురెండు బంధింపబడును
మనసులో బుట్టిన మంచితలంపు
లాచరణమునందు నలవికాకున్న
జన్మఫలం బేమి చచ్చుటే మేలు
అన్యత్ర కీట తిర్యగనేక హీన
యోనులలో నెన్నియోమార్లుపుట్టి
పడయకపడయుక పాసినయట్టి
దుర్లభనరరూపు దూషితం బగును
పార్థివా! యిటువంటి పారతంత్ర్యంబు
కటకటా పగవారికైనను వలదు)"

ఈవాక్యములనుబట్టిచూడ శ్రీనాథసుకవి బానిసలస్థితినిజూచి యెంతవిచారించెనో మన మెరుంగగలము. ఇంతియకాదు. యుద్ధమువలన దేశమునకుగలుగు అనర్థకములు చక్కగా వర్ణించి అన్నదమ్ములవారికి యుద్ధము చేయుట తగదని భట్టుచేత చెప్పించి యున్నాడు. ఈ వాక్యములు భారతములో ధర్మరాజువాక్యములనుబోలి, వాటికన్న సులభముగను, పామరజనంబులకు సుబోధకముగను నున్నవి. శ్రీనాథునకు బాలురశక్తియందు విశ్వా

సము మెండు. ఏదోయొక మహత్కార్యము సాధించవలెనన్న దానికి బాలురే పూనుకొనవలయును. పెద్దలు పిరికి పారుదురు. బాలురకు భీతిగాని, సంకోచములుగాని యుండవు. ప్రస్తుతసమయమున యీవాక్కులయర్థ మందరకును గోచరింపక మానదు.

"మానాభిమానముల్ మగటిమిమించ
ప్రబలింపగలవారు బాలురేసుమ్ము
బాలురే పెద్దలు బల్లిదుల్ వారి
బాలురకే వృద్ధి పరికించిచూడ
పెద్దలుమతిచెడి పిరికిపారుదురు
పాంచభౌతిక దేహ ఘటిమక్షీణించు
మనసుచలించును మాటిమాటికిని
ధైర్యంబుతగ్గు నుత్సాహంబు లుడుగు
వయసుమీరినవేళ ఏమ్చునాబాల్మి
కీర్తికైనను నపకీర్తికైన
బాలుర పైనుండు భారమంతయును."

ఈవాక్యముల సత్యమును గ్రహించవలయును. బాలురు భగవదంశసంభూతులు. వారియందుశక్తులన్నియు నిమిడియున్నవి. ఈకాలపు బాలురును తమశక్తిని గమనించి, ఆత్మశక్తిని గోలుపోవక, పారతంత్ర్యమునుండిమన జాతిని విముక్తిచేయుటకు సిద్ధపడుదురు గాక!

వీరిచరిత్ర మంతయు నిట్టి యుత్సాహకరములైన వాక్యములతోడను, మనస్సున కాహ్లాదము నింపి, యసమాన ప్రజ్ఞావిశేషములుజూపు చిత్రవర్ణనలతోడను నిండియున్నది. అనన్యసామాన్య కవితాధోరణిని, పామర జనము లాలించి యుబ్బి తబ్బిబ్బులగునట్లు యీచరిత్ర రచియింపబడినది. ఈగ్రంథమును శ్రీనాథసుకవి వ్రాయుటయు, ఆతని సర్వశక్తులకును స్వతంత్రమునీయగలిగి మంజరీద్విపదవృత్తమునందు వ్రాయబడుటయు, ఆంధ్రుల అదృష్టమనియే చెప్పవలయును. ఇంక పలనాటి యుద్ధమున ధైర్యసాహసములతో బోరిన వీరులనుగురించి కొంత చెప్పవలసియున్నది.

## బ్రహ్మనాయుడు

ఈయన వెలమకుల సంజాతుడు. రేచర్లగోత్ర రాకాసుధాకరుడు. మహాపరాక్రమ వంతుడును, ధీశాలియు, నిష్కళంకచరిత్రుడును నగు దొడ్డనాయనికిని పతివ్రతాశిరోమణి యగు శీలమ్మకును జనించినవాడు. భారతయుద్ధమున శ్రీకృష్ణు డెట్లు పేరుగాంచెనో, పలనాటి యుద్ధమున నీతడును పేరుగాంచెను. శ్రీమహావిష్ణుని యొక్క యపరావతారమని యాతని ప్రజలెన్నుచుండిరి.

"వైకుంఠపట్టణ వైభవంబెల్ల
గంటి నాయనిమూర్తి గన్నందుచేత
నీపాదములధూళి నెరసిన కతన
పావనంబయ్యె నీఖండనభూమి"

అని యాతనీ వర్ణించియున్నారు. ఈయన కదనరంగమున నసమాన తేజోవిరాజితుడు. శత్రులందరును ఈతని భీకరమూర్తినిగాంచి గడగడవణకుచుండిరి. సకల దేశాధీశ్వరులునుగలసి తనమీదికి యుద్ధమునకు వచ్చినప్పుడు ఆరణగండ్లనగ వారినోడించినపరాక్రమశాలి; అవనీశులవద్దనుండి యనేకయప్పనముల గొనియెను. ఆయన కృష్ణానదిలో నీదుచుండగా నొకమొసలి మీదికి రాగా, నిర్భయుడై దానిని దెగవేసిన మహాశక్తిమంతుడు. శ్రీనాథు డీమహాశయుని నిట్లు వర్ణించినాడు.

"ఎరుగవావీరుల నెరుగవాబ్రహ్మ
బగవారిగుండెలు బద్దలుచేయు
పటుతరవిక్రమ ప్రౌఢిసంయుతుడు
పగరాజుల భోజుంగు బ్రహ్మన్నతొల్లి
నష్టదిక్కులవారు నారణగండ్ల
కేతెంచిరణమున నెదిరినవేళ
గుంజరంబులమీద గొదమసింహంబు
దుమికినరీతిని దోర్బలంబొప్ప
కినిసివారలనెల్ల గెలిచియాలమున
మెప్పించిదివిజుల మేటివజ్రమున
సమమైనకుంతంబు చక్కగాగొనియె
నప్పనంబులగొనెన, నీకులొద్ద
నాదినారాయణు నవతారమూర్తి
కృష్ణ నీదెడువేళ గేరిగ్రాహంబు
చంపవచ్చినజూచి జంకింతలేక
ఖండించివైచిన ఘనశూరుడతడు
చుట్టునిప్పులయేరు శోభిల్లుచున్న
నేతైనశివపురి నీరుగాజేసి

భూతరాష్ట్రస్తంభంబు బుచ్చికొన్నట్టి
శూరుడు, ధీరుడు సుమహాత్ముడెన్న.

ఈయన పలనాటిరాజులకు సచివుడై కార్యభారమునంతయు నిర్వహించుచుండెను. పలనాటి రాజ్యస్థాపితుడగు అనుంగుభూపాలుడు మృతినొందు కాలమున బ్రహ్మనాయని బిలిచి, పిల్లలనందరిని పేరుపేర బిలిచి యాతని కొప్పగించి చనెను. బ్రహ్మన్నయు స్వామికార్యపరాయణత మెరయ, బాలురకు విద్యాబుద్ధులు గరపుచు వారిని వృద్ధికి తెచ్చి రాజ్యము నతిదక్షతతో నేలు చుండెను. అలకామరాజు రాజ్యమునకువచ్చి నాగమ్మ యను వీరవనితకు వశుడైనప్పుడు, బ్రహ్మనాయడు మలిదేవరాజాదులకు కొంతభాగమిప్పించి, మాచర్లలోనివాస మేర్పరుచుకొనెను. నాగమ్మ మిగుల నేర్పరియు, రాజ్యకాంక్ష గలదియు నగుటచే బ్రహ్మనాయని తమయాస్థానమునకు బిలిపించి, కోడిపందెమున నోడించి యాతని మలిదేవభూపతిని, సపరివారముగా రాజ్యమునుండి పారద్రోలించెను. ఈవీరు లందరును మందాది వలసపోయి యేడుసంవత్సరము లుండవలసినవారయిరి. అటుతరువాత తమ భాగమునకై యీవీరులు యుద్ధమునకు దిగిరి. ఈకథ భారతకథను జ్ఞప్తికి దెచ్చుచున్నది. దుర్యోధనుడు ధర్మరాజును జూదమునకు బిలిచి యాతని నోడించి యడవులకు బంపినట్లు నాగమ్మ బ్రహ్మనాయని నోడించి పంపెను. ధర్మము కొరకును, సత్యవాక్పరిపాలనము కొరకును బ్రహ్మనాయడు సపరివారముగా వలసయం దుండెనను విషయ మీతరమువారికి విస్మయముగలిగించకమానదు. ధర్మబుద్ధి భారతీయులలో నధికముగా నున్నది. మలిరాజపక్షమున సేన రాయబారి అలరాజును నాగమ్మ క్రూరకర్మురాలై చంపించినపుడు బ్రహ్మనాయనికి పౌరుషావేశము హెచ్చెను. కాని యుద్ధము నెట్లయినను తప్పించి యిరుకక్షుల వారికిని సంధిజరిపి లోకకల్యాణమునకై తోడ్పడవలయునని యాతడు ప్రయత్నించెను. అనుగురాజున కాతడు చేసిన ప్రతిజ్ఞ యాతనిమనస్సునందుండెను. అందుకొరకే పగవారు శరణుచొచ్చి సంధికొరకై రాయబారముల నంపినప్పుడు, ఆయన లొంగెను. శరణాగతులను రక్షించుట శూరుల లక్షణము. పగయడగించుటకు వారు ప్రయత్నింతురు గాని యుద్ధమున వారసమానులు. యుద్ధములోచచ్చి వీరస్వర్గము చూరగొనియెదరు గాని, పగరకు వెన్నిచ్చిపారుట వారెరుంగరు: బ్రహ్మనాయడు శాంతుడును, గొప్ప రాజనీతి విశారదుడును నైయున్నాడు. తన సైనికులు పగవారిమీదబడ తొందరపడగా వారిని సరస వచనములతో దువ్వి, తొందరమాన్పిన సరసుడు. యుద్ధములో బాలచంద్రుడు నరసింగ భూపతి తలదరిగి తన యొద్దకు తీసికొనివచ్చినప్పుడు అత డెంతయో దుఃఖించెను. అతనికి రెండుపక్షములవారును సమానులే. అలరాజునుచంపిన పగకై నరసింగరాయని తలదరుగుట యతనికి యెంతమాత్రము యిష్టము లేదు. తమ పక్షమువారు యుద్ధములో గెలిచినతరువాత గూడ రాజ్యాధిపత్యము అలకామరాజునకే యొసంగిన యుదారుడు. ఈతనిహృదయము కడు నిర్మలమైనది. ఇట్టి వీరపురుషు లీయుగమున నెందరో లేరు. ఈతనికని పెంచిన శీలమ్మ ధన్యురాలు. ఈతని జన్మస్థానమగు పలనా డెంతయు పవిత్రవంతమైనది.

## నాగమ్మ

ఈయమ వీరచరిత్రమునందు నాయకురాలనిగూడ పిలువబడుచున్నది. పలనాటి యుద్ధమునకీమెయే కారకురాలు. మహాసాహసవంతురాలు. ఈమె యలకామరాజును లోబరచుకొని మంత్రిత్వము నతినిపుణతతో డనెరపుచుండెను. సేనాధిపతులును, యోధులును, ఆమెయాజ్ఞల కించుకేనియు జవదాటకుండిరి. ఈమెకు రాజ్య తృష్ణ మెండుగా నుండెను. ఈమె యొకపవిత్రమగు రెడ్డికుటుంబమున జననమందెను. తండ్రి చౌదరి రామిరెడ్డి. తనస్వశక్తివలనను, బుద్ధివైభవమువలనను, రాజానుగ్రహము సంపాదించి నిరంకుశముగా రాజ్యము నెరపిన శూరవనిత. ఆమె బ్రహ్మనాయని నెన్నివిధములనో వంచించెను. తమ పురమునకు వచ్చినప్పుడు విసము పెట్టించెను. గాని లాభము లేకపోయెను. కోడిపోరున బ్రహ్మనాయని మోసముచేసి గెలిచి యాతని రాజ్యమునుండి పొనడిచెను. వారు వలసలో నున్నప్పుడుగూడ సుఖముగా నుండనీయక యనేక కష్టములను బెట్టెను. తుట్టతుదకు సంగ్రామ రంగమున పురుషునివలెయశ్వారూఢయై శత్రుసైన్యములతో యుద్ధము చేయుటకు వెడలెను. ఈమె శౌర్యసాహసములు ప్రస్తుత కాలపు స్త్రీల కాదర్శప్రాయముగా నుండదగును.

## బాల చంద్రుడు

పలనాటి వీరచరిత్ర కీతడే కథానాయకుడు. ఒంటరిగా శత్రుసైన్యములమీఁద నురికి మృగరాజు మత్తేభములయొక్క కుంభస్థలముల బ్రద్దలు సేయునట్లు అతిభీకరముగా యుద్ధముచేసిన మహాసాహసుడు. పలనాటి వీరచరిత్రమును చదువుచున్నపు డీతడొక బాలమాత్రు డని మన కెవ్వరికిని తోఁపదు. ఈతడొక యవతార పురుషుడనియు, శత్రుసైన్యముల నణుమాడ విధిచే నియమింపబడిన శూరాగ్రేసరు డనియు మన మెఱుంగగలము. అతడు పూర్వజన్మములయం దెత్తిన యవతారములనన్నిటిని దివ్యదృష్టి నెఱుంగగల జ్ఞాని. హరిశ్చంద్రునికిని చంద్రమతికిని జనించిన లోహితాస్యు డీతడే. హిరణ్యకశిపుని మదమడగింప నవతారమెత్తిన ప్రహ్లాదు డీతడే. చిరుతొండ నంబికి జనించిన గారాబుపట్టి యితడే మహా బలశాలియగు అంగదు డీతడే. సమరరంగమున నతి శౌర్యముతో బోరి, పద్మవ్యూహమున చిక్కుకొని ప్రాణములను విడిచిన యభిమన్యుకుమారు డీతడే. పూర్వజన్మములయం దిట్టి యవతారపరంపరల నొందిన బాలుని కిట్టి శౌర్యము గలుగుటేమివింత? ప్రస్తుతసమయమున నిట్టి యుద్రేకవంతులగు కుమారులే మనకు కావలెను. ఇట్టివా డొక్కడుండిన మన యభీష్టంబు లతిశీఘ్రముగా నెరవేరగలవు. బ్రహ్మనాయనివంటి పరాక్రమవంతునికిని, మహాపతివ్రతయగు సైతాంబకును చెన్నుని యనుగ్రహమున బుట్టిన బాలుడు వీరుడుగా నెట్లుండును. ఐతాంబబాలునికి భాగవత, రామాయణ, భారతకథ లుగ్గుబాలతో కలిపి పోసెను. భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనాది వీరులపరాక్రమము లాబాలుని కనుదినమును వినిపించుచుండెను.

"భీష్ముడొనర్చిన వివిధశౌర్యముల
నచలితబుద్ధితో నాలింపుపుత్ర!
ద్రోణుండు నెరపిన దోర్బలగరిమ
మనమునబట్టింపు మానితసుతుడ!
కర్ణుండుచూపిన ఘనపరాక్రమము
సూక్ష్మంపుబుద్ధితో జూడుముతనయ!
శల్యునియందున్న శస్త్రనైపుణియు
జాగరూకతమెయి జర్చింపుకొడుక!
దుర్యోధనుని మానధూర్వహ పటిమ
యాసక్తితోడుత నరయుమాత్మజుడ!

అని యామె బాలునకు చెప్పుచుండెను. మన తల్లులును బాలుర కిట్టివీరులచరిత్రలు బోధించిన నెంత సమంజసముగా నుండును. చిన్నప్పటినుండియు భయమున బెరిగిన పుత్రు లెట్టిభీరువు లగుదురో చెప్పనవసరము లేదు. బాలుడు బాలుడని ప్రజ లాతనినిఁబిలుచుట యాతని కెంతయు లజ్జాకరముగా నుండెను.

" పేరుబాలుడగాని బిరుదుమగండ "

అని యాతడు ప్రత్యుత్తరమిచ్చుచుండెను. శత్రువుల నురుమాడెదనని యాతనికి ధైర్యము మెండు. అతని తల్లి వగమను యుద్ధమునెడల నతనికి విముఖత గలిగింప ప్రయత్నించినప్పుడు అతడు తల్లితో నాడిన వీరవాక్యముల నాలింపుడు: అతని కసాధ్య మేమియు లేదట. బ్రహ్మాండభాండములను బంతులాడునట. మృత్యుదేవత నైనను మర్దించగలుగు సామర్థ్యమతనికిగలదట. హరిహరులు మెచ్చగా యుద్ధముచేసి తండ్రికీర్తి నిలువబెట్టునట. ఒక్కసారియైనను యీబాలుడు అధైర్యపు పల్కులు పలికి యెరుగడు.

"భయమేల చెప్పెదు భామ! నాకిపుడు
పుత్రమోహంబున బొంకెదుగాని
యెరుగవే నాబల్మి యిందీవరాక్షీ!
నలగాము డెరుగును నాదుశౌర్యంబు
బ్రళయకాలమునాటి భైరవురీతి
సైంధవవధవేళ సాహసస్ఫూర్తి
విజయుడు రణములో వెలసినకరణి
వాయుపుత్రుడు లంకవడితోడ జొచ్చి
భస్మంబుగా గాల్చి ప్రబలినభంగి
రాక్షసరణములో రామచంద్రుడు
వీరపరాక్రమవిధి జెందినట్లు
బాలుడనని నన్ను భావింపవలదు
చిన్నిమిర్యమునందు చెడునకారంబు"

అని గంభీరభాషణంబుల తనసాహసమును శౌర్యమును తల్లికి వ్యక్తపరచెను. ఈతని శౌర్యమును బ్రహ్మనాయు డెఱుగును. కావుననే కొమ్మరాజు పుత్రశోకమున బొగులుచుండగా ముద్దుల బాలుని తీసికొనిపోయి

యీబాలుడు నీపగదీర్చునని చెప్పి యాతని నొప్పగించెను. పిన్నదియయ్యు బాలుని శౌర్యసాహసములను మాంచాల బాగుగా నెరుగును. తనతండ్రియు, మామయు యుద్ధరంగమున కేగిరని యాతనికి తెలిసినప్పటినుండియు మేడపి యందుండుట యాతనికి చిన్నతనముగా నుండెను.

"తగవశే నాతోడ దబ్బరలాడ
చెలగికార్యమపూడి శ్రీయుద్ధభూమి
మలిదేవసహితులై మాయయ్యలెల్ల
జలముననున్నారు సమరంబుచేయ
ఆసమయమంబున నేనేగకున్న
నపకీర్తిపాలౌదు హానియు వచ్చు"

ఇట్టి పౌరుషవాక్యములచే తల్లినొప్పించి దీవనలందుకొని భార్యారత్నమగు మాంచాలవద్దకేగి కార్యమపూడి యుద్ధభూమికి తమ్ములతో గదలెను. ఈతడు మలిదేవరాజుసభకేగినప్పుడు యిరుపక్షముల వారికిని సంధి కార్యము సాగుచుండెను. నలగామరాజువద్ద నుండి రాయబారులువచ్చి బ్రహ్మనాయని దర్శించియుండిరి. కొమ్మరాజును తన క్రోధాగ్నిని చల్లార్చుకొని, పగవారు శరణునొందిరనియు ఉదారభావము మనసును సంతోషపెట్ట సంధికి సుముఖతజూపుచుండెను. ఇట్టి సమయమున బాలచంద్రుడు తీక్ష్ణభానునిపగిది రోషారుణితలోచనుడై, వీరులంవఱకును పౌరుషము వచ్చునట్లుగా నిష్ఠురోక్తులాడెను. అలరాజును చంపిన పగతీర్ప లేనందుకు వీరులను పేరపేరంబిలచి కఠినముగా మాటలాడెను. బాలచంద్రునికోపాగ్ని యెంత యడచుకొనినను ఆరినదికాదు. ఆతనియందున్న యుజ్జ్వలశక్తి యాతనినేకాక మనలను గూడ దహించునంతటిశక్తి గలది. కొంతసేపటికి వీరులాతనికోపమును సామముచే నడంచిరి. సంధి జరుగునట్లు తోచెను. కాని వీరమేడపినుండి వచ్చిన మాడచి రక్తసిక్తమైన బంగారుజందెమును బాలునికొసంగినప్పుడు వాని క్రోధాగ్ని మరల రగుల్కొనెను. ఇంక సంధి జరుగునుపాయము లేదాయె. తామారగించుటకు సిద్ధముగానున్న పక్వాన్నములను గంగలో కలిపి వీరులు యుద్ధమునకు సంసిద్ధులైరి. బాలుని నిర్భయత్వమువర్ణనాతీతము. తండ్రియెడల నతనికి ప్రేమయు, గౌరవమును మెండుగా నుండెను. కాన బ్రహ్మనాయని కాపట్యము నతడేమాత్రము దాచడాయెను. మొదటినుండియు చివరవరకు నాతడు తీవ్రముగా యుద్ధముచేసెను. బాలుని సాహసమునకు వెరగంది శత్రువులు పలాయనమగుచుండిరి. కొందఱు శరణుసొచ్చిరి. తుట్టతుదకు బాలుడు నరసింగరాయని తలదరిగి తండ్రికి దెచ్చి సమర్పించెను. యుద్ధములో వెనుకకువచ్చుట తగదని తండ్రిచే నాక్షేపితుడై యుద్ధమునకు మరలనేగి మడిసెను. ఈబాలుని మరణము,పోరు, నతికుతూహలముతో వీక్షించుచున్న దేవతాబృందమునకు మితిలేని ఖేదము గలుగజేసెను. ఇంక మానవులస్థితి చెప్పనేల? ఇట్టివారికి చావనునదియే లేదు. స్వర్గరాజ్యమున వారు శాశ్వతముగా సుఖములు పొందుదురనుటకు సందియము లేదు.

బాలచంద్రునకింక ననేక సుగుణములుండెను. పరభామల నతడు తల్లులవలె నాదరించుచుండెను. అనపోతు స్త్రీలను బెదరించినపుడు, అట్టికార్యము శూరులకు తగదని యాతని వారించెను. పుత్రుని వీడజాలక శోకించు తల్లికి యనేకనీతులను బోధించి యామెకు దుఃఖశాంతిని గలుగజేసెను. తనువులు శాశ్వతములు గావనియు, కీర్తి శాశ్వతమనియు నాతడు చెప్పుచుండెను. బాలుడు మిక్కిలి యుదారస్వభావుడు. దానధర్మము లిచ్చుట యందు వెనుదీయువాడుగాడు. తల్లి లోభత్వమున కతడు చాల నొచ్చుకొనెను. తనధర్మమును తాను నిర్వర్తించుకొనవలయునని యాతడు తల్లికి చెప్పెను.

ఇట్టిశౌర్యవంతుడును, సద్గుణవంతుడును నగుబాలునిగాంచిన పలనాడు ధన్య; భారతాంబయు పూజ్యురాలు.

## మాంచాల

ఇట్టి సద్గుణ శోభితుడును, మానధనుడును నగుబాలునికిదైన యువతి మాంచాల. ఈమె మహాసంపన్నులును, శౌర్యవంతులునగు గుండువారి యాడపడుచు. ఈమె మిక్కిలి చక్కనిది. సుగుణములకు నిధి. ఈయువతిని శ్రీనాధుడే వర్ణించవలయును.

"మంజులభాషిణ మహనీయసుగుణ
కంజాతలోచన కరిరాజగమన
త్రైలోక్యసుందరి రతిదర్పహారి
సుశ్రీలసత్ కర్ణ శోభితకర్ణ

కోమలసీమంత కుందాభదంత
యధరవిజితబింబ యధికనితంబ
వరవసంతమువీ కవనముల చిలుక
మారునికై దండ మల్లెలదండ"

ఇట్టి మగువనువీడి వేశ్యాలోలుడై బాలచంద్రు డొక్కనాడయినను యామె గడపత్రొక్కడాయెను. భార్యాభర్త లొండొరులనైనను చూచియెరుగరు. వారికి ప్రథమసందర్శనము బాలచంద్రుడు యుద్ధమునకు బోవ నామె సెలవు గైకొనుటకు వచ్చినప్పుడే. ఆమెతలచుకొనిన యెడల నాతని లోబరుచుకొని శాశ్వత భౌతికసుఖము ల నొందగలిగెడిదే. కాని భర్త తన కర్తవ్యమును ధర్మమును వీడి తనయొద్దనుండుట కామె యేమాత్రమును నిచ్ఛగించ లేదు. భర్త తనయొద్దకు వచ్చినప్పు డామెచూపిన ధైర్య మును ఆత్మనిగ్రహమును వర్ణనాతీతములు. అత్తగారి దీన భావమేమియు ఆమె చూపలేదు. భర్తను త్వరలో కలసి కొని వీరస్వర్గమున సకలసౌఖ్యముల నందగలనను నాసచే నామె యిట్లు పలికెను.

"బ్రహ్మగారచ్చినమము బాల్యంబునందు
సమరాన నాతడు సమసినవెనుక
వెంటనేగుదు నత్త! విడువు మీమాట
పంపుముపుత్రుని బవరంబుసేయ."

అని ధైర్యముతో బలికెను. ఇట్టిస్త్రీలే వీర సని తలు; ఇట్టిస్త్రీలే వీరమాతలు. తమ కుమారులను, భర్త లను, కౌగిలించుకొని మోహముచూపి, యుద్ధరంగమునకు పోనివ్వని యాడువారు క్షుద్రజాతివారు. ఈమెయే స్త్రీ జనముల కాదర్శముగా నుండదగును. ఈమె బాలచంద్రు నితో భోగమునకు తలపడక, అతని కా కార్యమునందు విముఖతగలిగించి వైరాగ్య బోధచేసెను:

"నాతోఁ బెనంగిన నయమేమిలేదు
కడువడి కలనికి గదలుడీ మీరు
కులవైరముం దీర్చు గురుసాహసుండు
పరికించిచూడ నెవ్వరుమీరు దక్క"

అనిపలికి యుద్ధమునకుబోవ ప్రోత్సాహపరచినది. ఇంతియకాదు; భర్తకు ఖడ్గము చేతికిచ్చి నవ్వుమ నిట్లు దీవించెను. ఇట్టిసమయములయందు సాధారణస్త్రీలీప్రకా రముచేయుట మిక్కిలి యరుదు. ఈవాక్యములు చదివి నప్పుడు మన యుత్సాహము పొంగి పొరలుననుటకు సంది యము లేదు.

"నవ్వుమదీవించె నళినాయతాక్షి
రతిరాజసౌందర్య రణరంగధీర
కమలబాంధవతేజ కరుణాలవాల
వినతాత్మజునిలావు వెసనీకుగలుగు
సామీరిసమమైన సాహసం బబ్బు
కృష్ణునికెనయైన కీర్తిఘటిల్లు
రవికాంతియుతుడవై రాజిల్లుచుండి
యలరాజుపగ దీర్చు మనుజులతోడ
పటుతరవిక్రమ ప్రాభవము మెరయ
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుడు

* * * *

శాత్రవవిజయము సమకూర్చుమీకు
నీయాయుధము వడి నిచ్చునుజయము
"కలియుగంబునమీకు ఘనపూజలమరునని" ప్రాణ

నాథుని నాశీర్వదించి యుద్ధమున కంపెను. స్వాతంత్ర్య సంరంభమున మనకిట్టియువతులే కావలెను. సాత్వికయుద్ధ మునకు బయలుదేరు స్వజనమును జూచి యతిదీనముగా నేడ్చి మగవారికి నిరుత్సాహముపుట్టించువారుండి ప్రయో జనములేదు. మాంచాలబోటి వీరయువతులను గురించి మన వారి కేమియు దెలియదుగదా!

## కన్నమనీడు

ఈతడొక మాలకుటుంబమున జననమందెను. మహా పరాక్రమవంతుడు. బ్రహ్మనాయని కత్యంతప్రియుడగు బంటు. అతని జన్మప్రకారం బిట్లున్నది:

"కలికికృష్ణుండైన కారుణ్యమూర్తి
పుట్టెనుబ్రహ్మన్న భూలోకమందు
నతనికి దాసుడ నౌదును నేను
మాలలకునుబుట్టి మాలనై పోక
విష్ణుపాదముబట్టి విశ్వంబులోన
తెప్పలినాయడు తెరవయైనట్టి
యంబుజలోచన పెమ్మసానికిని
శ్రీమించుమాచెర్ల చెన్నునీమేన
వరమునగన్నట్టి వరపుణ్యసుతుడ
కన్నమనాపేరు కమలాక్షివినవె"

ఇంకొకసందర్భమున నాతడె యిట్లు చెప్పుకొని నాడు:

"భుజమలముద్రలు పూనినవాడ
క్షుద్రమార్గులసెప్పు చూడనివాడ
ప్రాసాదజీవినై ప్రబలినవాడ
జ్యేష్ఠపుత్రుండనై చెలగినవాడ"

ఈవాక్యములవలన నీతడు ఘనశక్తియుతుడనియు వరమున బుట్టినవాడనియు మనమెరుంగనగును. ఈతడు ఘనమైన దేహముగలవాడనియు, ఎగుభుజంబులవాడనియు నింకొకచోట వర్ణించబడియున్నది.

"...........నావీరఘనుడు
వాసనపెల్లైన వనమాలగదల
కరమునగజ్జరి కడియముల్ మెరయ

* * * *

ఘోరభైరవగద కోరమీసములు
నెగుభుజంబులుమించు నెరుజేరుగ్రుడ్లు
ఘనమైనదేహంబు కాలిపెండెరము
వెరనైనభీకర వేషంబుతోడ
గదలె కన్నమనీడు కదనభూమికిని
కాటుకకొండయై కదిసినయట్లు
గరిమతోజీకటి గ్రమ్మినయట్లు
హరిహరాదులమూర్తి యతనికిగల్ల."

### అనపోతు

ఈయన బ్రాహ్మణోత్తముడు. బాలచంద్రుని సఖుడు. వేదవేదాంగములయందును, శాస్త్రములయందు నారితేరినవాడు. ధనుశ్శాస్త్రపారంగతుడు. బ్రహ్మవర్చస్సాతనిముఖమున తాండవించుచుండెను. ఇట్టి శూరుని యుద్ధమునకు తోడ్కొనిపోనొల్లక ముత్యాలగళమాలయు ముద్దుటుంగరమును మరచితినని నెపమున బాలచంద్రుడాతని మేడపికి పంపివేసెను. ఆయననుజూచి మాంచాలయు, శ్యామాంగియు అపహాస్యముచేసిరి. తిరిగి వచ్చుచుండగా ముందు నడువకూడదని యొకలేఖ చెట్టునకు కట్టబడియుండెను. ఈలేఖనుజూచి బాలచంద్రునితో యుద్ధమునకు పోజాలకపోతినిగదా, నావిధిని నేను నెరవేర్చుకొనలేకపోతినిగదా, వీరులంతరును కార్యమపూడియం దుండ నేనుమాత్రము మేడపియందుండవలసి వచ్చెనుగదా యని దుఃఖించి, తనయజ్ఞోపవీతమును నెత్తుటియందుదడిపి బాలచంద్రుని కొప్పగించుమని మాడచి కిచ్చి ప్రాణత్యాగము చేసికొనెను. ఆసమయమున నీవీరాగ్రేసరుడు పలికినమాట లెన్నటికిని మరపునకు రాకున్నవి:

"జన్మమెత్తితిగాని సఫలంబుగాదు
సఫలంబుగాని యీజన్మంబదేల
వినియోగపడనట్టి వీరరక్తంబు
రక్తమే కలుష నీరంబుగాక
యుప్పొంగుచున్నది యుజ్జ్వలశక్తి
యడగదు నేనెంత యడచిననైన
దహియించుచున్నది దావాగ్నిరీతి
ప్రాణంబులిక నేను బట్టంగజాల
దవిరి వ్యర్థంబైన దేహంబువిడుతు
స్వర్గలోకమునందు బాలుని రాక
నెదురుచూచుచునుందు నెంతయువేడ్క."

అని కంఠముగోసుక చచ్చెను. బాలచంద్రుడు తనకు చేసినద్రోహమున కాతడెంతయు నొచ్చుకొనెను. ఇంతశౌర్యము, యింత యభిమానము, యింత రోషము, యింత సాహసము జగమునం దెచ్చటనైనను గంటిరా?

ఇంకను ఈచరిత్రయందు వచ్చు వీరు లనేకులు గలరు. మాడచియనుకాంత రాణివాసమున నుండనొల్లక వీరులకు సాయముజేయ కార్యమపూడికి బయలుదేరి పోయెను. బాలచంద్రుని సఖులు వెలమలదొర్నీడు, మంగలి మాధవుడు, చాకలిచందు, కంసాలిచెందు మొదలైనవారును యుద్ధమున నసమానప్రజ్ఞజూపి హతులయిరి.

ఈకథయందు వచ్చువీరులనుగురించి కొంత చెప్పితిని. ఈవీరచరిత్రను పామరులుగూడ చదివి యానందించులాగునను, ప్రతిపాదమునను శౌర్యరసము చిప్పిల్లునట్లుగాను వ్రాసిన శ్రీనాథుడెంతయు ప్రశంసనీయుడు. ఇట్టివారినే మనము వీరులనందగును. ఇట్టివారే యవతారపురుషులు. శ్రీనాథుడే నిజమైన దేశారాధకుడు. ప్రతియాంధ్రుడును ఈపుస్తకమును జదివితీరవలయును. ఇట్టి గ్రంథమును చదువుటచే బాలురయుత్సాహము ద్విగుణీకృతమై తమదేశముపట్ల భక్తిశ్రద్ధలు హెచ్చును. నాస్తికులమును, స్వస్వరూపమును మరచినవారము నగు మనకు

ఆర్యసాంప్రదాయములయందును, శాస్త్రములయందును కళలయందును అభిరుచిగలుగును.

ఇంతియకాదు. యీచరిత్రవలన మన పూర్వుల నాగరికత వ్యక్తమగుచున్నది. పండ్రెండవశతాబ్దమునాఁటి యాంధ్రులు మిక్కిలి శౌర్యవంతులనియు మేధావంతులనియు తెలియనగును. కవిత్వ మున్నతదశయందుండెను. సంగీతశాస్త్రమునందు ప్రవీణులగువారు పెక్కురుండిరి నాట్యకళ మిక్కిలి యుచ్చస్థితియందుండెను. ఆడువారును మిక్కిలి యుదారభావమును శౌర్యసాహసములును గలిగియుండిరని తెలియుచున్నది. వేయేల, దేశము సుభిక్షమై, యలరారుచుండెనని మనము గ్రహింపగలము.





## ఉపాస్తి

సోమంచి సూర్యనారాయణ శర్మగారు

భువనాథ్యక్షుని నాదిదేవుని మనీషం బొందించి తద్రాజ్యవై
భవరాహస్య మనన్యచింతనమునన్ భావించి సేవించి సా
రవచస్స్ఫూర సుధారసస్ఫురితమై రాణింప వర్ణింప స
త్కవితావేశునిఁ జేయు నీకిదె! నమస్కారంబు వాగ్దేవతా!

శా. ఆసంగోల్పెడి నూత్నవర్షమది యే మాడించి పాడించునో!
వేసం బెయ్యది వేసిమించునో దురావేశంబుఁగల్పించునో!
వీసం బావిచికిత్సఁద్రోసి నను నిర్భీతాత్మునింజేసి నా
దోసంబు ల్దెగఁగోసి త్రిప్పఁగదె! మేల్త్రోవన్ సదా భారతీ!

మ. చదువా, శూన్యము; శాంతిసంభరితహృత్సంస్కారమా, లేదు; కో
విదసంసర్గము నాస్తి; వెఱ్ఱితలఁపుల్ వేవేల్దనింపంగనీ
పదపంకేరుహభక్తి తత్పరత నంబా! యేదొ పల్కం జనున్
సదయాకారముఁ బూని యీనవకవిన్ సాకంగదే! సాహసున్.



# మహాసతి సీత

కలువలపల్లి రంగనాథశాస్త్రి గారు

జనకనృపాలమౌళిసుత సాధ్వి రఘూద్వహుఁడైన రామభ
ద్రునినెడఁబాసి నెవ్వగలఁదూలి యశోకవనిం దదాప్తికిన్
దనమదిలోన రేవగలు దప్పక తారకమంత్రరాజమున్
మననము సల్పుచున్ మొగి దినంబులు పుచ్చుచునున్నయత్తఱిన్.

ఉ. మారునిబారిపాలగుచు మంచియుఁజెడ్డయుఁ నెంచఁబోక శృం
గారవనంబుఁజేరి దశకంఠుఁడు సీతను గాంచి పల్కు నే
వీరుఁడ విశ్వజేత నిఁక వేఱుగఁజూడక నన్ను భర్తగాఁ
గోరి వరింతువేని సుమకోమలి! కోరఁగనేల భోగముల్.

శా. నీమాటన్ జవదాటనమ్మ సతమున్ నిక్కమ్ముగా నమ్ముమీ
ధీమంతుల్ విని సన్నుతింపఁగ నినున్ దేవేరిఁగాఁ జేయుదున్
నామీఁదన్ వలపూనవింతయుఁ గటా! నాయంతవాఁ డీగతిన్
గామింపన్ వెస నియ్యకోవలవదే, కాంతామణీ, జానకీ!

చ. నెలఁతరో! నీపదాబ్జములు నిచ్చలుఁ దప్పక మూఁడుపూటలున్
కొలుతురు నాప్రియాంగనలు కూరిమి నీవు ప్రసన్నచిత్తవై
నిలుకడ నన్ను నేలునెడ నీకనుసన్నమెలంగువాఁడఁ గో
ర్కుల నొడఁగూర్చువాఁడఁ బెఱత్రోవఁ జరింపను నమ్ము నెమ్మదిన్.

చ. కలికిరో! కాననమ్మునను గాసెడువెన్నెలవోలె మాంజవో
జ్జ్వలమగుమేనిసౌష్ఠవము జవ్వనమున్ వృథసేయ నేటికిన్
వలచినవానిఁ బాయఁదగవా! మగవారలు గోరినం గదున్
జులకనఁ జూతు రాండ్రనుట చొప్పడె నీయెడ! నిక్కువమ్ముగన్.

ఉ. కానలలోన నిచ్చలును గాయలు దుంపలు వేళ్లుమెక్కుచున్
మేనుకృశింపఁగా నునికి మేలని యెంచితివేల కోమలీ!
దానవభర్త రావణుఁడు దానుగ దీనునిమాడ్కి వేఁడినన్
పూనిక సుంతయేని తలఁపున్ వెలిపుచ్చ విఁకేమి చెప్పుదున్

ఉ. నమ్ముమనమ్మునం గలధనమ్ములు మేలిమిమేడలుం బ్రసూ
నమ్ములతోఁట లర్హ్యవసనమ్ములు రత్నవిభూషలున్ సుగా
నమ్ములసాధనమ్ములు ఘనమ్ముగ నన్నుగణింప నీయధీ
నమ్ముగఁజేయువాఁడ సుదినమ్ము తలంపఁగ నేఁడు జానకీ!

చ. జలనిధిదాఁటి నీవిభుఁడు జానకి! వచ్చునె లంకలోనికిన్
తలఁకకవచ్చెనేనియును నాయెదుటన్ నిలువంగనేర్చునే
నిలువగనేర్చినన్ గెలువనేర్చునె మానవకీటమింతయున్
దెలియనిదానవీవు జగతిన్ ననుఁబోలిన వీరు లుందురే.

చ. మగఁటిమి నన్ను నెవ్వరును మార్కొనిపోరున గెల్వలేరు ము
జ్జగములు మున్నె గెల్చితిని శౌర్యముపేరిమిఁ జెప్పనేల శూ
రగణములోనమేటి నిఁక రాముఁడు గీముఁడు నాకులెక్కయే
మగువలమేలుబంతి! అనుమానము మానుము మానసంబునన్.

ఉ. కానలకేగుమంచు నలకైక వచించిన రాజ్యహీనుఁడై
దీనతనెల్ల దిక్కులను ద్రిమ్మరు రాముని మాని మానినీ!
మానుగ నన్నుఁగూడి మనుమా, వినుమా, ననుఁబోనివానినిన్
గానఁగలేవు నిక్కము జగాన మఱొక్కరునేనిఁ బూనికన్.

మ. అని యీరీతి మదాతిరేకమున దైత్యస్వామి కామార్తుఁడై
తనయిష్టంబునుదెల్ప, సాధ్వియగు సీతాకాంత యాలించి వా
నినుడుల్ సైఁపక తాల్మిఁబూని విబుధానీకంబు లెన్నంగ ని
ట్లను గోపావిలచిత్తయై మొఱకుఁగా నవ్వాని భావింపుచున్.

ఉ. వానిఁదృణీకరించుగతి వామవిలోచన గడ్డి పోచఁ జేఁ
బూని మొగంబుమాటువడుపోలిక నడ్డుగనిల్పి ధర్మముల్
వీనులకెక్కఁగం గుమతివృత్తిఁ దొలంగి చరింపఁగన్ సమా
ధాన మొసంగు సీత నయతత్త్వవిదుల్ బళియంచు మెచ్చఁగన్.

మ. మనుమార్గంబునుబట్టి వర్తిలెడి యస్మన్నాథునిన్ రామభ
ద్రుని గారుణ్యసముద్రు దీనజనబంధున్ నమ్రతంగొల్చి నీ
మను మార్గంబును జూచికొమ్ము నయమున్ మర్యాదయుంగల్గి స
జ్జన గణ్యుండవుగమ్ము దానవకులేశా? రావణా! యింతటన్.

(స




పొరనంది జగన్నాథస్వామి గారు, యం. ఏ, యల్. టి.

(రెండవసంపుటము మొదటిసంచిక తరువాయి)

# అంకము ౪

## రంగము 1

సముద్రము కనబడుతూఉండేటట్లు ఉన్నడాబా

(రూపసి సుశీల ప్రవేశింతురు; ఒకరినిఒకరు కలిసికొందురు.)

సుశీలా చూచేవా, సూర్యుడు సముద్రములోనుంచి ఏలాగు లేస్తున్నాడో; చూడు. ఆసముద్రతరంగములు అంతగా కదలకుండా ఉన్నందువలన చల్లనిఆనందము అనుభవిస్తున్నట్లు కనబడుతున్నవి. ఈఉదయముకూడా ఎంతపరిమళమయమైనట్టిన్నీ నిర్మలమయమైనట్టిన్నీ ఏకాంతములో మునిగిఉన్నదో చూచేవా. ఈ నిశ్శబ్దముచూస్తే, ప్రపంచము అంతా ఏకాంతముగానే ఉన్నట్లు తోస్తున్నది. ఎవరేమాటాడినా దానిద్వారా ఆ నిశ్శబ్దము వ్యక్తమవుతూఉన్నది. ఇంతచక్కగా ఈ ఉదయమేకాకుండా, ఈ రోజుఅంతా ఉంటుందికాబోలు, చూడూ, నేను వెళ్లే రోజు ఇవ్వాళేగదూ!

సుశీల:—నీవు వెళ్లనేవద్దు.

రూపసి:—నాగది కిటికీలోనుండి నీవు రావడముచూచి నిన్ను కలుస్తానని వచ్చేను. సుశీలా, నాకేమో భయమువేసింది. ఆ పడిపోతున్న గోపురము గోడమీదినుంచి వంగి చూస్తున్నావు; నీ ఊర్ధ్వకాయమంతా వ్రేలాడింది. గోడరాళ్లు జారిపోతున్నట్లు నాకు అయింది. ఎన్నడూ నేనెరగని భయము నా హృదయములో లేచింది. పెదవులాడినవికావు. తెల్లపోయేను. అప్పటికే కిటికీలోనుండి మొగముపెట్టి పెద్దకేకవేసేను. నీకు వినబడలేదో, వినబడీ నీకు నా అభిప్రాయము అర్థముకాలేదో. ఏమిటిచేస్తున్నావు అక్కడ. విధి చాలా చపలమైనది సుమా, దానిని అట్టే పురికొల్పకూడదు. ఇది మూడోమారు నిన్నా గోపురముమీద నేను చూడడము. ఏమిటచేస్తున్నావు అక్కడ. ఆరాళ్లు లాగుచున్నట్లు అగుపడ్డది. ఆ మహాకాశములో దేనికోసము వెదుకుతున్నావు?

సుశీల:—అవును, వెదుకుతున్నాను... వాళ్లు చెప్పేరుకారూ నీతో? నాకోసము నీవేమీ భయపడకు; ఏమీ భయకారణము లేదు. గోపురము గట్టిగానే ఉన్నది. వాళ్లకి తెలియదు; పడిపోతున్నాదని వాళ్లు అనుకొంటారు కాని అంత శిథిలము కాలేదు. మన అందరికంటె ఎక్కువ కాలము నిలిచి ఉంటుంది, నాకు తెలుసును. దానినెందుకు నిందించడము? అది ఎవరికి ఏమీ అపకారముచేయలేదే!...పోనీకాని, నీవు చూస్తూఉంటే ఒక వింతసంగతి ఉన్నది. అది నీకు తెలియలేదు, చూసేవా? ఐదారు రోజులక్రిందట ఇక్కడికి ఒకవింతపిట్ట వచ్చింది; దానికెంతవిసుగు లేదో కాని, ఎప్పుడూ నాగోపురము చుట్టూ రువ్వు రువ్వుమని పరిగెత్తుతూ ఉంటుంది. దాని రెక్కలు ఆకుపచ్చగా ఉంటవి; నేను వర్ణించి స్పష్టముగా చెప్పలేను. దానిసంగతి అంతా వింతగానే ఉన్నది. అది రోజుకురోజుకు పెరుగుతున్నట్లు కనబడుతుంది. అది ఏదేశము నుంచి వచ్చిందో చెప్పమంటే ఎవరూ చెప్పలేరు. అది గోడసందులో గూడు పెట్టింది కాబోలు; అక్కడ నేను వంగి చూస్తూ ఉంటిని...

రూపసి:—ఇదేనా ఈగోపురము బంగారము తాళంచెవి. దీనితో నేనా నీవు ఆడుతుండే దానవు.

సుశీల:—అవునవును; నీవు ఇక్కడికి వచ్చిన నాడే దానిని పడేసేను.

రూపసి:—నాకది ఇస్తావా?

సుశీల:—నీకివ్వాలీ? ఎందుకూ?

రూపసి:—నేను వెళ్లేదాకా నావద్ద ఉంచుకొంటాను.

సుశీల:—ఎందుకూ?

రూపసి:—ఎందుకో నాకేతెలియదు... నేను ఇక్కడనుంచి చాలాదూరము వెళ్లిపోయిన తరువాత కావలస్తే అప్పుడు వెళ్లుదువుగాని ఆ గోపురముమీదికి అందాకా వెళ్లకు; అందాకా ఆపచ్చరెక్కలపక్షిఊసుపెట్టకు.

సుశీల:—ఇదిగో తాళంచెవి, రూపసీ, అయితే నీవద్ద ఉంచుకో. ఇవ్వడానికి నాకేమి అభ్యంతరములేదు చూడు. కాని అది ఎంత బరువుగా ఉందో!

రూపసి:—అవును, చాలా బరువుగానే ఉంది.

సుశీల:—రూపసీ, ఏది ఒక్కముద్దు.... నీకు దుఃఖము కలుగజేసేనా ఏమిటి?

రూపసి:—నీ వెప్పుడూ ఒకరికి దుఃఖము కలుగజేయలేదే. అదేమిటి నీ కండ్లనిండా నీళ్లు ఎందుకు వస్తున్నవి?

సుశీల:—ఏమీలేదు, నిన్ను ముద్దాడుతూ సూర్యునివైపు చూసేను. మళ్లా ముద్దు పెట్టుకో. మదనునివద్దకు వెళ్తాను; తానూ పెందరాడే లేస్తానని అన్నాడు రూపసీ, వెళ్లివస్తా.

రూపసి:—(తాపీగా) సరే, నేనూ వెళ్తా.

[సుశీల వెళ్లింది. సుశీల దూరముగా వెళ్లిందాకా ఉండి, తరువాత డాబా క్రింద ఒకకొనకు

వెళ్లి ఆబంగారం తాళంచెవివైపుఅదేచూస్తూ, గభాలున సముద్రములోనికి విసిరివేసింది. తానూ వెళ్లిపోయింది.]

రంగము 2.

ఇంట్లో ఒకగది.

[తాతమ్మ నిద్రలోఉంది. మంచముముందుకి చిన్నపిల్ల చెయ్యిపట్టుకొని సుశీల వచ్చింది.]

సుశీల:—చిన్నపిల్లా, తాతమ్మను ఒకమారు ముద్దుపెట్టుకొందాము; ఇప్పుడు ముద్దు పెట్టుకోకపోతే, మనము వెళ్లిపోయిన తరువాత మరి ముద్దుపెట్టుకొనేవారు ఎవరు ఉన్నారు? అందరికంటె ఎక్కువగా ఆమెకే మనముద్దులు అవసరము. ఆమెతో ఏమీ చెప్పకుమీ... రూపసికి భయమట; ఆలాగని చెప్పి నాగోపురము తాళంచెవి నాదగ్గిరనుంచి తీసుకొంది. కాని ఆపోయిం దనుకొన్న మొదటితాళంచెవి నాకు దొరికింది; అందుచేత ఎవరికీ తెలియకుండా మనము గోపురముమీదికి వెళ్లగలము. అక్కడికి వెళ్లితే ఆపచ్చని పక్షిని నేను పట్టుకొంటాను...

చిన్నపిల్ల:—వెంటనే నాకిస్తావుగదూ?

సుశీల:—నీవు ఏమీ మాట్లాడకుండా ఉంటే నే నీకిస్తాను. జాగ్రత్త; చెప్పకుమీ ... తాతమ్మ లేపుతాను......చిన్నపిల్లా నా ముఖము ఏలాగుంది? ఎవరైనా చూసి నేను విచారముగా ఉన్నానని అనుకొంటారా ఏమిటి?

చిన్నపిల్ల:—చిన్న అక్కయ్యా, నీకు సంతోషము కలుగజేసేమాట ఏదైనా ఉందా నేను చెప్పడానికి? ఉంటే చెప్పు.

సుశీల:—ఆలాగుకాదు, నీవు నిజముచెప్పాలి. చూడు, నాకేమో విచారముగా ఉన్నాదని తాతమ్మ అనుకోకూడదు. సాధారణముగా లోకములో తప్పుఅభిప్రాయము పడుతూ ఉంటారు; సుఖముగా ఉన్నప్పటికీ పైవారు ముఖముచూసి ఎందుకు విచారిస్తున్నావు అని అడుగుతారు; విచారము లేదన్నా నమ్మరు... నాకు దుఃఖముగా ఉన్నట్లు నీకు అగుపడలేదుకదా?

చిన్నపిల్ల:—ఏది అక్కయ్యా, బాగాచూడనీ

సుశీల:—ఏమిటి చూస్తావు? నీకు ఏమైనా తెలుస్తుందా?

చిన్నపిల్ల:— దగ్గిరగార్రమ్మా అక్కయ్యా, బాగా చూస్తాను.

సుశీల:—ఏదీ, ఈలాగుదా, నిన్ను ఎత్తుకొని ముద్దాడుతాను. అయినా నీవేమీ చూడలేవు, చూడు.

చిన్నపిల్ల:—అక్కయ్యా, నీవు చాలా సుకుమారముగా ఏడుస్తావు కాబట్టి, నీవు ఏడుస్తున్నా, ఏడుస్తున్నట్లు ఎవరూ పోల్చలేరు.

సుశీల:—నేను ఏడవేలేదు. చూడు. తరువాత నీవు ఒక్కర్తవే ఉన్నప్పుడు నిన్ను వాళ్లు ఇవ్వాళ అడిగితే "అక్కయ్య ఏమైనా చెప్పిందా? అక్కయ్య ఏమిటి చేసింది, అక్కయ్య దుఃఖపడుతూ ఉండెనా? అక్కయ్య తెల్లబారిపోయిందా?" ఈలాగు ప్రశ్నలు వారువేస్తే, నీవు వెంటవెంటనే జబాబులు చెప్పకుమీ; అందులోకే వాళ్లు బెదిరిపోయి ఉంటేనూ, వెడవెడలాడుతూ

ఉంటేనూ, నీవు వెంటనే జవాబులు చెప్పి వేయవద్దు... అంతే కాకుండా నేను కులాసాగా ఉంటినని నే చెప్పు. చక్కగా కనిపెట్ట గలిగేవాళ్లందరికీ నేను కులాసాగా ఉన్నానసే తోస్తుంది; ఎల్లప్పుడూ నవ్వుతూ ఉన్నాననే తోస్తుంది. చూడు మన మెప్పుడూ నిజమే చెప్పుతూ ఉండాలి. ఇదిగో తాతమ్మను లేపడానికి వెళ్తున్నాను, నీవు జాగ్రత్త... అబ్బా, ఎంత ఒంటరిగా ఉంది తాతమ్మ. ఆమెను అందరూ విడిచి పెట్టివేసేరుగదా! [తాతమ్మను చాలా సేపు ముద్దాడి] తాతమ్మా! [తాతమ్మ లేవలేదు] నేనే, తాతమ్మా!...ఎంత గాఢముగా నిద్ర పోతున్నది...తాతమ్మా, వెళ్తానని చెప్పడానికి వచ్చేను.

తాతమ్మ:—[లేస్తూ] ఆ! నీవా! సుశీలవా?

సుశీల:—అవును, తాతమ్మ. చిన్నపిల్లా, నేనూ ఇద్దరముకలిసి షికారు వెళ్తామని చెప్పడానికి వచ్చేము.

తాతమ్మ:—ఎటువైపు వెళ్తారు?

సుశీల:—ఎటో ఇంకా అనుకోలేదు. కాని మామూలుకంటె దూరముగా వెళ్తాము. సాయత్రములోపున ఇంటికిరాము. నీకు కావలసినవన్నీ ఉన్నవికదా? నాస్థానే రూపసి ఉన్నదికదా, నీసంరక్షణచూస్తూ ఉంటుంది. వెళ్లేముందర పరుపు దుప్పట్లు దులుపి ప్రక్క మళ్లావేదునా? నొప్పి లేకుండా ఎత్తి ప్రక్కవేసి మళ్లా పరుండ పెట్టడము నాకొక్కర్తెకే తెలుసును బాగా. సరేనులే, రూపసికూడా నేర్చుకుంటుంది. ఆమె చాలా తెలివైనదే; ఒక్కమారు చేయనిస్తే, సులువుగా గ్రహిస్తుంది. ఆమెను ఒకమారు పిలుత్తునా చూస్తుంది?

తాతమ్మ:—వద్దువద్దు. నీవు తిరిగి వచ్చిందాకా పడుకొంటాను.

సుశీల:—వెళ్తానూ, వెళ్తాను తాతమ్మ.

తాతమ్మ:—మంచిది; రాత్రిపడకుండా వెళ్లి పోరమ్మా.

[చిన్నపిల్లచేయిపట్టుకొని, సుశీల గబగబ వెళ్లిపోవస్తుంది]

## రంగము 3.

లోగిట్లో ఒకగదివసారా

[దారిలో మదనుడు కలుస్తాడు]

మదనుడు:—ఎక్కడికి అంత వేగిరముగా వెళ్తున్నావు?

సుశీల:—ఎక్కడికీలేదు. ఎంతతప్పకోవాలని, ఆచెట్టునీడలోకి వెళ్లేను.

మదనుడు:—అబ్బా, ఎండఎంతతీక్ష్ణముగా ఉంది! నిజముగా గోడలలోని రాళ్లు కరిగి పోతున్నవా, సముద్రమంతా అగ్నిమయము అయిపోయిందా అనేటట్లు ఉంది. అడవులలో ఎల్లప్పుడూ ఉండవలసిన చల్లదనమంతా జ్వాలలుగా మారిపోయిందా ఏమిటి? ప్రపంచమంతా మ్రింగివేసే సింహామువలె సూర్యుడు ఆకాశమందు ప్రజ్వలిస్తున్నాడు. ఎక్కడైనా ప్రాతఃకాలసురభి నిలిచి ఉంటే నీమోవియందే ఉన్నది, సుశీల; రమ్మా, ఏదీ ఒక్కముద్దు ఇమ్మా.

సుశీల:—ఉహు- ఇప్పుడుకాదు నేను వెడిపోవాలి. వేళలేదు. వాళ్లు నాకోసము కనిపెట్టుకొని ఉంటారు..... సాయంత్రము ముద్దులాడవచ్చును.

మదనుడు:—విశేషమేమిటి, సుశీలా?

సుశీల:—ఆహా, అదా! చాలాచిన్నసంగతి. దానిపనిసరి.

మదనుడు:—ఏమిటంటావూ?

సుశీల:—ఏమిటా? ఏమీలేదు.... ముద్దులాడు వేగిరముగా.

[తాను గర్వీమని, తొందరగా ముద్దుపెట్టుకొంటుంది]

మదనుడు:—చూసేవా... రక్తమువచ్చింది!

సుశీల:—ఏమిటి!

మదనుడు:—రక్తము!... ముత్యములవంటి నీ చక్కని దంతములవల్ల చిన్నగాయము అయింది.

సుశీల:—ఛా, ఏమిక్రూరురాలను!... మదనా, నొప్పా?

మదనుడు:—పోనిత్తూ. ఏమాత్రము దెబ్బ అది!

సుశీల:—కాదు, మదనా. నేను క్రూరురాలను... వేళఎంత?

మదనుడు:—సుమారు పండ్రెండు.

సుశీల:—పండ్రెండే. నేనుపోవాలి... నాకోసము వాళ్లు కనిపెట్టుకొనిఉంటారు. వెళ్తాను మదనా.

మదనుడు:—సుశీలా, సుశీలా, ఎక్కడికి ఆ వెళ్లడము?

సుశీల:—[పాడుకొంటూ, చిన్నపిల్ల చెయ్యి పట్టుకొని, వేగిరంవేగిరముగా సుశీల వెళ్లిపోయింది. మదనుడు చూస్తూనిలబడ్డాడు. కొంచెముసేపు ఉండి వెళ్లిపోయినాడు.]

## రంగము 4

### గోపురము మీద

[సుశీల చిన్నపిల్లల ఇద్దరి ప్రవేశము]

సుశీల:—చిన్నపిల్ల, ఏమిటిచేదాము? ఇక్కడికివచ్చివేసేము, ఇకచేయవలసినదేమిటో ...చూసేవా, ఎక్కడచూచినా ఎంత కాంతిగా అన్నివస్తువులూఉన్నవో! భూమి ఆకాశము సముద్రము అంతటా ఒకవిధమైన తేజస్సు విస్తరించి ఉన్నది. అన్ని రోజులకంటె ఎక్కువ ఆహ్లాదకరముగా ఉండడానికి ఏమిటో ఈరోజు విశేషము?

చిన్నపిల్ల:—ఏది, అక్కయ్యా, ఆపచ్చని పిట్ట?

సుశీల:—అదుగో, అక్కడఉంది. మనకిఇంకా అగుపడదు. కొంచెముసేపుపోయినతరువాత ఆగోడమీదనుంచి వంగివంగిచూదాము. చూడు చుట్టూ ఏలాగుఉందో. మనమేడ, చుట్టూ ఆవరణము, తోటలు, అడివిఅంతాచూడు, కనబడుతున్నవి. గట్లమీదఉన్న పూలమొక్కలన్నీ ఏలాగు పువ్వులతో నిండిఉన్నవో చూడు. భూమి ఎంత పచ్చగాఉంది ఇవ్వాళ!... రూపసి నాకు అగుపడలేదే... అదిగో మదనుడు, చూడు రూపసికోసము కాచిఉన్నాడు. వంగిపో, మనము దాగుందాము; ఇక్కడ ఉన్నామని వానికి తెలియకూడదు. నూతి

దగ్గిరే ఉన్నాడు. అక్కడే నేను తూపసిని లేపేను....

చిన్నపిల్ల:—చిన్నక్కయ్యా చూడే. తోట కాపువాడు మొక్కలు ఊడుస్తున్నాడు చూడే.

సుశీల:—ఆమొక్కలు పెరగడము, పువ్వులు పూయడము, అంతా నీవు చూస్తావు, చిన్నపిల్లా నాకోసము నీవు ఆపువ్వులు కోదుగాని... అబ్బా, మరిభరించలేను... ఉ. చూడు, ఈ వైపునుంచి చూడు. ఇటువైపు సముద్రముతప్ప మరేమీలేదు [గోపురము రెండోవైపు వెళ్తారు]. సముద్రము ఎంతబాగాఉంది? ఎక్కడా ఏ మూలా దుఃఖము కానరాదు. పచ్చగాను గంభీరముగాను, చక్కగాను, ఆసముద్రము ఉంటూఉంటే, మరిధైర్యము ఉండదు. చిన్నపిల్లా, ఏది ఏలాగైనా సముద్రము అది మాత్రము ఆలాగే రాత్రి అయేదాకా చల్లగా నవ్వుతూనే ఉంటుంది. చూడు ఆచిన్న చిన్నతరంగాలు...అబ్బా, నాచేతకాదుసుమా అబ్బా... పువ్వులు, సముద్రము ఒప్పకుండా ఉన్నవి. ఈ పట్ట పగలు ఆపని చేయడానికి ధైర్యము చాలకుండా ఉంది.

చిన్నపిల్ల:—అక్కయ్యా, ఇవిగో కాకులు ఇవిగో ఈలాగువస్తున్నాయి. ఎన్నిఉన్నాయి; ఎన్నో; ఒకవెయ్యిఉంటాయి!

సుశీల:—సముద్రము అవతల ఒడ్డునుండి ఎగిరి వచ్చేయి. మనకోసానికి వార్తలు తెస్తున్నట్లు ఎగిరిఎగిరి వస్తున్నట్లు ఉన్నవి చూడు.

చిన్నపిల్ల:—వార్తలుకాదు. చిన్న చిన్న చేపలు అవి... గోడసందులలోనుండి కాకిపిల్లలు తల్లులకోసము కాకా అని అరుస్తున్నవి. చూసేవా అల్లాపెద్దకాకి, ఎంత చేప ఉందో దాని ముక్కులో! నీకు కనబడలేదూ! అదిగో, చూడు అదిగో. అప్పుడే తినివేసేయి. పెద్దకాకులు తినలేదు, తనకేమీ ఉంచుకోందికాదు చూడే అక్కయ్యా, అది తల్లా.

సుశీల:—తాతమ్మతో, ఏమిటి చెప్పేను?

చిన్నపిల్ల:—అక్కయ్యా, ఎందుకు ఏడుస్తున్నావే?

సుశీల:—ఏడవలేదే. ఆలోచిస్తున్నాను, వచ్చివేసేముందర తాతమ్మను ముద్దాడేనా లేదా?

చిన్నపిల్ల:—ముద్దాడేవు.

సుశీల:—ఎన్నిమార్లో!

చిన్నపిల్ల:—ఒక్కమారే; మనకు వేళ చాలక......

సుశీల:—సుకుమారముగా ముద్దాడి ఉండలేదు కాబోలు

చిన్నపిల్ల:—తొందరతొందరగా వచ్చివేసేము, అక్కయ్యా.

సుశీల:—ఉ. ఉ. బాగాలేదు. కూడదు... తాతమ్మ ఒక్కర్తే ఉంటుంది; ఈసంగతి ఎప్పటికీ నామనస్సులో ఉండిపోతుంది.

మామూలుకంటె ఎక్కువ కోమలముగా ఉండకుండా ఉండివెళ్లిపోతే, వాళ్లపై ప్రేమ లేకపోవడముచేతనే వెళ్లిపోయేమని వాళ్లు అనుకొంటారు. వారు ఆలాగు తలచకూడదు; ప్రేమలేదని వారికి నమ్మకముఉండకూడదు. ప్రేమ మరీఎక్కువైనపుడే, కోమలముగా ఉండడానికి ఎక్కువగా జంకుతాము. ఇంతకూ, తప్పేమో. వాళ్లు ఏమి చేసినా, వాళ్లుఉన్నన్నాళ్లూ మనము ఆఖరున చెప్పినమాటే జ్ఞాపకముపెట్టుకొంటారు. మాఅమ్మపోయేముందర నాకు ఆలాగే అయింది, చిట్టచివరకు ఒకచిన్న నవ్వునవ్వకుండానేపోయింది; నాకెప్పుడూ అదేజ్ఞాపకము ఉండిపోయింది; మాఅమ్మ నవ్వలేదుకదా అని నాకించ. అంతకు పూర్వము చేసినదంతా మరి లెక్కలేదు ...అంతేకాకుండా రూపసినిగురించి ఏమి చెప్పేనో? నాకు జ్ఞాపకములేదు. మళ్లా తాతమ్మను చూడాలి... ఉన్నవాళ్లా, వారిసంగతివారిదే. వారికి ఈసంగతేమీ తెలియకూడదు... కాని ఆమె ఒక్కర్తే ఉన్నది; ఆమెకోరకు కాదుగదా నేను ఈ గోపురముమీదికి రావడము కిందికి వెళ్లడమున్నూ...చూసేవా, ఇది అసాధ్యముగా ఉంది. దా, మనము వెళ్లి తాతమ్మను చల్లగా, కోమలముగా ముద్దాడుదాము, రా. [నిష్క్రమింతురు.]

## రంగము 5.

లోగిల్లో ఒకగది

తాతమ్మ నిద్రలోఉంది. సుశీల, చిన్నపిల్ల ప్రవేశింతురు

సుశీల:—[తాతమ్మను లేపి] తాతమ్మా!

తాతమ్మ:—సుశీలా, వచ్చివేసా, ఎంతోసేపటినుంచీ నీకోసము ఎదురుచూస్తూఉన్నాను.

సుశీల:—తాతమ్మా, వెళ్తానని చెప్పినప్పుడు కోమలముగా ప్రవర్తించి వెళ్లలేదని నేను కించపడుతున్నాను, నన్ను క్షమించుము.

తాతమ్మ:—ఏమి, సుశీల, కోమలముగానే ఉంటివే! నీమనస్సులో ఏదో నిన్ను బాధిస్తున్నదిగాని...

సుశీల:— నామనస్సులో ఏమీలేదు. తాతమ్మా, నీవంటే నాకెట్టిప్రేమ ఉందో నీకు తెలియజేయాలని తప్ప మరేమీలేదు.

తాతమ్మ:—నాకు తెలుసునుగా నీ వెన్నో మార్లు నీప్రేమ వ్యక్తపరచినావు; నాకెప్పుడూ సందేహములేదే.

సుశీల:—నిజమేకాని ఇప్పటివరకు నామట్టుకు నాకే తెలియలేదు.

తాతమ్మ:—పిల్లా; ఏదీ దగ్గిరగా రాఅమ్మా. ఈపాడు చేతులు పడిపోయిన దగ్గిరనుంచీ, నాకు ఇష్టమైనవారిని కౌగలించుకో లేకున్నానని నీకు తెలుసునుగదా, పోనీ, నీవే కౌగలించుకో, సుశీలా; నీవేదో వింతగా ఉన్నావు ఇవ్వాళ; అందుచేతా నాపై నీకు గలప్రేమ నీకుతెలిసింది. అంటావు?

సుశీల:—ఆహా అది కాదు. నాకు ఇంతకు పూర్వమే తెలుసును కాని సాధారణముగా ఒకసంగతి తెలిసియున్నా స్పష్టముగావ్యక్తముకాకుండా ఉంటుందిచూడు. అది అందుచేతనే అకస్మాత్తుగా ఒకనాడు వ్యక్తమై ఉండవలసినంత దయగా ఉండ

లేదనిన్నీ చేయవలసినంత చేయలేదనిన్నీ, చూపవలసినంత ప్రేమ చూపలేదనిన్నీ, ఇవన్నీ ఒక్కమారు స్పష్టముగా తెలుస్తవి. అప్పుడు అంతా మించిపోకుండా ఉన్నప్పుడే తిరిగి ప్రారంభించాలని తోస్తుంది. నాకు తల్లీ తండ్రీ ఎవరూ లేరుగదా, తాతమ్మా, నీవుకూడా లేకపోయి ఉంటే తల్లి అంటేఏమిటో నాకు తెలిసే ఉండకపోయి ఉండును. సుశీలను ఒక్కనాడైనా విడిచిపెట్టకుండా పెంచి పెద్ద చేసేవు. నీవు ఉండబట్టే దుఃఖముగా ఉన్నప్పుడు ఎవరివద్దకువెళ్లితే సుఖము కలుగుతుందో తెలుస్తూఉండేది.

తాతమ్మ:—అమ్మా ఆలాగుకాదు. నన్ను విడిచిపెట్టిపోకుండా ఉన్నదానవు నీవే.

సుశీల:—ఎందుకు ఆలాగుచెప్తావు. నాకోసము అంటిపెట్టుకొని ఉన్నదానవు నీవే అని నేనుబాగా ఎరుగుదును.

తాతమ్మ:—నీవు ఈమధ్యాహ్నము ఎందుచేతనోకాని వింతగాను, చాలా నిండుగాను ఉన్నావు; అయినా విచారిస్తున్నట్లు కనబడలేదు.

సుశీల:—నేను ఎప్పుడూకూడా సుఖముగానే ఉన్నాను; సుఖమంటే ఏమిటో నాకిప్పుడు తెలిసింది.

తాతమ్మ:—సుఖము నీకు దూరమైనదని కాదుగదా నీ అభిప్రాయము?

సుశీల:—ఛా, ఎంతమాత్రమూకాదు. నేను ఇప్పుడు కనుక్కోగలిగేను, తాతమ్మా... పోనీకాని నీకు సుఖమేనా చెప్పవిూ.

తాతమ్మ:—ఎప్పుడంటావు?

సుశీల:—ఇన్నాళ్లూ, తాతమ్మా.

తాతమ్మ:—ఎప్పటిమాటఅంటున్నావు?

సుశీల:—ప్రాణము ఉన్నప్పుడు.

తాతమ్మ:—అందరికీ సంభవించేవిధాన నాకు కూడా దుఃఖముకలిగినదినాలు ఉండెను, కాని నీవు నన్నువిడిచిపెట్టకుండా ఉండడముచేత నాకు ఎప్పుడూ సుఖముగానే ఉండెనని నేను చెప్పగలను.

సుశీల:—నీసౌఖ్యానికి నేనంతకారకురాలనని నీవు తలస్తూఉండకూడదు; ఎందుచేతనంటే నేను ఒకవేళలేకున్నా, రూపసి ఉంటుందిగదా.

తాతమ్మ:—సుశీలా, ఆమెనెప్పుడూ నాకాళ్లమీదవేసుకొని జోకొట్టలేదే.

సుశీల:—అయినా, నీవామెను ప్రేమించాలి.

తాతమ్మ:—నీకు ఆమెపై ప్రేమ ఉందికాబట్టి నాకూ ప్రేమఉన్నది ఆమెపై.

సుశీల:—అన్నిటికంటె ఎక్కువగా ఆమెయెడల నీకుప్రేమఉండాలి, ఎందుచేతనంటే ఆమెవల్లనే సౌఖ్యమంటే ఏమిటో నాకు బాగాతెలిసింది... ఆమె ఎంతోచక్కనిది. అంతచక్కనిదికాబట్టే ఆమెను నేను ఎరిగిననాటినుండి, కన్నీరుతోనిండిన నేత్రములతో ఆమెప్రక్కను నివసిస్తున్నాను.

తాతమ్మ:—సుశీలా, నీచేతులు ఎందుకే ఇంత వేడిగా ఉన్నవి?

సుశీల:—నాకెంతో సుఖముగాఉంది కాబట్టి.

తాతమ్మ:—నాచిన్నపిల్లా, నీవంటేనాకు సర్వ మూగదా అమ్మా.

సుశీల:—తాతమ్మా, నావల్లనీకు ఎప్పుడైనా దుఃఖముకలిగిందా?

తాతమ్మ:—నాకేమీ జ్ఞాపకములేదమ్మా.

సుశీల:—అవును. నీవు జ్ఞాపకముతెచ్చుకో. ఎందుకంటే, మనము ఎవరిని ఎక్కువగా ప్రేమిస్తామో వారికే ఎక్కువగామనము దుఃఖము కలుగజేస్తాముకూడా; తాతమ్మా, నీకు ఎప్పుడుఎక్కువగా నొప్పికలుగజేసేనో, చెప్పుమీ.

తాతమ్మ:—నాకు దుఃఖముకలుగజేసేనని అంటూ నీవు ఏడిచినప్పుడే నాకు ఎక్కువ నొప్పి కలుగజేసేవు. కాని నీతప్పుకాదే అప్పుడు... మరేమీ జ్ఞాపకములేదు.

సుశీల:—మరెప్పుడూ ఏడవను.

తాతమ్మ:—గడియారములోని దిమ్మ ఆడేటట్లు సుఖముకూడా ఇటూఅటూ ఆడుతూ ఉంటుంది. అందుచేత సాధ్యమైనంతవరకూ కన్నీరురానీయకుండా మనము ప్రయత్నము చేయాలి.

సుశీల:—నీవన్నమాటనిజమే. సౌఖ్యము తిరిగి నీకూవారికీకూడా సమకూడిన తరువాత, వాళ్లని ఒకనాడు నీప్రక్కకూర్చుండబెట్టుకొని, వారికి ఒక అనాధబాలికకథ చెప్పు...

తాతమ్మ:—ఏమిటి అంటున్నావు, సుశీలా?

సుశీల:—ఏమీలేదు, నాచిన్నతనము రోజుల గురించి ఆలోచిస్తున్నాను.

తాతమ్మ:—అవును సుశీల, నేనుకూడా చాలామార్లు ఆచిన్ననాటి రోజులగురించి ఆలోచిస్తూఉంటాను. అప్పటికి ఇంకా నాకీరోగము రాలేదు. నిన్ను ఎత్తుకోగలిగేదానను; నీవెంట పరుగెత్తగలిగేదానను. నీవు ఉండబట్టి మళ్లా తల్లివలె ప్రవర్తించగలిగేను. నీకూ ఒకనాడు ఎప్పుడో వ్యక్తమవుతుంది తల్లిగా ఉండడమంటేఏమిటో; అప్పుడు విసుగుఅన్నమాటే ఉండదు. ఇంతఎందుకు చావువచ్చినాసరే, బిడ్డను లాలించేటట్లు లాలిస్తారు....అంతా మెల్ల మెల్లగా కొంచెము కొంచెము పోతుంది.

సుశీల:—అవును, తాతమ్మా, దుఃఖము కూడా క్రమంగా పోయిపోయి, తుదకు మరి ఉండదు. కాని మంచిమాత్రము నిలిచి ఉంటుంది, ఉన్నవాళ్లందరూ సుఖముగా ఉంటారు.

తాతమ్మ:—ఎవరన్నారు ఆలాగు?

సుశీల:—రూపసి చెప్పింది, నేను నేర్చుకున్నాను.

తాతమ్మ:—నీ నేత్రములు ఏమి ప్రకాశిస్తున్నవి?

సుశీల:—[పైకివస్తూఉన్న రోదనధ్వనినిఅణచివేసి] ప్రపంచమంతా నేను ఒక్కలాగే, ప్రేమిస్తున్నాను కాబట్టి నానేత్రములు ఆలాగుఉన్నవి.

తాతమ్మ:—నీవు ఏడుస్తున్నట్లు ఉంది,సుశీలా?

సుశీల:—లేదే తాతమ్మా; ఏవో రెండుచుక్కలుకన్నీరుజారితే, అవి ఆనందబాష్పములే.

తాతమ్మ:—ఏదీ కౌగలించుకో...ఆ, మరింత గాఢముగా, మరింత...నావద్ద ఉండిపో.

చిన్నపిల్ల:—నాకో ముద్దు.

సుశీల:—[చిన్నపిల్లను మెల్లిగా తప్పించి] ఉండు. తాతమ్మ నన్నే ముద్దులాడాలి ఇవ్వాళ. ముద్దులన్నీ నీవే అయేరోజు వస్తుంది ఉండు...తాతమ్మా, ఇక వెళ్తాను.

తాతమ్మ:—సుశీలా! ఏమిటది! ఎక్కడికి వెళ్తావు?

సుశీల:—వెళ్తాను.

తాతమ్మ:—సుశీలా, ఉండు. అబ్బా, వెళ్ల వద్దు. నాకిష్టములేదు. నీవు వెళ్లవాటము కాదు. [లేచి చేతులు చాచాలని ప్రయత్నముచేస్తుంది కాని చాచలేదు.] అబ్బా, చాచలేను. చూచేవా సుశీలా, నాకు ఇష్టములేదు. వద్దు.

సుశీల:—తాతమ్మా, నాకున్నూ, ఇష్టము లేదు... వెళ్తా... రాత్రికులాసాగా నిద్రపో... కలలేమీ కనవద్దు... వెళ్తా వెళ్తా.

[చప్పున, చిన్నపిల్ల చేయిపట్టుకొని, పైకి వెళ్లిపోతుంది.]

తాతమ్మ:—సుశీలా...సుశీలా...

[మెల్లిగా తనలో తాను ఏడుస్తూ ఉంటుంది. వెలుతురు క్రమముగా తగ్గిపోతూ ఉంటుంది]

## రంగము 6

లోగిట్లో ఒక వసారా

[చిన్నపిల్ల చేయిపట్టుకొని సుశీల ప్రవేశిస్తుంది...ఎదురుగుండావస్తున్న రూపసినిచూచి చిన్నపిల్లతోకూడా ఒకపెద్ద స్తంభముప్రక్క దాగుంటుంది.]

రూపసి:—[దగ్గరగావచ్చి] నీవా సుశీలా, ఎందుకుదాగున్నావు?

సుశీల:—రూపసీ, ఎందుకో నాకేతెలియదు ...నీవు ఒక్కర్తెవే ఉండాలని నీకు ఉన్నాదని అనుకొన్నాను.

రూపసి:—ఎక్కడికి వెళ్తున్నావు? చిన్నపిల్ల క్రీకంటిని చూస్తున్నది. ఏమి, మీరిద్దరూ కలిసి ఏదైనా కుట్రపన్నేరా ఏమిటి?

సుశీల:—ఎవరితోను చెప్పనని ఖరారుచేసేను.

రూపసి:—చిన్నపిల్లా, ఎక్కడికితీసుకొనివెళ్తున్నావు సుశీలను? [చిన్నపిల్లమాట్లాడదు] ఏమి, నీవూ చెప్పవూ?

సుశీల:—పెద్దవాళ్లవలె రహస్యముదాచడము ఏలాగో చిన్నపిల్లకుకూడా తెలుసును.

రూపసి:—సాయంకాలము కాంతియైనా, నీవు తెల్లవారినట్లు కనుపిస్తున్నావు, సుశీల.

సుశీల:—నిన్నుముద్దుపెట్టుకోవాలని ఉంది, రూపసి.

[చాలాసేపుఒకరినొకరుముద్దుపెట్టుకొంటూరు]

రూపసి:—సుశీలా, నీమోవి ఎంత కోమలంగాను, ఎంతమనోహరముగాను ఉంద్దో.

సుశీల:—నీదిన్నీ రూపసీ,... నాకు చాలా కులాసాగా ఉన్నది.

రూపసి:—ఒక తేజస్సునీపై ఆవరించినట్లున్నది.

సుశీల:—తాతమ్మను చూచేవా?

రూపసి:—లేదు. ఇప్పుడు వెళ్లేదా?

సుశీల:—ఎందుకూ, వద్దు. అవసరము లేదు. నిద్రపోతున్నది...మదనునికొరకు చూస్తున్నావా?

రూపసి:—నీవో సుశీలా ?

సుశీల:—అతనిని కలిసినప్పుడు నాతరఫున నీవు అతనిని ముద్దాడుము...నేను లేనప్పుడు అతనిని ముద్దాడేదానవు నీవుగదా అని నాకు చాలా సంతోషముగా ఉన్నది... నీవులంటే నాకు చాలా అనురాగము సుమా! చూచేవా చిన్నపిల్లకు చాలా తొందరగాఉంది; చూడు నాచెయ్యిపట్టుకొని లాగుతున్నది. రూపసీ, వెళ్తాను. మళ్లా ఇప్పుడే కలుసుకొంటాను.

[చిన్నపిల్ల చెయ్యిపట్టుకొని, పాటపాడుకొంటూ సుశీల వెళ్లిపోతుంది. పాట వినబడకపోగానే రూపసికూడా వెళ్లిపోతుంది.]

రంగము-7

గోపురముమీద

[సుశీల చిన్నపిల్ల ప్రవేశింతురు.]

సుశీల:—చిన్నపిల్లా, కాలము సమీపించింది. మళ్లా వాళ్లదగ్గిరికి ఇక వెళ్లను, వాళ్లను చూచి నవ్వుట మరిఉండదు ...ఎంతచలిగా ఉంది. ఇక్కడ దక్షిణగాలి వేస్తున్నది ఆ కెరటాలమీద వెలుతురు ఏలాగు పడుతున్నదో చూచేవా! పువ్వులు కనబడవు. మనుష్యులమాటలు వినబడవు. ఎక్కడచూచినా నిశ్శబ్దము, విచారము నిండిఉన్నవి...ప్రొద్దున్నకీ, ఇప్పటికీ ఎంత భేదము!

చిన్నపిల్ల:—అక్కయ్యా, ఆపక్షిఏది ?

సుశీల:—బాగా చీకటిపడ్డదాకా ఉండాలి. సూర్యుడు బాగా సముద్రము అడుగుకి చేరాలి. వెలుతురు పూర్తిగా పోవాలి. అప్పుడు పక్షి పైకివస్తుంది. ఆపక్షికి వెలుతురంటే భయము; ఎన్నడూ సూర్యకాంతి తగిలి ఎరగదు.

చిన్నపిల్ల:—అయితే అక్కయ్యా, నక్షత్రాలు ఉంటేనో ?

సుశీల:—నక్షత్రాలు ఉన్నాసరే (ఆకాశము వైపుచూచి) నక్షత్రాలు లేవే; ఆకాశము లోనుంచి పొడుచుకొనిరావాలనికాచి కనిపెట్టుకొని ఉన్నవిగదా. అవును మనము తొందరపడాలి; అవి వచ్చివేస్తే మరి కష్టమవుతుంది.

చిన్నపిల్ల:—అబ్బా, చాలా చలిగాఉంది.

సుశీల:—ఇక్కడ కూర్చుందాము! ఈగోడ చాటున గాలి తగలదు. ఆకాశముమీద ఎరుపు రేఖ పోయినదాకా కాచిఉందాము. చూచే సూర్యుడు ఎంతమెల్లిగా అస్తమిస్తున్నాడో! కనబడకుండా సూర్యుడు పోయినతరువాత, పక్షికొరకు నేను వెతు

కుతాను. నాపాలువ నీకుకప్పతాను, దా; నాకు మరి అక్కర లేదు.

చిన్నపిల్ల:—అంత గట్టిగా దగ్గరగా ఎందుకు పట్టుకొన్నావు అక్కయ్యా?

సుశీల:—ఏమీలేదు! నా సౌఖ్యము నాకు ఎక్కువైంది. ఈరోజు ఉన్నంత సుఖముగా ఎప్పుడూ నేను ఉండలేదు. చూడు, నావైపు చక్కగాచూడు. నేను నవ్వుతున్నానుకాను? తప్పకుండా నవ్వుతున్నాను. నీవుకూడా ఎందుకునవ్వవు?

చిన్నపిల్ల:—ఏమిటి అంతగబగబ మాట్లాడుతున్నావు?

సుశీల:—అంత తొందరగా మాట్లాడుతున్నానా...మరి వేళలేదు తాపీగా మాట్లాడడానికి.

చిన్నపిల్ల:—నా పువ్వులన్నీ ఎందుకు తెంపి వేస్తున్నావు?

సుశీల:—ఏమి పువ్వులు? ఇవా! నీవి అన్న మాట మరిచిపోయినాను.

చిన్నపిల్ల:—ఏడవవద్దే, అక్కయ్యా, ఎందుకే.

సుశీల:—ఏడవలేదే. ఏడుస్తున్నానని ఎప్పుడూ నమ్మకు. నేను విశేషముగా నవ్వుతూ ఉండబట్టి ఏడుస్తున్నట్లు నీకు కనుపిస్తున్నది కాబోలు.

చిన్నపిల్ల:—నీకళ్లు ఏడుస్తున్నట్లు ఎందుకు ఉన్నవి?

సుశీల:—నాకళ్లు చేసేపనికి నేనెట్లుపూచీ?... ఒక్కటి జ్ఞాపకముపెట్టుకో. నేను దుఃఖపడుతూ ఉంటినని ఎవరితోనైనాచెప్పినావు అంటే నీకు చాలా చాలారోజులవరకు దెబ్బలవుతవి. శిక్షతప్పదు.

చిన్నపిల్ల:—ఏమి?

సుశీల:—నీకు తరువాత తెలుస్తుంది. అట్టే మరిప్రశ్నలు అడగకు. నీవు ఇంకా చిన్నదానవి; అందరికీ తెలిసినన్ని సంగతులు నీకుతెలియవు. నీఈడున నేను ఉన్నప్పుడు నాకూ తెలియలేదు. నేను ఏమిచేస్తానో అదికాదు నీకు కావలసినది...చూడు, ఎవరికీ చెప్పకుండా ఉండడము చాలా దుఃఖముగా ఉంటుంది కాబట్టి, ఎవరికైనా చెప్పాలనిఉన్నా, నీతో చెప్పకూడదు.

చిన్నపిల్ల:—అక్కయ్యా, సూర్యుడు మరి అగుపడడే.

సుశీల:—ఉండు. కొంచెము సేపు ఉండు. సూర్యుడు పోతూఉంటే, మరొకటి సమీపముగా వస్తూఉన్నది. అది బాగా దగ్గిరగా వస్తే నాకు బాగా కనుపిస్తుంది ... నిన్ను ఇక్కడికి తీసుకోరావడము మంచిపనికాదు కాబోలు. ఎవరైనా ఒకరు రావడము మంచిది; ఎందుకంటే ఇక్కడ ఏమి జరిగిందో వాళ్లు తెలుసుకోవాలని తంటాలు పడతారు. కాని వారికి ఏమీ తెలియకూడదు...చెల్లెమ్మా, నేను ఏమిటి అంటున్నానో నీకు ఏమీ తెలియదుగదా...కాని ముందుముందు ఒకనాడు ఇదంతా జ్ఞాపకమువచ్చి నీకు తెలుస్తుంది; ఇప్పుడు నీకు అగుపడ్డా అర్థముకానిది అంతా అప్పుడు

తెలుస్తుంది: అప్పుడు నీకు దుఃఖముకలుగుతుంది. నీవు చూడబోయేది ఎప్పటికీ మరిచిపోలేవు. నీవు పెద్దదానవు అయినతరువాత ఇందుకని ఎన్ని కన్నీళ్లు పెట్టుకొంటావో! నిన్ను ఇది ఎంత దుఃఖపెట్టుతుందోగదా! అందుచేత నన్ను క్షమించమని నిన్ను అడుగుతున్నాను. దీనిసంగతి ముందు తెలిసినప్పుడు నీవు పడేదుఃఖబాధకు నన్ను క్షమించుము.

చిన్నపిల్ల:—అక్కయ్యా, మళ్లా కాకులు గుంపులుగుంపులు వస్తున్నాయే.

సుశీల:—రేపుకూడా వస్తవి.

చిన్నపిల్ల:—ఉ.

సుశీల:—రేపుకూడా పాడతాయి.

చిన్నపిల్ల:—ఉ.

సుశీల:—పువ్వులు రేపుకూడా విడతాయి.

చిన్నపిల్ల:—అవునే, అక్కయ్యా.

సుశీల:—అయితే ఒకటి అందులో చిన్నది ఎందుకు కావాలి?

చిన్నపిల్ల:—అక్కయ్యా, ఒక్కసన్నని రేఖ ఉంది.

సుశీల:—అవును. వేళయింది...నీవే తొందరపెట్టుతున్నావు; ఆనక్షత్రములకు కూడా ఓర్మి ఉన్నట్లు లేదు. చిన్నపిల్లా, నాకు చాలాచాలా కులాసాగా ఉంది. వెళ్తానూ.

చిన్నపిల్ల:—నాకూ ఆలాగేఉంది. వేగిరముగా, మళ్లా నక్షత్రాలు వచ్చివేస్తవి.

సుశీల:—భయపడకు చిన్నపిల్ల; వాటికంట వారినేను పడను...దా, ఈమూల కుర్చో, చలిగాఉంది, నాపాలువ కప్పుతాను ... నాపైనీకు నిజముగా ప్రేమఉందా? సరేనులే, జబాబు అక్కరలేదు. వద్దు నీవు చెప్పవద్దు...ఇదిగో ఈపెద్దరాయి ఇక్కడ పెడతాను. ఇది దాటిరాకు. ఆ సందున్నచోట నేను వంగుతాను...నేను మరి కనబడకపోతే భయపడకు. మరేమీలేదు. నేను అవతలప్రక్కకువెళ్లేను అన్నమాట. ...నాకోసము కనిపెట్టుకొని కూర్చోకు. మెట్లమీదనుంచి నీవు ఒక్కర్తెవే దిగివెళ్లు...నేను ఏమిచేసేనో అని నీవు తొంగిచూడకు. గోడదగ్గిరారాకు ...వస్తే నీకేమీ కనబడదు సరేకదా, నీకు శిక్షకూడా అవుతుంది ... నీకోసము క్రింద ఉంటాను. చిన్నపిల్లా, ముద్దుపెట్టుకో. తాతమ్మతో చెప్పు...

చిన్నపిల్ల:—ఏమిటి చెప్పమన్నావు, అక్కయ్యా?

సుశీల:—ఏమీలేదు...ఏదో మరచిపోయేననుకొన్నాను. [సముద్రమువైపు ఉన్నదగ్గిరావెళ్లి, వంగినది.] అబ్బా, ఎంత లోతుగా ఉంది, ఎంతచలిగాఉంది!

చిన్నపిల్ల:—అక్కయ్యా!

సుశీల:—అదిగో, నాకు కనబడినది ... కదలకుమీ.

చిన్నపిల్ల:—ఏమిటి?

సుశీల:—ఉండు...ఇంకా బాగా వంగాలి... చిన్నపిల్లా! చిన్నపిల్లా! రాళ్లు కదిలి పోయినాయి! పడిపోతున్నాను! ఆ!

[గోడప్రక్క జారిపోయినది. పడిపోయిన ధ్వని వినబడినది. బాధ తెలియజేసేధ్వని ఒకటి లోతునుండి వినబడినది. ఇక నిశ్శబ్దము.]

చిన్నపిల్ల:—[లేచి, ఏడుస్తూ.] అక్కయ్యా! చిన్నక్కయ్యా! ... ఎక్కడ ఉన్నావు? నాకు భయము వేస్తున్నాది! అక్కయ్యా! ...[గోపురముమీద ఒక్కర్తే ఏడుస్తూ ఉన్నది.]



# ఋతు సౌభాగ్యము

పేట బాపయ్యా గారు

ద్విపద

మండుటెండ లవన్ని మాయమై పోయె
గండుగోయిలలెల్ల గర్వించి కూసె
కారుమబ్బులతోడ గగనతలంబు
కనులపండుగు జేయు గనువారికెల్ల
దరుణశాద్వలములు ధరణిపై నిండి
పసరుకాంతుల దిశల్ బయలు పెట్టెడును
ప్రాణికోటులకెల్ల బర్వమైపోయె
నెచట జూచిన నీర మెలమి గాన్పించు
చెరువులు గుంటలు చెలువొప్పె నీట
నిను డెంతసుముఖుడో యీరోజులందు
"దుక్కులు పదునున దున్నంగవలయు
కాలాన వెదలన్ని కావింపవలయు
తరుణాన వర్షాలు గురిపించి మమ్ము
గగనంపు తల్లిరో కాపాడవమ్మ"
యనుచు లోలోపల నానంద మెసగ
భూదేవినమ్మిన పుణ్యసంతతులు
సేద్యమే వృత్తిగ జీవించుసుతులు
సాధుసంపదయంత స్వాంతముల్ నిండి
మోముదమ్ములయందు మూర్తీభవింప
కరమున మొనకోల కర్రను దాల్చి
కన్నబిడ్డలయట్లు గారాబముగను
కనులలో ధరియించి కాపాడు కొనెడి
పసుల జంటలవెంట బయన మైనారు
ప్రకృతిరో! నీచిత్ర పరివర్తనమున
సకల సౌఖ్యంబుల సమకూర్చు నటులు
చల్లని యీఋతుసౌభాగ్య మొకటె
అఖిలమానవకోటి కాధార మగుచు
అఖిల ప్రపంచంబు నలరింపజేయు



తిరువల్లి క్కేణి సముద్రతీరమున మహాత్ముని మహోపన్యాసము

అధ్యక్షుడు శ్రీ మౌలానా యాకూబ్ హుస్సేనుగారి ప్రారంభోపన్యాసము

ప్రెస్ ఫోటో బీరో, చెన్నపురి.



మైలాపూరు 'అంజద్ బాగు'లో మహాత్మునకు తోటవిందు

న్యాయమూర్తి రామేశంపంతులుగారు మహాత్మునకు కుడిప్రక్క నున్నారు

ఏ. రత్నా అండు కో, చెన్నపురి.

# కవిజనాశ్రయ విమర్శన ఖండనము

జయంతి రామయ్య గారు, బి. ఏ., బి. యల్.

1917-వ సంవత్సరమునం దాంధ్రసాహిత్యపరిషత్తువారు వేములవాడ భీమకవి కృతమని ప్రసిద్ధిగన్న కవిజనాశ్రయమను ఛందోగ్రంథమును బ్రకటించిరి. నే నాగ్రంథమునకు "సంపాదకత్వము" వహించి మూలపాఠముల నిర్ణయించుటయే కాక పీఠిక నొకదానిని గూడఁ జేర్చినాఁడను. నేను చేసిన గ్రంథపరిష్కారమందును, రచించిన పీఠికయందును దోషములున్నవనియు వాని "నిదివర కెవ్వరును సూక్ష్మముగ విమర్శించియుండలేదు" గనుక యాపని నెరవేర్చుభారము తనమీఁదఁ బడినదని తలంచి చిలుకూరి నారాయణరావుగారొక విమర్శనము రచించి రక్తాక్షిసంవత్సర ఫాల్గుణమాస భారతిపత్రికలోఁ బ్రకటించినారు. నే నావిమర్శనము బయలుదేరిన వెంటనే చూచుట తటస్థించినది. విమర్శనము కేవల మసంబద్ధము, నిరాధారము, నిస్సారముగ నున్నది. దానితత్త్వ మిట్టిదని లోకమునకుఁ గొంచెము తెలుపుట మంచిదని యూహించి యావిమర్శనమునకుఁ బ్రత్యుత్తరమిచ్చుచున్నాను.

నారాయణరావుగారు చేసిన యాక్షేపములు (1) పాఠనిర్ణయమును గుఱించినవి కొన్ని (2) పీఠికను గుఱించినవి కొన్ని - యాప్రకారము రెండువిధములుగా నున్నవి - పుస్తకాపేక్ష లేకుండ వాదప్రతివాదములు సులభముగా గ్రహించుటకు వీలగునట్లు తొలుతఁ గవిజనాశ్రయములోని మూలభాగమును, పిదప దానిపై నారాయణరావుగారి యాక్షేపమును, తరువాత దానిఖండనమును జూపెదను.

నారాయణరావుగారి మొదటి యాక్షేపము అవతారికలోని మూఁడవ పద్యమును గుఱించినది. ఆ పద్యము

**1. మూలము:—**

వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణఁగల్గఁ భీమసుకవి నేఁ
గోమటి రేచన మీఁదను
నీమహిఁ గవు లెన్న ఛంద మెలమి రచింతున్.

అని యున్నది. ఈపద్యము క్రింద నీవిధముగా నునఁగా "వేమన వాడయని మాతృక -- వేములవాడ, లేములవాడ యని వ్యావహారిక నామములు - ఈగ్రామము హైదరాబాదు రాజ్యములో ...... నున్నది. అందు సుప్రసిద్ధమయిన భీమేశ్వరాలయము కలదు." అని టిప్పణము గలదు.

**ఆక్షేపము:—**

"మాతృక వేమనవాడ: దిద్దుబాటు వేములవాడ, వేములవాడ, లేములవాడయని వ్యావహారిక నామములు అని అడుగున సూచన—గ్రామనామములోకూడ మాతృకలో మార్చుటకు వీరికీ స్వాతంత్ర్యమేమో? వేమనవాడ యను గ్రామమొకాలమునుండి యుండకూడదా? వేములవాడభీమకవి ఈగ్రంథమును రచియించి యుండునని వీరికి గట్టినమ్మక ముండుటచేత ఈ దిద్దుబాటు జరిగినది" అని.

**ఖండనము:—**

అవును. గ్రంథము భీమకవి కృత మనునమ్మకము నాకుఁగలదు—నానమ్మక మెట్లున్నను, అవతారికా పద్యముల యుద్దేశమదియేకదా! రేచన రచించినట్లుగా భీమకవి యీగ్రంథమును రచించెనని చెప్పుటయే యీపద్యముల ప్రయోజనము. భీమకవియింటి పేరు వేములవాడవారనియు నతఁడు వేములవాడ గ్రామనివాసియనియు నన్నిమతముల వారి యభిప్రాయము. వేములవాడ గోదావరీ మండలములోనిదని కొందఱును, కరీంనగరము మండలములోనిదని కొందఱును చెప్పుచున్నారు; గాని, గ్రామనామము వేములవాడయనుటలో నభిప్రాయ భేదము లేదు. వేమనవాడ యను వాదమింతవరకుఁ బుట్టలేదు. వేములవాడలు రెండును తెలుఁగుదేశములో నున్నవి. భీమకవియుఁ దెలుఁగు

దేశమువాఁడే. అవతారికా పద్యములొక్క ప్రతిలోమాత్రమేయున్నవి. అదియైనను అరవదేశమందు దొరకినది. దానిలో వేమనవాడయను పాఠముగలదు. ఆపాఠము వ్రాయసకాని ప్రమాదమువలనఁ బుట్టినదని చెప్పకతప్పదు. అరవదేశమందీ ప్రతివ్రాసినవానికి గ్రామనామము వేములవాడయో వేమన వాడయో తెలియకుండుట యసంభవముకాదు. భీమకవియే యాపద్యములరచించినయెడల వేమనవాడయని ప్రయోగింపఁడుకదా! కవిప్రయుక్తపాఠమేదియో కనిపెట్టి, యది తప్పైనను ఒప్పైననుసరే, దానిని గ్రహించుట గ్రంథసంస్కర్తధర్మము. కావున నిచ్చట వేమనవాడను వేములవాడగాదిద్దుట న్యాయమే-వేమనవాడ పాఠమే మంచిదనుబుద్ధిమంతులు బయలుదేరినయెడల వారియుపయోగార్థమా పాఠముగూడ సూచింపఁబడినది:—

నారాయణరావుగారి రెండవ యాక్షేపమునకు మూలమయిన 6-వ యవతారికా పద్యము:—

2. మూలము:—

రేచనసంతోషింపఁగ
భూచక్రములోన భీమపురహరు కృపచే
నేఛందము సుకవుల ('లు'తప్పు)బ్రదు
కేఛందము తెరువుదాని నేరచియింతున్.

అనియున్నది.

"సంతోషింపఁగ"నన్నచో మాతృకలో "సంతోషిల్లఁగ" యని యున్నట్లు టిప్పణములోఁ జూపఁబడినది.

ఆక్షేపము:—

"నన్నయభట్టులోనే "సంతోసిల్లు" అని ప్రయోగములు గలవు. తర్వాతి కవులలో యీప్రయోజనము (?) బహుళముగా నున్నది." అని యాక్షేపము—

ఖండనము:—

కవి "సంతోషింపఁగ" యని ప్రయోగించి యుండునను మాహతోనే యీ సవరణ చేయఁబడినది. ఇది స్వల్పవిషయము. గనుక విస్తరించి చర్చించుట యనవసరము.

3. మూలము:—

పై పద్యమందే "సుకవుల బ్రదుకే ఛందము" అన్నచోట మాతృకలో "సుకవులు బ్రదికేఛందము" అని యున్నదని టిప్పణమునఁ గలదు.

ఆక్షేపము:—

దానిపై నారాయణ రావుగారి యాక్షేపమును చూడుఁడు—

"బ్రదికే" అనేరూపము గ్రాంథికము కాదనిన్నీ, "చ ఛ" లకు ప్రాసకూడదనిన్నీ వీరనుకొనడముచేత కలిగిన దీ దిద్దుబాటు." ఇందు రెండాక్షేపములున్నవి.

మొదటిది "బ్రదికే" యను రూపము సాధువయినను, సాధువుకాదని నేను దిద్దినానని. ఇది ముందు విచారింతము—

ఖండనము:—

"బ్రదికే" వంటి రూపములు కుప్పలు తిప్పలుగా సుకవుల గ్రంథాలలో నున్నవని నారాయణ రావుగారు వ్రాసినారు. ఉదాహరణము లేవియు నిచ్చియుండలేదు. ఆరూపము సాధువనియు, కడపటి ఎత్వమునకు విడిగా స్వరయతి కలదనియు నారాయణరావుగారు ఋజువు పఱిచినప్పుడొప్పుకొనవలసినదే కాని, యీదిద్దుబాటునకిది యొక్కటియె కారణముకాదు. మాతృక పాఠమును బట్టి 'తెరువు' అను శబ్దమున కన్వయము కుదరలేదు. 'ఛందము తెరువు' అని సమాసము సత్కవి చేయఁడు. తెరువునకు విడిగా నన్వయము లేదు. దిద్దిన పాఠములో సయితము అన్వయక్లిష్టత కొంచెము లేకపోలేదు. కాని మాతృకలోని పాఠమునకంటె మేలు. దిద్ది పద్యమున కర్థము లేకుండఁ జేసినానఁట. పండితుల కర్థము తెలియకపోదని నానమ్మకము.

4. "చ, ఛ" లకు ప్రాసము కూడదనుకొని యీ సవరణచేసినానని యింకొక యుపపత్తి కల్పించి, వర్గ ప్రథమ ద్వితీయాక్షరాలకును, తృతీయ చతుర్థాక్షరాలకును ప్రాసమైత్రికలదనిచూపుట కేమేమో వ్రాసి "రామయ్య పంతులుగారు "చ, ఛ"లకు ప్రాసము కూడదనుకొని కవిజనాశ్రయములోని పద్యమును దిద్దినారు" అని ముగించినారు. ఈ వ్రాఁత నారాయణరావుగారు

ఎట్లు వ్రాసినారో తెలియదు. దిద్దిన పద్యములో మొదటి రెండు పాదములలోను ప్రాసస్థానమందు "చ" కారమున్నది. మూఁడునాలుగు పాదములలో "ఛ" కారమున్నది. ఇది "చ, ఛ" లకు ప్రాసయయినదికాదా!

## 5. మూలము:—

7, 8 పొరటలయడుగున నీటిప్పణ మున్నది,— "ఈ (22 వ) పద్యమునకు ముందు చ, జలలో నీ క్రింది పద్యములు రెండునుగలవు.

(1) చను మగణము శ్రీనాథా
యనిన ముకుందా యనంగ యగణము రగణం
బననొప్పు మాధవాయనఁ
జనునోవరదాయనంగ సగణం బసుమా.

(2) తగణము శ్రీకృష్ణయనఁగ
నగు జగణంబును మురారి యనఁగా జగతిన్
భగణము శ్రీపతియనఁగా
నగణంబగు నృహరియనఁగ నలినదళాక్షా!

ఇందు మొదటిపద్యము అనంతుని ఛందమునందును గలదు. జైనుఁడగు కవి విష్ణు ప్రతిపాదకములగు పద్యముల రచించుట యసంభవము. కనుక యీపద్యములు ప్రక్షిప్తములని యూహింపఁదగును." అని

## ఆక్షేపము:—

"ఇంతకును కవి శ్రీనాథా................. అనుపదములను ఆయా గణముల కుదాహరణములుగా చూపియున్నాఁడే కాని తన మతమును ప్రతిపాదించ లేదే. పోనీ; తాను జైనుఁడనను అభిమానము కవికుండెనేమో అనిన తనవిషయమై "వాక్ర్సీ వల్లభ............ అను(?) మొదలైన విశేషములను చెప్పుకొనియే ఉన్నాఁడు. కవిజైనుఁడైనంత మాత్రమున విష్ణువుపేరుకూడ తలఁపఁగూడ నంతేపట్టుదల ఉండక పోవచ్చును.........." అని.

## ఖండనము:—

పూర్వోదాహృతపద్యములు రెండును విష్ణుపరములని నారాయణరావుగా రొప్పుకొన్నారు. కావున నావిమయము చర్చింపనక్కఱలేదు. ఆరెంటిలో మొదటి పద్యము అనంతునిఛందమునందున్నది. కవిజనాశ్రయకర్త ముందువాఁడా, అనంతుఁడు ముందువాఁడాయను వాదము ప్రస్తుతము విడిచిపెట్టి విచారింపఁగా కవిజనాశ్రయము నుండి యనంతుఁడైనను, అనంతుని ఛందోదర్పణము నుండి కవిజనాశ్రయకర్తయైనను ఆపద్యమును సంగ్రహించి యుండవలెను. కవులిద్దఱు నాపద్యమునేయొకరికిఁదెలియకుండ నింకొకరు రచించుట యసంభవము. అట్టికవులా పద్యమువంటి పద్యమును జెప్పలేక యొకరిపద్య మింకొకరపహరించిరనుట యతిసాహసము. ఆపద్యము ఛందోదర్పణమునందుండుట మిక్కిలి యుచితము. కవిజనాశ్రయమందుండుట యుచితముగాదు. కాఁబట్టి యీపద్యము ఛందోదర్పణములోనిదనియు, లేఖకు లెవ్వరో ప్రమాదమున కవిజనాశ్రయమందుఁ గలిపిరనియు నూహింపక తప్పదు. రెండవపద్యముకూడ విష్ణుపరమే కదా! అందు సంబోధనముకూడ విష్ణునకే కదా; కవిజనాశ్రయములోని సంబోధనములన్నియు రేచనకేగాని దేవతలకు లేవు. ఆ పద్యము కవిజనాశ్రయములోనిదని చెప్పుటెట్లు? జైనుఁడగు రేచనకు వైష్ణవమతమందు ద్వేషము లేకపోవచ్చును గాని యన్యదేవతాపరముగాఁ బద్యములుచెప్పుట యసంభవము.

## 6. ఆక్షేపము:—

"వాక్ర్సీపత్నీ వల్లభా, శ్రీసంసేవ్య వక్షా" ఇత్యాది సంబోధనలు గ్రంథమం దచ్చటచ్చటఁ గలవు. అవి దేవతాప్రతిపాదకములు కావా? యని యింకొక యాక్షేపము.

## ఖండనము:—

నారాయణరావుగా రుదాహరించిన సంబోధనలలో నొకటి రెంటికిఁ దప్పఁదక్కిన వానికి మనుష్యపరముగా నర్థము చెప్పవచ్చును. అట్లు చెప్పుటే యుచితము. అట్లుచెప్పక "వాగ్వధూవల్లభా" యనఁగా బ్రహ్మయనియు, "శ్రీనివాసా" యనఁగా విష్ణువనియు నర్థము చెప్పినయెడల కృతిపతి యొకప్పుడు బ్రహ్మయు నొకప్పుడు విష్ణువును గావలసి వచ్చునుగదా! అయినను, నేను కనిపెట్టినవి గాక మఱికొన్ని ప్రక్షిప్తములు గ్రంథమం దుండవచ్చును.

7. ఆక్షేపము:—

పూర్వోదాహృతాక్షేపమును విస్తరించి వ్రాసి చివర "శ్రీపాదపంకజావాసమధుకరుండు" అను దానికి "జినపాద" అని దిద్దినారని మాకుసందేహము. (పుట 66)" అను వాక్యముతో ముగించినారు. 66 పొరటలో ఎత్తుగీతి.

"శ్రీసమేతుఁడైన జినపాదపంకజా
వాసమధుకరుండు వాసవప్ర
హాసభాసిరేచఁ డనవద్యుఁ డక్కిలి
ప్రాసనీసమనుమఁ బరఁగఁ జెప్పె." అని యున్నది.

1 ప్రతిలో మొదటిపంక్తిలో శ్రీపాదయను పాఠమున్నదని యడుగున టిప్పణమున్నది.

శ్రీపాదయను పాఠమును తీసివైచి మాతృకలలో నెచ్చటను లేని జినపాదయను పాఠము నేను కల్పించినానని నారాయణరావుగారి వాదము.

ఖండనము:—

"శ్రీపాద" యనుపాఠము ద్ర ప్రతిలో మాత్రమే యున్నదని వ్రాసితిని గదా. తక్కిన ప్రతులలో "జినపాద" యను పాఠమున్నదనియే కదా దీనికర్థము. ఆ ప్రతులు నారాయణరావుగారు చూచినారా? వానిలో నీపాఠమున్నదా లేదా? లేనిచో "సందేహ" మేల స్పష్టముగానే చెప్పవచ్చునే. ఉన్నచో నాపాఠము నేను కల్పించి నానన్నమాట యసత్యమే కదా! అనుమానము కలిగినప్పుడు తన్నివృత్తిచేసికొనుట కుపాయములుండఁగా వాని నిరాకరించి "ఇది కల్పితము, అది యబద్ధము" అను మాటల నేమిగా భావింపవలయునో వివేకులు నిర్ణయింతురుగాక.

8. ఆక్షేపము:—

"పుట. 21 లో ప్లుతయతి కుదాహరణముగా భాస్కరరామాయణములోని "ఏజనకాత్మజన్" అనుపద్యమును కవిలక్ష్యముగా నిచ్చినట్లొక ప్రతిలోనుండగా పంతులవారు దానిని తొలఁగించినారు. పుట- 26 లోని వచనమును పద్యములును "కావ్యాలంకార చూడామణి యందుఁగూడ గన్పట్టుచున్నవి, కావున నిందుఁ బ్రక్షిప్తములైనవేమోయని సంశయింపఁ దగియున్నది." అని వ్రాసియుగ్రంథమునుండితొలఁగించకవిడిచినారు. వీరిట్లు చేయుటకు కవిజనాశ్రయకర్త భాస్కరునికిని, విన్నకోటపెద్దన్నకును తరువాతివాఁడైపోవునేమో అనుభయము తప్ప మఱియొక కారణముకానరాదు." అని.

ఖండనము:—

ఆపద్యములు ప్రక్షిప్తములనుటకు ముఖ్యకారణము పీఠిక 17 పొరటలో నిట్లుచెప్పియున్నాను. "కవిలక్ష్యలక్షణములురెంటిని తానే చెప్పెనుగాని యితరులు రచించిన పద్యములు లక్ష్యములుగాఁ దెచ్చికొనియుండలేదు. వికటకవులు కొన్నివింతలుకల్పించి కవిజనాశ్రయమునఁగలిపినారని యప్పకవివ్రాసినది యథార్థము"అని కవిజనాశ్రయమందు, ప్రక్షిప్తము లున్నవన్నవాఁ డప్పకవి యొక్కఁడేకాదు. అతనికిఁ బూర్వుఁడయిన వెల్లంకితాతంభట్టు కవిచింతామణిలో నిట్లుచెప్పెను.

"భీమన యఖండంబు మొదలైన కొన్నిపలుకులకు లక్షణలక్ష్యంబులు చెప్పఁడు. వానికిఁ గొందఱు ప్రజ్ఞాలవదుర్విదగ్ధు లసంగతంబుగాఁ బెనిచి తగిలించినారందున నతని యంకితంబులులేవు గావున వానిని బ్రమాణీకరింపవలవదు"

మూలము:—

54-వ పొరటలో కాకుదోషమున కుదాహరణముగు

వెలయఁగఁ * జెటాకువిలుగొని
యలరమ్ములుచేతఁబట్టి యంగజుఁడు విరా
హులనేయు నేర్పుకడిమిన్
దొలమెలయఁగ ననినఁగాకు దోషంబయ్యెన్.

అనుపద్యమునిచ్చి పొరటయడుగున 7-వ టిప్పణమున "మూలములో జిగురాకనియున్నదిగాని యది పొరపాటు" అని వ్రాసినాను.

ఆక్షేపము:—

దీనిపైయాక్షేప మిట్లున్నది.

* చెటాకు అనుపాఠము నేను కల్పించినదిగాదు. ఇతర పాఠాంతరములతోఁ గలిసి కొన్ని ప్రతులయందున్నది. చూ. 6 వ టిప్పణము.)

"పుట- 84 లో 'వెలయఁగఁ (జెఱాకు) విలుగొని' అనుకందపద్యపాదమునుజూడుఁడు. మూలములో 'చిగురాకు' విలు అని ఉన్నదట. అదిఘోరపాటట. ఎందుచేతనో? తెనుగు కవులు మన్మథుని 'చిగురాకువిలుకాఁడు చిగురువిలుకాఁడు, చిగురు విలుతుఁడు,' అనివర్ణించియే ఉన్నారే! 'చిగురాకు విలుకానిచేతి చక్రమురీతి' అని శశాంకవిజయము 3-వ ఆశ్వాసము. ఇట్టే ఎన్నైన ఉదాహరణము లీయవచ్చును. పోనీ, వీరుచేసినసవరణ అయినా బాగున్నదా? 'చెఱకు' అని వ్యవహారము, ప్రయోగములు. 'వెలయంగఁ జెఱకువిలుగొని' అని సవరణ చేసిన ఒకరీతిగా ఉండియుండును."అని

ఖండనము:—

చిగురాకుశబ్ద మపశబ్దమనియు- చెఱాకు శబ్దము సుశబ్దమనియుఁ బొరఁబడి నేను పాఠము దిద్దినానని నారాయణరావుగారి నిశ్చయము. నారాయణరావుగారికి ఈ పద్యము దోషమున కుదాహరణము, దోషమున కుదాహరణముగా దుష్టరూప మేకదాయియ్యవలసినది. అసందర్భమన తప్పే యొప్పు. ఈదోషమునకే యనంతుఁడుచెప్పిన పద్యము చూడుఁడు:

"క. పోలుపుగఁ బోగాడదండలు
లలన ముడిచినన్ మకారలాంఛనుఁ డొందెన్
జలమునఁ జెఱాకువిల్లన
నలనిడుదలఁ గాకుదోషమంద్రు ముకుందా.

9. ఆక్షేపము:—

ఆ భీమకవి గోదావరీమండలము వాఁడా, లేక నైజాముదేశమువాఁడా యనువిషయము నెత్తుకొని "భీమన నైజామురాష్ట్రమువాఁడను ప్రతీతి శ్రీరామయ్యపంతులుగారా ప్రాంతములవారియొద్దనుండి ఉత్తరములను బయలుదేరతీసినతరువాత వచ్చినదిగాని అంతకుపూర్వము లేదు. ఇట్టి 'ఉత్తరములను' పుట్టించియే పంతులుగారు ఓరుగల్లు వాదములో కొంతవరకును కృతకృత్యులైరి. వారి ఓరుగల్లువాదము సరియైనదని కాని, కాదని కాని, యిచ్చట చెప్పుట మాఉద్దేశము కాదు. ఆవిషయమై మఱియొకసారి ముచ్చటింతుము. పూర్వకాలపు నిదర్శనములను చూపక వాదములో కక్షవహింపగలవారి 'ఉత్తరములను' పుట్టించుటమాత్రము సరికాదని మనవిచేయుచున్నాము." అని నారాయణరావుగారు వ్రాసిరి.

ఖండనము:—

ఈ యాక్షేపములో రెండపవాదములు గర్భితములయియున్నవి. ఈయుత్తరములలోని విషయము లసత్యములనియు, వేములవాడవారదులు కల్పించిరనియు నొకటి, ఆ కల్పనకు నేను కారకుఁడనని యొకటి. ఈ యుత్తరముల యుత్పత్తినిగూర్చి పీఠిక 10-వ పుటయందుగల నేనిట్లు వ్రాసినాను. "భీమకవి వెలిగందలప్రాంతమువాఁడైనట్లుగ నచ్చటఁ బ్రమాణములేమైన నున్నవేమో తెలిసికొనిరావలయునని పరిషత్పక్షమున 1915 సం. జూలై నెలలో దూపాటి తిరుమల వేంకటరమణాచార్యులుగారిని బంపఁగా నాయన వేములవాడ గ్రామనివాసులలోఁ గొందఱిచే నొకపత్రము వ్రాయించితెచ్చెను. ఆపత్రములోని భాగములే పైనుదహరింపబడినవి." అని.

వెలిగందల వేములవాడ ప్రాంతమందు భీమకవి యాదేశమువాఁడని ప్రతీతియున్నప్పుడు దాని కక్కడివారు వ్రాసినయుత్తరము లేప్రమాణము కాకపోయినచో నట్టిప్రతీతి యున్నదని నేను చెప్పినమాట ప్రమాణమగునా, నారాయణ రావుగారికి? ఈయుత్తరముల నెందుకుఁ బ్రమాణములుగా గ్రహించినాఁడనో చూడుఁడు—"వీరు వ్రాసినదంతయు విశ్వాసపాత్రమని చెప్పుట కవకాశము లేదు గాని, భీమకవి యాప్రాంతము వాఁడను ప్రతీతి యచట నిప్పటికి నున్నదనుట కిది ప్రబల ప్రమాణము కాకపోదు" అని వ్రాసినాను—దీనికిఁ బండితులేమందురో యందఱకును విదితమే.

10. ఆక్షేపము:—

భీమకవి గోదావరీ మండలమువాఁడా, కరీం నగరము మండలమువాఁడా యనువిషయమును గొంతచర్చించి నారాయణరావుగారు చివరకిట్లు తేల్చినారు:

"ఇప్పటికి తేలిన అంశములివి : గోదావరిజిల్లాలో వేములవాడ ఉన్నది. కరీం నగరము జిల్లాలో వేములవాడ ఉన్నది. ఇచ్చట ద్రాక్షారామ మున్నది; అచ్చటను దాక్షారామమను వాడుక పురాణములలో నున్నది. ఇక్కడ భోగస్త్రీలున్నారు; అచ్చటను ఉన్నారు.

ఇచ్చట జైనులుండే వారు; అచ్చటను ఉండేవారేమో? ఇక్కడ అప్పలవారున్నారు. అక్కడ అప్పాలవారున్నారు. ఇక్కడ భీమేశ్వరాలయమున్నది. అక్కడను భీమేశ్వరాలయ మున్నది. భీమకవి యిక్కడి వాఁడని యిక్కడి ప్రతీతి అనాది. అక్కడివాఁడని ప్రతీతి యిప్పుడైనా బయలుదేరినది. రాజరాజనే వాఁ డక్కడనుండే వాఁడని చరిత్రాధారములేని యొకకథ అక్కడనున్నది. సారంగధరకథ అక్కడిదే అని అక్కడి ప్రతీతి అట – ఇచ్చటిదే అను ప్రతీతి ఎప్పటినుండి వచ్చుచున్నదో తెలియదు. ఈసారంగధరకథ ఏప్రాంతమున కాప్రాంతములోనే తయారగుచున్నది. ఇక నేమిగతి ? భీమకవి యెక్కడివాఁడు ? " అని.

దీనిలో నపసిద్ధాంతములు నప్రమాణ వాక్యములు నెన్ని యున్నవో చూడుఁడు: "ఇచ్చట జైనులుండేవారు; వారు అచ్చటను ఉండేవారేమో?" అఁట. ఈ వాక్యమందు ఇచ్చటకు 'అచ్చట' యనియు, 'అచ్చట'కు 'ఇచ్చట' యనియు మార్చినచోఁ గొంతవఱకు సత్యమునకు సరిపోవును. గోదావరీ మండలమందు జైనులుండెడి వారనుట కనుమానప్రమాణమే ప్రమాణము, కరీంనగరము మండలమం దిప్పటికిని జైనకోమట్లు గలరు. ఈవిషయమును నారాయణరావుగారు తాఱుమాఱు చేసినారు,

ఆక్షేపము:—

భీమకవి యిక్కడివాఁడని యిక్కడి ప్రతీతి; అక్కడివాఁడని ప్రతీతి యిప్పుడైనా బయలుదేరినది,

ఖండనము:—

అక్కడవాఁడను ప్రతీతి యిప్పుడు బయలుదేరిన దెచ్చట ? ఇక్కడ అనఁగా గోదావరీ మండలమందు. కరీంనగరము ప్రాంతమందదియనాదియే, ఏ దేశమందా దేశమువాఁడను ప్రతీతియనాదిగానేయున్నది.

ఆక్షేపము:—

"రాజరాజనే వాఁడక్కడనుండే వాఁడని చరిత్రాధారములేని యొకకథ అక్కడనున్నది.

ఖండనము:—

చరిత్రాధారము నారాయణరావుగారికిఁ దెలియదుగాని లేకపోలేదు. రాజరాజునాఁడుపుట్టిన శాసనముల ప్రతిబింబములు నాయొద్దనున్నవి. కావలసినచోఁ నారాయణరావుగారికిఁ జూపెదను. ఆరాజరాజుచేఁ బ్రతిష్ఠింపఁబడినది యాగ్రామమందలి రాజరాజేశ్వర లింగము.

ఆక్షేపము:—

"సారంగధరకథ ఇచ్చటిదే అనుప్రతీతి ఎప్పటినుండి వచ్చుచున్నదో తెలియదు."

ఖండనము:—

దానికిఁ జరిత్రాధారములు నారాయణరావుగారికిఁ గనుపడినవా? వేఁగీదేశపు రాజగు రాజరాజునకు సారంగధరుఁడను కొడుకుగాని చిత్రాంగియను భార్యగాని యున్నట్లు శాసనములం దెచ్చటను లేదు. ఈకథ చరిత్రమునకు విరుద్ధమే.

11. ఆక్షేపము:—

"భీమకవి ప్రతాపరుద్రునికాలములో నున్నవాఁడని చెప్పుటకుఁగల కారణములు కొన్ని మంచివిలేక పోలేదని వ్రాసి నారాయణరావుగారు దానినిట్లువివరించినారు. "చక్కదనంబు దీవియగు సాహిణిమారుఁడు" అను పద్యమును రామయ్యపంతులుగారుతగినకారణముచూపక, అప్పకవిని ధిక్కరించి విడిచిపెట్టినారు. ఇదిమాకు సమంజసముగా కాన్పించలేదు.

అప్పకవి యొకసందర్భమున ప్రామాణికుఁడును మఱియొక సందర్భమున అప్రామాణికుఁడును నగుచుండవలయునా ? అదియు మనసిద్ధాంతమును బాధించుపట్లనేనా ?,

ఖండనము:—

"చక్కదనంబుదీవి" యను పద్యమును నేను తగిన కారణముచూపకయే అప్పకవిని ధిక్కరించి విడిచిపెట్టినానఁట. నేనాపద్యమును విడిచిపెట్టలేదు. అది భీమకవి చెప్పియుండఁడని సిద్ధాంతముచేసినాను. దీనికినేను జూపిన హేతువులు చూడుఁడు.

ఉ. చక్కదనంబుదీవియగు సాహిణిమారుఁడు మారుఁడై
వడిం, బొక్కిపడంగలండు బలమున్ బలమున్ గలయా
చళుక్యపుం,బొక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూడ్కుల

మంటలురాలఁజూచినన్, మిక్కిలి రాజశేఖరుని మీఁదికి వచ్చిన శిత్తవో వునే.

అని చాటువు భీమకవి చెప్పినట్లూహించి సాహిణిమారఁడు ప్రతాపరుద్రుని కాలములోనుండినట్లు సోమదేవ రాజీయమునఁ జెప్పఁబడియున్నదనియు నందువలన నాతఁడును భీమకవియుఁగూడఁ బదునాల్గవ శతాబ్దాదియందుండినవారని నిశ్చయింప వలసియున్నదనియు (వీరేశలింగముగారు) వ్రాసినారు. ఈపద్యము భీమకవి చెప్పినదనుట కప్పకవి సాక్ష్యముతప్ప వేఱొకసాక్ష్యము లేదు. అప్పకవి భీమనకాలమువాఁడు గాఁడు. సాహిణిమారుని కాలము వాఁడును గాఁడు. వా రిరువురకు నెంతో తరువాతివాఁడు. నన్నయభట్టాంధ్రశబ్దచింతామణి కలియుగమున కాదిని రచియించె నని వ్రాసిన యాతఁ డితఁడే. ఈత డన్నమాత్రాన నాపద్యము భీమన రచియించినదే యని యెట్లువిశ్వసింపవలెనో తెలియదు. ఈయప్పకవియేకదా భీమకవియు నన్నయభట్టును సమకాలికులని వ్రాసెను. దానికిని దీనికిని నెట్లు సమన్వయము చేయవచ్చును. ఇట్టి సాక్ష్యమునుబట్టి తీర్మానములు చేసినయెడల సత్యము తేలదు. ఈ కారణములు నారాయణరావుగారి దృష్టిచేత "తగిన" కారణములుకావఁట.

## 12. ఆక్షేపము:—

"ఇక ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ... వెలుంగాధీశ (తెలుంగాధీశ, కళింగాధీశ) యను పద్యముపై రామయ్య పంతులుగారు చేసిన చర్చను కొంత విచారింతము" అను వాక్యముతో నారాయణరావుగారింకొక యాక్షేప మారంభించినారు. ఈ విషయమై నేను వ్రాసినదానిని నిందు సమగ్రముగానెత్తి వ్రాయుచున్నాను.

ఇఁక భీమకవికాలమును నిర్ణయింప వలయును. పూర్వోదాహృతమగు—

మ. ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ
　దాక్షారామ భీమేశ సం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకట
　నానా కావ్య ధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ
　గళింగాధీశ కస్తూరికా
ఘన సారాది సుగంధ వస్తువులు
　వేగందెచ్చి లాలింపురా.

అను పద్యము మూఁడవ పాదములోఁ గొంచెము పాఠభేదముఁ గల్పించి యదియే ముఖ్యాధారముగా భీమకవి నన్నయభట్టుకంటెఁ బూర్వుఁడని గురుజాడ శ్రీరామమూర్తిగారును, ఈపద్యమును మఱికొన్ని పద్యములను నాధారము చేసికొని భీమన పదునాల్గవ శతాబ్దమువాఁడని కందుకూరి వీరేశలింగము పంతులుగారును వ్రాసినారు. ఈరెండు మతములు గూడ నసమ్మతములే. శ్రీరామమూర్తిగారి పాఠముప్రకారము పైపద్యములో "భీమన నాపేరు వినంగఁజెప్పితి వెలుంగాధీశ" యని యుండవలయును— "వెలుంగాధీశ" యనఁగా "విమలాధీశ" యని యర్థమఁట. విమలాధీశుఁ డనఁగా రాజనరేంద్రుని తండ్రి యఁట— ఈహేతువుచే భీమన నన్నయ భట్టుకంటెఁ బ్రాచీనుఁడఁట. ఈవాదమం దెన్నిదోషము లున్నవో చూడుఁడు. రాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుఁడు గాని విమలాధీశుఁడు గాఁడు. విమలాధీశుఁడన విమలాదిత్యుఁ డెట్లగునో తెలియకున్నది. విమలాధీశుఁడన నర్థమేమి? ఇదియొకదోషము. విమలాధీశునకు వెలుంగాధీశుఁడను పేరెట్లు కలిగినదో తెలియదు. తెలుంగు రాయఁడనినట్లు వెలుంగు రాయఁడని కాని వెలుంగురాజని కాని రూఢనామ మున్నదా ? లేదు. విమలశబ్దము విశేషణము. వెలుఁగుశబ్దము విశేష్యము. ఈరెంటికి నర్థములో భేదమున్నది. భీమనవంటి మహాకవి విమలాదిత్యుని సంబోధించు నవసరమున నతనికి సరియైనపేరు పెట్టియే పిలుచును గాని యిట్లవకతవకగా నేల మార్చును. ఇది రెండవ దోషము—

వెలుంగాధీశ యనునప్పుడు సంధి యెట్లుకుదిరినది? వెలుంగు + అధీశ, యనిగదాపదచ్ఛేదము. సంస్కృతసమాసము చేసినచో "వెలుంగ్వధీశ" యని కావలయును. తెలుఁగు సమాసము చేసినయెడల "వెలుంగధీశ" యగును. వెలుంగ + అధీశ" యని రెండుపదములు సంబోధనాంతములే యన్న పక్షమున "వెలుంగయధీశ" యని యుండవలెను. "వెలుంగాయధీశ" యని యుండిన నుండవచ్చును. ఏవిధముగాఁ

జూచినను "వెలుంగాధీశ" యని కానేరదు. ఇది మూడవ దోషము. త్రిదోషసహితమయిన యీవాదము శ్రీరామమూర్తిగారి మనస్సున కెట్లునచ్చినదో తెలియకున్నది.

ఈపద్యములో "వెలుంగాధీశ" యనుటకు బదులుగాఁ "దెలుంగాధీశ" యనుపాఠమును జెప్పి, తెలుంగురాయఁడు 14-వ శతాబ్దమువాఁడు గావున భీమనయు నాకాలమువాఁడే యని వీరేశలింగముగారు నిర్ణయించిరి. ఈ పాఠమునకు శ్రీరామమూర్తిగారిపాఠమునకుఁబట్టిన మొదటి రెండుదోషములును బట్టవు. కాని మూఁడవ దోషము తప్పక పట్టును.భీమకవి యిట్టిదుష్టప్రయోగము చేయఁడు. చేయునని యూహించుట యసమంజసము"—అని.

## 13. ఆక్షేపము:—

దీనిపై నారాయణరావుగారి యాక్షేపమిదిగో—"వారు'వెలుంగాధీశ తెలుంగాధీశ', అనునవి వ్యాకరణ దుష్టములని త్రోసివేసిరి. వెలుంగు + అధీశ, తెలుంగు + అధీశ-అనివారిపదచ్ఛేదము—వెలుంగ + అధీశ, తెలుంగ + అధీశ" అని మా పదచ్ఛేదము. ఇచట వెలుంగ, తెలుంగ అనునవి సంబోధనాంతములు కావు. అవి దేశనామ స్వరూపములే అని మా మతము. త్రిలింగశబ్దభవము తెలంగ, తెలుంగ అని యగును. బర్మాదేశములో తెలంగ, తెలైంగ అని తెలుఁగువారికి పేరు. గౌడభాషలలో తెలుఁగువారికి 'తెలంగ' అనియే నామము. 'తెలగా' లను వర్ణమువారు ఆంధ్రదేశీయులే. వారు తెలుఁగువారే. 'తెలుంగ' అనునది దేశనామమైనప్పుడు 'తెలుంగాధీశ' అను సమాసమునిర్దుష్టమగును. అట్లే 'వెలుంగ' కూడను. దానికి 'వెలంగ' అను రూపాంతరము. వెలంగవాడ, వెలుంగవాడ అనుపదములే వెలుంగోడ, వెలంగోడ అని యగును. ఆవాడవారే వెలుగోటివారు. ఇచట 'వెలుంగ' అనఁగా వెలగచెట్టు అని యర్థముకాదని మా అభిప్రాయము. 'వెలంగ' అను జనులుండు "పూడి"యే "వెలంగపూడి, వెలగలపూడి" అనియైనది."

## ఖండనము:—

నేను ఖండించినది శ్రీరామమూర్తిగారి వాదమును వీరేశలింగముగారి వాదమును. వారి వాదముల ప్రకారము "వెలుంగు, తెలుంగు," శబ్దములు ఉకారాంతములే కాని అకారాంతములు గావు. అకారాంతవాద మిప్పుడు నారాయణరావుగారికి స్ఫురించినదికాని నేఁటివరకు మఱియెవరికిని బొడగట్టలేదు. ఉకారాంతవాదములను ఖండించిన నావాదమును నారాయణరావుగారి యకారాంత వాదమెట్లుబాధించునో తెలియదు. దానిని స్పృశింపనే స్పృశింపదు.

అకారాంత వాదమువలన సిద్ధించినదేమిటి? వెలుంగాధీశుఁడనఁగా వెలుంగదేశరాజనియు, తెలుంగాధీశుఁడనఁగా తెలుంగదేశ రాజనియునుకదా యర్థము. ఆరాజులెవ్వరు? ఏకాలమువారు? అది తేల్చుట కాధారములున్నవా? లేనిచో, గ్రుడ్డెద్దు చేనఁబడిన ట్లీయార్భాటమెందుకు?

## 14. ఆక్షేపము:—

"తెలుంగాధీశ, అనుపాఠము సరియైనప్పుడు 14-వ శతాబ్దములోని తెలుంగురాయఁడే ఈతెలుంగాధీశుఁడైనప్పుడు, భీమకవికూడా 14-వ శతాబ్దమువాఁడే అగునుగదా! అట్లే 'వెలుంగాధీశ' అనుపాఠమును సరియైనప్పుడు కాలనిర్ణయముచేయుట కష్టమేయగునుగాని, 14-వ శతాబ్దమునాఁటి ఒకవెలుంగాధీశుని కా పదమేల చెందకూడదో చెప్ప వీలులేదు." అని

## ఖండనము:—

ఔను. మేనత్తకు పుంస్త్వము వచ్చినప్పుడు పినతండ్రియగును. అంతవరకును మేనత్తయేకదా।

## 15. ఆక్షేపము:—

"ఎలమచ్చి పురాధీశ్వరుఁడగు చోడగంగను రాజు శాకాబ్దములు 1413 ప్రాంతములో నున్నట్లు శాసనములు తెలుపుచున్నవి. ఇతనికి సర్వలోకాశ్రయవిష్ణువర్ధనమహారాజని బిరుదున్నది. ఎలమచ్చి కళింగములోనిదే. భీమకవిచూచిన కళింగములోనిదే. భీమకవి చూచిన కళింగుఁ గీతఁ డేల కాకూడదు" అని యొక యాక్షేపము.

## ఖండనము:—

తా ముదాహరించిన శాసన మెచ్చటనున్నదో చెప్పినప్పుడు దానిజూచి విమర్శించినపిదప నారాయణ

రావుగారి శంకకు సమాధానము చెప్పఁదగియుండును. కాని, శాసనమెక్కడనున్నదియుఁ జెప్పక, యందులోని విషయమును జెప్పక గేదెను నీళ్లలోనుంచి కొమ్ములు చూపి బేరముపెట్టినట్లు వాదించినఁ బ్రత్యుత్తర మిచ్చుట కష్టము.

16. ఆక్షేపము:—

కళింగరాయఁడు, కాళింగరాయఁడు అను పేళ్లుగలవారు కొంద అరవదేశములో క్రీ.శ. 14-వ శతాబ్దమునందున్నట్లు కొన్ని శాసనములవలనఁ గనుపడుచున్న దని వ్రాసి, చిట్టచివరకు "మనభీమకవి యీకళింగరాయని వద్దకేపోయెనేమో?" యని నారాయణ రావుగారు మఱియొక శంకను బుట్టించుకొన్నారు. భీమకవి నాదరించినవాఁడు కళింగగంగుగాని కేవల కళింగ రాయఁడుకాఁడు. కళింగగంగనఁగా గంగ వంశజుఁడైన కళింగదేశపు రాజు. అరవదేశమందలి కళింగ రాయఁడు గంగవంశమువాఁడుకాఁడు. కళింగదేశపు రాజునుగాఁడు. అరవవాఁడు. సామంతరాజో లేక మంత్రియో. అతని కళింగరాయ నామము నేతిబీరకాయ పేరు వంటిదే.

భీమకవి ప్రభు వీతఁడని నారాయణరావుగారు నిర్దేశించినయెడల నానిర్దేశమును జర్చింపవచ్చును. అట్లు నిర్దేశింపక కళింగశబ్దముతో సంబంధ మేమాత్ర మున్నను సరే వాఁడు కాఁగూడదా! వీఁడు కాఁగూడదా! యని సంశయించువారికి సమాధానముచెప్పు టెట్లు?

17. ఆక్షేపము:—

"కవిజనాశ్రయములో పది యతులును, కావ్యాలంకారచూడామణియందు పండ్రెండు వళ్లును, అనంతుఁ డిరువదినాలుగు విశ్రమములును, ఆమీఁద కొందఱు కవిగ్రామణు లిరువదియేడును విశ్రమములుచెప్పినట్లు అప్పకవిచెప్పి తాను నలభైయొక్క యతులను వివరించినాఁడు. కవిజనాశ్రయములోని యతులసంఖ్య అన్నిటిలోను తక్కువది కాబట్టి భీమకవి అందరికంటె ప్రాచీనుఁడు—అని రామయ్యపంతులుగారి వాదము. ఈవాదమును చాలమంది అంగీకరించినారు" అని వ్రాసి, "కాని చిన్నమనవి—సులక్షణసారకర్త

"కృతుల ముప్పదియొక్కటి యతులుదనరు
సత్కవుల సమ్మతంబున (జలధిశయన)"

అని చెప్పినాఁడు. అందుచేతనాతఁడు అప్పకవికి పూర్వుఁడని చెప్పనగునా?" యని నారాయణరావుగా రొక చిన్నిశంక నంటించినారు.

ఖండనము:—

పాపము! ఈవ్రాఁత వ్రాసినప్పుడీయన అప్పకవీయము తిన్నఁగాఁ జూడలేదు. అప్పకవీయములో సులక్షణసారము పేర్కొనఁబడినది. కాఁబట్టి అప్పకవీయముకంటె సులక్షణసారము ముందుదయినట్లా వెనుకదయినట్లా! ఎవరినడిగినను సమాధానమువచ్చును.

18. ఆక్షేపము:—

దానికి సంబంధించినదే యింకొక శంక.

"రంగరాట్ఛందస్సులో ఇరవైయెనిమిది యతులు చెప్పఁబడినవి. అందుచేత కస్తూరిరంగకవికూడ అప్పకవికి బూర్వుఁడగునా?"

ఖండనము:—

ఈశంకగూడ దోషగర్భితమే!?

రంగరాట్ఛందస్సులో 28 యతులు చెప్పఁబడినవఁట! ఇది నారాయణ రావుగారు పుస్తకము చూచినట్లు తోఁపదు. అచ్చుపడిన పుస్తకములో 35 యతులున్నవి. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమందలి యొక వ్రాఁతప్రతిలో 36 యతులున్నవి. కస్తూరి రంగకవి 28 యతులు చెప్పలేదు. కాని, నారాయణ రావుగా రట్లు వ్రాయుటకుఁ గారణము లేకపోలేదు. కస్తూరి రంగకవి పూర్వకవులు చెప్పిన యతుల వివరించుచు "నన్నయభట్టు "లక్షణసారంబు" నుండి యొకపద్య ముదాహరించి" అని "27 విధములుగా చెప్పివున్నవి." అని వ్రాసి, యీపూర్వమతము లన్నిఁటిని బూర్వపక్షముచేసి తనమతమును ప్రతిపాదించెను. నారాయణరావుగారు ఆ పూర్వపక్షము, సిద్ధాంతమని భ్రమపడి దానికొకటిచేర్చి 28 యతులుచేసినారు. ఇది యెట్లున్నను, రంగకవి చెప్పినయతులు అప్పకవి యతులకంటెఁ గొంచెమే. రంగకవియు అప్పకవి తరువాతివాఁడే. అయినను అప్పకవిని గూర్చికాని అప్ప

కవియమును గూర్చిగాని రంగకవి కేమియుఁ దెలియదు. తెలిసియున్నచో, అప్పకవి మతము నుదాహరించుటయో నామతము నవలంబించుటయో లేక ఖండించుటయో జరిగియుండును. రంగరాట్ఛందస్సునం దప్పకవి మాటయే లేదు. కాఁబట్టి యప్పకవిమతము రంగకవికిఁ దెలియదని నిశ్చయింపవలసి యున్నది. అప్పకవిని విడిచిపెట్టినచోఁ బూర్వకవు లందఱికంటె రంగకవియే యెక్కువయతులు చెప్పినాఁడు. కావున, యతుల సంఖ్య కాలక్రమమున హెచ్చినదను నావాదమును రంగరాట్ఛందస్సు బలపఱచుచున్నది గాని ఖండించుట లేదు.

**19. ఆక్షేపము:—**

"రామయ్య పంతులుగారి ప్రకారము మధ్యాక్కరలో నాలుగవ గణము మొదట యతి ఉండుట ఆధునిక మతము. నన్నయభట్టులో అయిదవ గణము మొదట నున్నది. ఎఱ్ఱాప్రెగడలో నాలుగవ గణము మొదట నున్నది. భీమకవి గ్రంథములో మధ్యాక్కరనాలుగవగణము మొదట యతి ఉండుటచేత, భీమకవి, నన్నయ, ఎఱ్ఱాప్రెగడల మధ్య నుండవలయునఁట. ఎఱ్ఱాప్రెగడ తరువాత నేల ఉండకూడదో తెలియరాకున్నది" అని.

**ఖండనము:—**

కవిజనాశ్రయములో మధ్యాక్కర నాలుగవ గణము మొదట యతి విధింపఁబడుటచేత భీమకవి, నన్నయ ఎఱ్ఱాప్రెగడలకు నడుమ నుండవలయునని నేను చెప్పి యుండలేదు. కవిజనాశ్రయములోఁ జెప్పఁబడిన యతులసంఖ్యయు, మధ్యాక్కరలోని యతిస్థానమును, తద్గ్రంథకాలము నిర్ణయించుటకుఁ గొంతవఱకు కనుకూలపడునని చెప్పి, యీవిషయము కొంతచర్చించి చివరకు "ఈరెండు హేతువులఁబట్టి, భీమన నన్నయభట్టు తరువాతివాఁడును విన్నకోట పెద్దనకుఁ బూర్వుఁడును నైనట్లు తేలుచున్నది" అని యుపసంహరించినాను.

కవిజనాశ్రయకర్త మధ్యాక్కరలో నాలుగవ పాదము మొదట యతి చెప్పుటచేత నన్నయభట్టునకుఁ దరువాతివాఁడనియు, పదియతులు మాత్రమే చెప్పుటచేత విన్నకోట పెద్దనకుఁ బూర్వుఁడనియు దీనిభావము. ఇందు ఎఱ్ఱాప్రెగడ ప్రసంగమే లేదే. నారాయణరావుగారి యాక్షేపమునకు మూలమేది?.

తాను ఖండింపఁబూనినది చక్కఁగా జదువకయు, చదివినదాని కర్థము చేసికొనకయు, అర్థమయినదానినైన సరిగా ననువదింపకయు, పూర్వాపర సంబంధములు పాటింపకయు, తప్పునదియేదియో, తగులునదియేదియో యెఱుంగకయు, నారాయణరావుగారు రీవిమర్శనమును రచియించినారని మనవిచేయుచున్నాను.

---

# నా స్వామి

### పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

ఎవని జగమాశ్రయించెడు నెవఁడు జగతి
నాశ్రయించెడు నొండొంటి నరయుకొఱకు
ఎవఁడు ప్రకృతినిగల్పించు నెవనిఁ బ్రకృతి
కల్పనము సేయు నుభయరాగమ్ముకొఱకు
ఎవఁడు సృష్టించు లోకమ్ము సృష్టి యెవనిఁ
జేయు నన్యోన్య సంకల్పసిద్ధికొఱకు

ఎవఁడు విశ్వంబుగా మారు నెవనియట్లు
విశ్వమగుఁ బరస్పరము సంప్రీతికొఱకు
అట్టి పరమేశుఁ బ్రకృతి నే నాత్మలోనఁ
దలఁతు గొంతెత్తిపాడుదుఁ దనివిదీర
మననముం జేతు నాపాదమస్తకమ్ము
నైక్య మొనరించుకొని చొక్కి యనుభవింతు.




పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

౧

శ్రీమంతమైన మాళవదేశములో ఉజ్జయని అను గొప్పపట్టన మొకటికలదు. ఆపట్టణమున కుత్తరముగా దట్టమయిన-ఒకవనము ఉండెడిది. ఒకప్పుడా అడవిలో నాలుగువైపులనుండియు వచ్చి రెండువేల ఐదు వందలమంది మోసగాండ్రు బసచేసినారు. ఆ ధూర్తులు మహామాయా ధురంధరులు. మిక్కిలి నిర్దయులు. వారిని బోలిన విశ్వాసఘాతుకులు మఱియెచ్చటను ఉండరనియే చెప్పుకొనుచుండెడువారు. ఆ మహానుభావులు చేయఁజాలని దుర్మార్గకార్యములు భూలోకములోనే కాదు; ఏలోకములోను ఉండవందురు. మాటలలో బృహస్పతి వంటివారినిగూడ నిరక్షరకుక్షు లనిపించఁదగినంతటి నేర్పుగలవారు. పలురకముల ధూపములు, అంజనములు, చూర్ణములు మొదలయినవానిలో సిద్ధహస్తులు. స్తంభిని, అవస్వాపిని మొదలయినవిద్యల నెఱిఁగిన పండిత ప్రకాండములు. గొంతు, రంగు, వేషము మార్చి ప్రతివారిని మోసపుచ్చఁజాలినవారు. ఈ-అందఱకును అయిదుగురుముఖ్యాధికారులు గలరు. 1. మూలదేవుఁడు, 2. కండరీకుఁడు, 3. ఏలాషాఢుఁడు, 4. శంసుఁడు, 5. ఖండవణ— అని వారి పేళ్లు.

ఈ అయిదుగురికిని అయిదేసివందలమందిచొప్పున ఒక్కొక్క-గుంపు కలదు. అయిదవగుంపులో అందఱును స్త్రీలే. ఆగుంపున కధికారిణి ఖండవణ అను స్త్రీ. ఈ అయిదుగురు ధూర్తనాయకులును, మోసములో చాల ఆరితేఱినవారు. కాని, వారిలో మూలదేవుఁ డనువాఁడు నిరుపమానుఁడు. వానితో సాటిచేయఁదగిన మోసగాఁడింతవఱకును బుట్టియుండనేలేదఁట!

వీరందఱును దిరుగుచుఁ దిరుగుచు, ఎక్కడనుండియోవచ్చి ఉజ్జయనీపట్టనమునకు సమీపముగాఉన్న వనములో బసచేసియుండఁగా, అమాంతముగా ఏనుఁగుతొండాల వంటి వర్షధారలు ప్రారంభించినవి. చూచుచుండఁగానే నూతులు, బావులు, చెఱువులు, నదులు మొదలయిన జలాశయములన్నియు నిండిపోయినవి. నదీప్రవాహము పొంగి పొరలుచు చుట్టుపట్లనున్న గ్రామాదులను ముంచివేయుచున్నది. ఎక్కడచూచినను నీరేతప్ప, మఱేమియు నగపడుటయేలేదు. వేయేల? ఏకార్ణవమయిపోయినట్టు కనుపట్టినది. సుగమమార్గము లన్నియు దుర్గమము లయిపోయినవి. మనుష్యు లిండ్లనుండి బయటికివచ్చుట కష్టతరమయిపోయినది. ఈయింటిమీఁదికాకి, ఆయింటిమీఁదను వ్రాలకుండ నున్నదన్నట్లున్నది సమయము. ఇట్టి ఘోరవర్షము కారణముగా ఆధూర్తులందఱును విచారగ్రస్తచిత్తులయి "మనుజులుకూడ బయటికి రాఁజాలనంతటి యిట్టి ఘోరవర్షసమయమున, మన మెవ్వరిని మోసపుచ్చి ఉదరపూజ చేసికొనఁ గలుగుదుము? ఇట్టికష్టసమయమున మన కెవ్వ రిచ్చటికిఁ దెచ్చి భోజనముపెట్టి పుణ్యము కట్టుకొందురు? ఆఁకలిబాధ సహింపఁజాలక ప్రాణములు కంఠగతము లగుచున్నవే!" అని దుఃఖింప మొదలిడినారు. అప్పుడు ధూర్తశిరోమణి యగు మూలదేవుఁ డనువాఁ డిట్లన్నాఁడు.—

మూల:—సోదర- సోదరీమణులారా! ఇపుడు మనభోజనము విషయమున నే నొక-ఉపాయ మాలోచించియున్నాను, వినుండు. ఇప్పుడు మనమైదుగురమును చూచినదిగాని, విన్నదిగాని, అనుభవించినదిగాని, ఒక్కొక్కకథ చెప్పుదము. ఆకథ విని మనలో ఎవఁడు "ఈ సంగతి యెట్లంగీకరింపఁదగియుండును?" అని సందేహించునో, వాఁ డద్దానిని అసత్యమని ఋజువు చేయవలయును. అతఁడే మనకందఱకును భోజనమునకగు కర్చియ్యవలసియుండును. ఆకథలను మనలో ఎవరయినను భారతము, రామాయణము, భాగవతములను పురాణగ్రంథము

లనుండి ప్రమాణముచూపి సత్యముఅని సిద్ధాంతముచేయునో, ఆశ్చర్యమును కలిగ్గింపుమాటలచేతను మనకు మనోరంజన చేయునో, ఆతఁడందఱిలోను ఎక్కువబుద్ధిగలవాఁడుగా ఆలోచింపఁబడును. మఱియు, ఆతఁడు భోజనమున కగు కర్చియ్యనక్కఱలేదు.

కండరీకుఁడు:—అయ్యా! తమరు చాల మంచి ఉపాయ మాలోచించినారు. ఇక్కడ చేరిన అందఱిలోను తమరే పెద్దలు కనుకను తమరు చూచినదిగాని, విన్నదిగాని, అనుభవించినదిగాని యేదయినను ఒకకథ సెలవియ్యవలెను.

మూల:—అటులేని చెప్పుచున్నాను, సావధానముగా వినుండు. నేను మంచివయస్సులో ఉన్నప్పుడు నిరంతరము మనసున కిష్టమయిన వస్తువులు సంపాదించు ప్రయత్నములో ఉండెడివాఁడను. ఇట్లుండఁగా—ఒక నాఁడు ఘోరముగ వాన కురియుచున్నది. నేను నాయజమానుని సంతోషపెట్టఁదలఁచుకొని నెత్తిమీఁదను ఒక మూట పెట్టుకొన్నాను. అది, నేను వానలో తడియకుండ ఉండుటకై ఒకచేత గొడుగు పట్టుకొన్నాను. రెండవచేత జారీచెంబు మొదలయిన కావలసినవస్తువులు పట్టుకొని యింటినుండి బయటికి బయలుదేరినాను. కొంచెముదూరము నడచి దారిలో చూచునప్పటికి—అయ్యా! ఎక్కడనుండియో కాని నడకొండవంటి మదించినయేనుఁగొకటి నావైపు పరుగెత్తుకొని వచ్చుచున్నది. సరి; ఇఁక నేమున్నది? దానిని జూడఁగనే నామీఁది ప్రాణాలు మీఁదనే యెగిరిపోయినవి. అపుడు నాకు కలిగినభయ మింతింత యని చెప్పఁజాలను. ఒడలంతయు గడగడవడఁక మొదలిడినది. "దైవమా! ఇపుడేమి చేయుదును? నాయీశరీరము నెచ్చట దాఁచుకోఁగలను? ఎవరిని శరణు పొందుదును?" అని యేమేమో ఆలోచించుకొనుచు ఉంటిని. అంతలో ఏనుఁగు బొత్తిగా దగ్గఱకు వచ్చినది. అపుడు మృత్యుభయమువలన నా కేమియుఁ దోఁచినది గాదు. నాచేతనున్న జారీచెంబు క్రిందను ఉంచి దానిలోఁ దూఱినాను. "ఇంక భయములేదు; బ్రతికితినిరా దైవమా! అనుకొన్నాను." కాని, ఏనుఁగుమాత్రము బుద్ధిలో నాకంటె తక్కువది అనుకొన్నారేమో? కాదుకాదు. నేనట్లు జారీచెంబులోఁ దూఱుట చూచి అదియు వెంటనే నన్ను వెంబడించి జారీచెంబులోఁ దూఱినది, "ఇది యేమిరా దైవమా! ఇందులో దాఁగుకొన్నను నాప్రాణములు దక్కునట్లు కనుపడకుండ నున్నవే! సరియా నేటితో నాబ్రదుకు?" అనుకొనుచు, ఎట్లయినను ఏనుఁగునోటను పడకుండ తప్పించుకొందమని, ఆజారీచెంబులోనే యీమూలనుండి ఆమూలకు, ఆమూలనుండి యీమూలకును పరుగెత్తుట ప్రారంభించినాను. ఈప్రచారములో, ఎట్లయిన నేమి? ఆఱుమాసములవఱకును ఏనుఁగుతొండమున కందకుండ తప్పించుకొనుచు ఉంటిని. తుదకొకనాఁడు ప్రాణము విసిగి నే నాజారీకొమ్మునుండి బయలుదేఱి బయటికివచ్చి పాఱిపోవ మొదలిడినాను. ఆయేనుఁగుకూడ ఊరకుండ లేదు. నావెంటనే జారీకొమ్మునుండి బయటికి వచ్చినది. ఆసమయమున జారీకొమ్మునుండి దానిశరీరమంతయు బయటికి వచ్చినది గాని, తోఁక తాలూకుది ఒక్కవెండ్రుక మాత్రము దానిలోఁ జిక్కుకొన్నది. సరి; ఇం కేమున్నది? ఏనుఁగురావుగారు కైదయిపోయినారు! అది ఆవెండ్రుక నందునుండి తప్పించుకొని బయటికి వచ్చుట కష్టమయిపోయినది. ఈలోఁగా నేను జాలదూరము పాఱిపోయినాను. ఎట్లయిన నేమి లెండు, అప్పటికి నాభయము తొలఁగిపోయినది. అటువంటి ఆపదనుండి తప్పించుకొని కొంతదూరము వెళ్లునప్పటికి ఎదుటను గంగానది అడ్డముగా ఉన్నది. అందలి నీరు చాల లోఁతుగా ఉన్నట్లు కనుపట్టినది. ఇంటికిఁ జేరుకొనుటకు మార్గాంతరము లేనేలేదు. అప్పుడు నామనస్సు చాల వ్యాకులపడినది. ఎంతసేపు ఒడ్డున నిలువఁబడి ఆలోచించినప్పటికిని నా కేమియు ఉపాయము తోఁచినదేకాదు. తుదకు సాహసించి గంగానదిలో దిగఁబడినాను. చేతులతో నది దాఁటి, యెట్టులయిన నేమి? యజమానుని యింటికిఁ జేరుకొన్నాను. అక్కడ నే నాఱునెలల వఱకును ఆఁకలి దప్పులబాధ సహించి, ఏనుఁగుతొండములలావున నెత్తిమీఁదను పడుచున్న వర్షధారా పరంపరను సహించి నాయజమానునికి వందనములు చేసినాను. అటు తరువాతను, ఆయనయొద్దను క్షమాప్రార్థన చేసి వారి సెలవు పొంది బయలుదేఱి యీ ఉజ్జయనీ నగరము సమీపమున మీ అందఱితోను కలిసికొన్నాను. నేను జెప్పిన యీకథ

నిజమే అయినచో ఏదయినను ఉదాహరణముగాఁ జూపి అందఱను నమ్మించుము. అసత్యమే అయినచో, అనఁగా, నేను చెప్పినకథ అంగీకరించుటకు నీకిష్టము లేనిపక్షమున ఈ ధూర్తస్వాము లందఱకును భోజన సదుపాయము చేయింపుము."

కండరీకుఁడు—అయ్యా! తమ రిప్పుడు చెప్పిన కథలో నా కెంతమాత్రమును సందేహములేదు. భారత-రామాయణాది గ్రంథములు చదివినవా రెవ్వరును, తమరు చెప్పిన వచనములను అసత్యము లని అన నేచాల రని నే ననుకొను చున్నాను.

మూలదేవుఁడు—మంచిది; అటులేని జారీ చెంబులో ఏనుఁగు ఏలాగున ఇమిడినదో, మఱియు,అందులో అది ఆఱునెలలదాఁక నెట్లు తిరుగుచు ఉన్నదో, ఆజారీ కొమ్మునుండి నేను, ఆయేనుఁగు ఏలాగున బయటికి రాఁ గలిగితిమో, ఏనుఁగు మేనంతయు బయటికి వచ్చి దాని తోఁకవెంట్రుక ఒక్కటిమాత్రమే యెట్లు చిక్కుపడి పోయినదో, నేను గంగానదీ ప్రవాహమును జేతులతో ఎట్లు దాఁటఁ గలిగితినో, ఆఱునెలలవఱకును నే నాఁకలి దప్పులబాధను, ఆవర్షము తాలూకు బాధను ఎట్లు సహింపఁగలిగితినో పైనుదాహరించిన గ్రంథములనుండి తగినప్రమాణము చూపింపుము.

కండ—మనము వినుచున్న భారతరామాయణాది గ్రంథములు నిజమయినపక్షమునఁ దమ రిప్పుడు చెప్పిన కథయు సత్యమే కావచ్చును. ఏమందురా ? తమ విషయమున జరిగిన కథవంటికథలు పై గ్రంథములలో ఎన్నో ఉన్నవి. వినుండి—పైగ్రంథము లొకదానిలో ఇట్లున్నది:—బ్రహ్మదేవుని ముఖమునుండి బ్రాహ్మణులు బయటికి వచ్చినారు. భుజములనుండి రాజులు బయటికి వచ్చినారు. తొడలనుండి వైశ్యులు బయటికివచ్చినారు. పాదములనుండి శూద్రులు బయటికి వచ్చినారు. జగదుత్పత్తికి ముందు లెక్కకు మిక్కిలిగా నాలుగువర్ణముల మనుష్యులును బ్రహ్మదేవుని శరీరములో ఇముడఁగా, తమజారీచెంబులో తమరు ఏనుఁగు మాత్రమే యిముడుటలో ఆశ్చర్య మేమున్నది ? ఇంకొకటి చిత్తగింపుఁడు.

ఒకప్పుడు బ్రహ్మదేవుఁడు "నేను గొప్పవాఁడ" ననియు, విష్ణుమూర్తి "నేను గొప్పవాఁడ" ననియుజగడమాడుటకు ప్రారంభించినారు. తుదకు వారిద్దఱకునుతగవు తీఱక తిన్నఁగా శివునియొద్దకువెళ్లి చెప్పుకొన్నారు. శివుఁ డప్పు డాయిద్దఱివాదములను విని "మీయిద్దఱిలో ఎవరు నాలింగముతాలూ కంతమును చూచి వచ్చెదరో అతఁడే గొప్పవాఁడు" అన్నాఁడు. ఆమాట వినఁగానే బ్రహ్మ మీఁదుభాగమునకు బయలుదేఱి దేవమానమున వేయుసంవత్సరములు నడచినాఁడు. కాని శివలింగముతాలూకు కొన కనుపడినదిగాదు. విష్ణుమూర్తి క్రిందుభాగమున పాతాళలోకమువైపు బయలుదేఱి వేయుసంవత్సరముల వఱకును నడిచినాఁడు కాని, అతనికిని కృతకృత్యత కలుగకుండనే మరలవలసివచ్చినది. ఇఁకఁజెప్పవయ్యా! అటువంటిలింగముగనున్న శివుఁడు పార్వతియర్ధశరీరములో నిమిడినపుడు తమ జారీచెంబులో ఏనుఁగిముడుటలో ఆశ్చర్య మేమున్నది? పంచమవేదమయిన భారతములో శ్రీవ్యాసభట్టారకుఁడు "వెదురుకణుపులలోనుండి కీచకుఁడు మొదలగు నూఱుగు రన్నదమ్ములు పుట్టినారు;"అనివ్రాసియున్నాఁడు. ఆకథ యిట్లున్నది:— విరాటరాజుగారి పట్టపుదేవికి బిడ్డలు పుట్టలేదు. అందులకై అతఁ డొకఋషిఆశ్రమములోనికి వెళ్లి ఆయనను ఆరాధించినాఁడు. ఆఋషి ప్రసన్నుఁడై ఒకలాడువు మంత్రించి రాణికిమ్మని యిచ్చుచు—"ఇది యేదేని అడవిలో పొదలో కూర్చుండి భక్షింపవలెను. అట్లుచేసిన పక్షమున మీకునూఱుగురుబిడ్డలు పుట్టుదురు" అని చెప్పినాఁడు. రాజుపెండ్లాము ఋషిచెప్పిన చొప్పుననే అడవికిపోయి, ఒకవెదురుపొదలో కూర్చుండిఆయన యిచ్చిన లాడువు తిని యింటికిచేరుకొన్నది. ఆసమయమున, అవెదురుపొదలోనే గాంగిలుఁడనుఋషికూర్చుండి చాలకాలమునుండి తపస్సుచేయుచున్నాఁడు. అక్కడకు సమీపముననే ఒకనది ప్రవహించుచున్నది. ఒకానొక-అచ్చరవచ్చి దిగంబరయై నదిలో స్నానముచేసి ఒడ్డున నిలువఁబడినది. ఋషిదృష్టి అలౌకికరూపవంతురాలయిన దానిమీఁదనుప్రసరించినది. అందువలన ఆయనచిత్తములో గామవికారముగలిగినది. హృదయము చలించినకారణమున క్రిందఁబడియున్న సచ్ఛిద్రమయిన వెదురుబొంగున నూఱు పిండము లేర్పడినవి.అటుతరువాత నాఋషితనమనస్సును, సంబాళించుకొని తనదారిని తాను పోయినాఁడు. నూఱు పిండములుగల వెదురక్కడనే పడియున్నది. తరువాత నెట్లో యీసంగతి విరాటరాజునకుఁ దెలిసినది. వెంటనే

రా జావెదురును దనమందిరమునకుఁ దెప్పించినాఁడు. అందుండి సర్వాంగోపాంగ సహితులయి నూఱుగురు బిడ్డలు పుట్టినారు. వారిలో పెద్దవానిపేరు కీచకుఁడు. (కీచక మనఁగా బొంగువెదురు. అందుండి పుట్టినందున వానికాపేరు పెట్టినారు.) తక్కినతొంబదితొమ్మండ్రపేరులు ఉపకీచకులు. పెద్దవాఁడు తొమ్మిదివేల గజముల మానిసి యఁట; విరాటరాజుగారిభార్య యీనూఱుగురు బిడ్డలను తనవారినిగాఁ బెంచి పోషించుచు వచ్చినది. ఒకవెదురులో ప్రసవసమయమువఱకు నూఱుగురుబిడ్డ లున్నప్పుడు ఒక జారీచెంబులో ఒక్క తమరు, ఏనుఁగుమాత్రమే యిమిడి యుండుటలో ఆశ్చర్యమేమున్నది? ఇదిగాక, శివభగవానుఁడు తన జటాజూటములో వేయిసంవత్సరముల వఱకు గంగానదిని ఉంచుకొన్నట్టు పురాణములలో ప్రసిద్ధమయి ఉండనేఉన్నది కూడను. ఇట్లుండగా తమరు, ఏనుఁగు జారీచెంబులో ఆఱుమాసములవఱకును తిరుగుచు ఉండుటలో ఆశ్చర్య మేమున్నది? మఱియు; శివుఁడు గంగానదిని వేయిసంవత్సరములకాలము తనజటాజూటములోనే త్రిప్పుచు ఉండఁగలిగినప్పుడు తమ రాఱునెలలుమాత్రమే యేనుఁగును జారీచెంబులో వెంటను త్రిప్పుకొనుటలో ఆశ్చర్యమేమున్నది? అసంభవమని యెవ రనఁగలరు?

మూల:—మంచిది; నీవు చెప్పిన దంతయు నంగీకరింపవచ్చును గాని జారీకొమ్ములో ఏనుఁగుతోఁక వెంట్రుక యెట్లు చిక్కుకొన్నదో చెప్పుము చూతము.

కండ:—తమకు కలిగినయీసంశయము నివారించుటకై నే నొకపురాణకథ ఉదాహరించెదను—చిత్తగింపుఁడు; మహాప్రళయము తటస్థించినపుడు—అనఁగా, భూమి, తేజస్సు, వాయువు, ఆకాశము, స్థావరములు, జంగమములు మొదలయిన ప్రపంచ మంతయు అభావమును పొంది జలమయ మయినప్పుడు విష్ణుభగవానుఁడు నీటిపైని కూర్చుండి తపస్సు చేయుచున్నాఁడు. ఆసమయమున ఆయననాభికమలమునుండి బ్రహ్మ, కమలము, దండము చేతఁబట్టుకొని బయటికి వచ్చినాఁడు. ప్రయత్నపూర్వకముగా బ్రహ్మ యెట్లో బయటికి రాఁగలిగినాఁడు కాని; ఆతనిచేతనున్న కమలము విష్ణుభగవానుని నాభిలో జిక్కువడిపోయినది. పూజనీయములయిన మన పురాణములలోనే యిట్లున్నపుడు తమజారీచెంబునుండి యేనుఁగు బయటికి వచ్చి, దానితోఁకవెంట్రుక కొమ్ములో చిక్కువడియుండుట అసంభవ మెట్లగును?

మూల:—సరే కాని జారీకొమ్మునుండి నే నెట్లు బయటికి రాఁజాలితిని?

కండ:—ఏమీ? చాల బాగుగనే రావచ్చునే. నే నావిషయమున మహాభారతమునుండి ప్రమాణము చూపించెదను, చిత్తగింపుఁడు: ఒకప్పుడు బ్రహ్మతపస్సు చేయుచున్నాఁడు. వేయిసంవత్సరములు కడచిపోయినవి, దేవతలకుఁ జాల విచారము కలిగినది. "ఎట్లయినను ఇతని తపమునకు విఘ్నము కలిగింపవలయును; లేనిపక్షమున ముందుముందు చాల చిక్కులు తటస్థించును" అని అన్యోన్యము ఆలోచించుచుండఁగా ఇంద్రుఁడు "ఇతనితపోభంగమునకు స్త్రీయే పరమోపయోగమయిన శస్త్రము; గౌతముఁడు, వసిష్ఠుడు, పరాశరుఁడు, జమదగ్ని, కశ్యపుఁడు, అగస్త్యుఁడు మొదలయిన మహర్షులు, హరిహరాదులు, వీరు- వారు అననేల? అందఱును స్త్రీలకు దాసులే- దాసులే అన్నంతమాత్రము చాలదు- దాసానుదాసు లని చెప్పినను చెప్పనేవచ్చును; తప్పులేదు. ఇది అందఱును ఒప్పుకొన్నసంగతియే. స్త్రీ లెట్టివారికైనను తమయిచ్చకు వచ్చినమచ్చున పిచ్చియెత్తించి ఆడింపఁజాలుదురు. మహాదేవునివంటివాఁడుసయితము స్త్రీని చూడఁగానే కాలు జాఱిపడిపోక తప్పదు. ఈసంగతి మీరును ఎఱిఁగినదే. ఒకప్పుడు శివుఁడు యజ్ఞము చేయుచుండఁగా వాయువశమున కట్టుకొన్న బట్ట తొలఁగిన సందర్భములో పార్వతి కనుపడినది. వెంటనే ఆయనచిత్తము కామవికారాయత్తమయిన క్కారణమున కలశములో నుండి ద్రోణాచార్యుఁడు పుట్టినాఁడు. కాఁబట్టి బ్రహ్మతపస్సు భంగపఱుచుటకును ఎవతెనయినను యువతినే యేర్పాటు చేయుట మంచిది." అని అన్నాఁడు. ఇట్లని స్వర్గలోకములోని వేశ్యలలోఁ దిలోత్తమ అనుదానిని బిలిపించి "ఓసీ! నీవు పోయి బ్రహ్మచేయుచున్నతపస్సు భంగపరచి రమ్ము." అని ఆజ్ఞాపించినాఁడు. తిలోత్తమయు ఇంద్రాదిదేవతల ఆజ్ఞను శిరసావహించి పోకుగా ముస్తాబయి బ్రహ్మయెదుటికిఁ బోయి నృత్య మారంభించినది. ఆసమయమున దానిసర్వాంగములను, నానాప్రకా

రములయిన హావభావవిలాసములను జూడఁగానే బ్రహ్మదేవుని మనస్సు కామవికారగ్రస్త మయిపోయినది. అపుడాయన నిశ్చేష్టితుఁ డైపోయి తిలోత్తమవైపే రెప్పవాల్చకుండఁ జూడమొదలిడినాఁడు. అపుడు తిలోత్తమ తనప్రయోగించిన శృంగారాస్త్రము లమోఘముగాఁ బనిచేయుట చూచి యాతనియెదుటనుండి దక్షిణదిక్కునకుఁ బోయి నృత్యము చేయమొదలిడినది. అపుడు బ్రహ్మ తన మొగ మటువైపు త్రిప్పుట ఉచితమయినపని కాదని ఆలోచించి అటువైపునఁగూడ నొక క్రొత్తమొగము తయారుచేసికొని దాని రూపామృత పానముచేయుటకుఁ బ్రారంభించినాఁడు. అంతలో అది వెనుకకుఁ దిరిగినది. ఆయన అటువైపుకూడ ఒకమొగము తయారు చేసికొన్నాఁడు. ఇంతలో ఆహాంతకారి ఉత్తరమువైపు తిరిగినది. అటువైపుననుఁగూడ మొగము తయారు చేసికొన్నాఁడు. ఓహో! మన మెటువైపు తిరిగిన అటువైపే మొగము తయారు చేసికొనుచున్నాఁడే! అని అది మీఁదుగాఁ బోయి, ఆకసముపైని నాట్యము ప్రారంభించినది. బ్రహ్మయ్యగారదివఱకెప్పుడో దానికి దాసుఁ డయిపోయినాఁడు. దానిని జూడకుండ నతఁ డెట్లూరకుండఁ గలఁడు? అప్పుడు తప్పని సరిగా ఆలోచించి మీఁదువైపునకుఁగూడ అయిదవమొగము తయారుచేసికొనవలసిన అవస్థకుఁ బాలుపడినాఁడు. బ్రహ్మ యీప్రకారముగాఁ గామవశంవదుఁ డైపోయియుండుట చూచి యీశ్వరుఁడు తనగోళ్లచేతను మీఁదువైపున నున్న అయిదవ మొగము గిల్లివేసినాఁడు. అందుపైని బ్రహ్మకుఁ గోపము కలిగినది. ఆయన కన్ను లెఱ్ఱచేసి శిరసునుండి స్రవించుచున్న చెమ్మట తర్జనిచేఁ దుడిచి భూమిపైని విదలించినాఁడు. ఇఁక నేమున్నది? అందుండి, శ్వేతకుండలి అను పురుషుఁ డొకఁడు బలవంతుఁడు పుట్టి బ్రహ్మదేవుని యొద్దను సెలవంది యీశ్వరుని వెంటను బరుగెత్తినాఁడు. శివుఁడు పాఱిపోయినాఁడు. అట్లు పరుగెత్తి పరుగెత్తి తిన్నఁగా బదరికాశ్రమములోఁ బ్రవేశించి యందు విష్ణునిఁ జూచి "బావా! రక్షింపవా?" అని అతనిని శరణు చొచ్చినాఁడు. అంతట విష్ణుదేవుఁడు తన కపాలమునుండి ఒకరక్తనాడిని తెఱచినాఁడు. దానినుండి రక్తము ప్రవహింప మొదలిడినది. శివుఁడు గోళ్లచే గిల్లి తెచ్చిన బ్రహ్మతాలూ కయిదవముఖము క్రింద నున్నదిగదా! అది ఆరక్తముతో నిండినది. దేవమానముచేతను, వేయి సంవత్సరములకాలము విష్ణుని కపాలమునుండి వచ్చిన నాడినుండి రక్తము ప్రవహించుచునే యుండెను. కాని క్రిందితల పూర్తికాలేదు. అది చూచి శివుఁడు తనవ్రేలిచే దానిని తుడిచినాఁడు. ఆసమయమున బ్రహ్మతల, విష్ణుని రక్తధార, శివుని అంగుళి, ఈ మూఁడింటి సంయోగమువలనను రక్తకుండలి అను పురుషుఁడు పుట్టినాఁడు. వాఁడును శివుని ఆజ్ఞను బొంది శ్వేతకుండలితో యుద్ధమారంభించినాఁడు. దేవమానమున వేయేండ్లు యుద్ధము జరిగినది. అపుడు దేవతలు వచ్చి యుద్ధ మాఁపినారు. ఆయిద్దఱిలోను ఒకనిని దేవేంద్రునకును, రెండవవానిని సూర్యునకును అప్పగించినారు. అప్పగించునపుడు "ఎప్పుడు భారతయుద్ధ మగునో అప్పుడు మీ రీయిద్దఱును యుద్ధము వృద్ధియగుటకై భూలోకమునకుఁ బంపవలయును" అని చెప్పినారు. అనంతరము భారతయుద్ధమునకు ముందు, సూర్యుఁడు కుంతిచే నాహూతుఁడై దాని రూపలావణ్యాదులు చూచి మోహితుఁడై వదలిపోలేక దానిని బెదరించి యెట్లో దాని నంగీకరింపఁజేసి తానువచ్చినపని నెఱవేర్చుకొనివెళ్లిపోయినాఁడు. అదివఱలో సూర్యునిలోఁ బ్రవేశించియున్న రక్తకుండలి అనుయోధుఁడు కుంతిగర్భములోఁ బ్రవేశించినాఁడు. కుంతి తొమ్మిదినెలలు పూర్తి అయినతరువాతను వానిని దనకర్ణము (చెవి) మార్గమున కన్నది. అందుచేతనే ఆబాలుఁడు కర్ణుఁ డయినాఁడు. అంతచిన్నకర్ణద్వారమున కర్ణునియంతటిశూరుఁడు, వీరుఁడు అయినబాలుఁడు రాఁగా, జారీకొమ్మునుండి తమరు బయటికివచ్చుట కభ్యంతర మేముండును?

మూల:—సరే; అన్నింటికిని సమాధానము చెప్పినావు; అంతమహాప్రవాహముతోఁ గూడియున్న గంగానదిని నేను చేతులతో దాఁటి యెట్లు ఒడ్డు చేరఁగలిగితిని?

కండ:—అయ్యా! ఇదికూడ అడుగుచున్నారే? తమరు రామాయణ మెప్పుడును చదివికాని; వినికాని ఉండలేదా? రామాయణములో రామచంద్రుని ఆజ్ఞపైని సీతజాడ తెలిసికొనుటకై ఆంజనేయుఁడు లంకలోనికి వెళ్లినాఁడు. ఆవెళ్లినప్పుడు నూఱామడదూరముగల సముద్రమును తనచేతులతోడనే దాఁటి వెళ్లినాఁడు. సీత ఆతనివలన శ్రీరామునియావద్వృత్తాంతమును విన్నతరు

వాత "నీ వీసముద్రమును ఎట్లు దాటి రాఁగలిగి నావు?" అని ప్రశ్నించినది.

శ్లో. తవ ప్రసాదా త్పవనప్రసాదా
ద్భర్తుశ్చ తే దేవి! మహాప్రసాదాత్,
త్రిభిః ప్రసాదై రనుగమ్య తోయం
తీర్ణో మయా గోష్పదవ త్సముద్రః."

అమ్మా! నీయనుగ్రహామువలనను, మాతండ్రియయిన వాయుదేవుని అనుగ్రహామువలనను, దేవీ! నీభర్తయగు రాముని మహాప్రసాదమువలనను, మొత్తముమీఁద మీ ముగ్గురిదయవలనను నే నీసముద్రమును గోష్పదము (గోవుఅడుగు) దాఁటినట్లు దాఁటివచ్చినా నని సమాధానము చెప్పినాఁడు హనుమంతుఁడు. అంతసముద్రమునే అతఁడు గోష్పదము దాఁటినట్లు దాఁటినమాట నిజ మయినప్పుడు తమ రామాత్రపుగంగానదిని దాఁటుటమాత్రము నిజమెందులకుఁ గాఁగూడదు?

మూల:— నే నాలునెలలనుఱకును జలధారలను దలమీఁద నెట్లు ధరింపఁగలిగినాను?

కండ:— ఒకప్పుడు దేవతలందఱును కలిసి గంగాదేవి నీ భూలోకమునకు దయచేయు మని ప్రార్థించినారు. "భూలోకమువారి క్షేమమునకై నేను క్రిందికి వచ్చుటకు సిద్ధముగా ఉన్నాను; కాని నే నాకాశమునుండి క్రిందను బడునప్పుడు నన్ను ధరించు వా రెవరో చెప్పండి." అని గంగ అన్నది. "ఆపనికి నేను సిద్ధముగా ఉన్నాను" అని శివుఁ డన్నాఁడు. ఆప్రకారముగానే దానిని దన జడలలో ధరించినాఁడు. ఎన్నాళ్లు? దివ్యవర్ష సహస్రపరిమితకాలము. అంతపెద్దదయిన ఆకాశగంగానదిని శివుఁడు తనతలపైని ధరించినమాట యెఱింగినవారికి తమ నాలుమాసములు జలధారలను ధరించినా రన్నమాట ఆశ్చర్యకరమయి యుండదు. కాఁబట్టి తమరు చెప్పినసంగతులన్నియు సత్యములు; యథార్థములు, అసత్యములు కావు. అణుమాత్రమయినను ఇందులో అబద్ధము అన్నమాట ఉన్న దని యెవ్వరును అన సాహసింపరు. ఏమంటారు?

మొదటికథ సరి.



# గోవు మాలచ్చిమి

నండూరి వెంకటసుబ్బారావు గారు, బి. ఏ.

మనిసికైనా లేని మంచిపోకిళ్లు
గోవుమాలచ్చిమికి కోటిదణ్ణాలు

యెంకితో కూకుండి
యింత సెపుతుంటే
తనతోటిమనవల్లె
తలదిప్పుతాదీ. గోవు.

యెంకి సరసాలాడ
జంకుతావుంటే
సూసిసూడకకన్ను
మూసితెరిసేదీ. గోవు.

కూరి కూకుని నేనె
పోరుపెడుతుంటె
తల్లిదుపు పిల్లల్లె
తెల్లపోతాదీ. గోవు.

మనిసికైనాలేని మంచిపోకిళ్లు
గోవు మాలచ్చిమికి కోటిదణ్ణాలు.

# చిత్రలీలాస్తవము

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారు

సుఖముల్ దుఃఖము రెంటిఁ గూర్చి విషయస్తోమంబు నిర్మించి, మా
నకసౌఖ్యైకసమీహ జీవుల కెడందన్ నెక్కొనన్ జేసి, సా
రెకు వారల్ విఫలాశులై మొఱలిడన్ గ్రీడన్ వినోదించె దీ
నకటా! యెంతటి క్రూరకర్ముఁడవు! దేవా! చిత్రచర్యానిధీ!

మ. అలరుం బోఁడుల పొందు నింద్యమని వేదాంతంబులన్ జెప్పి, య
గ్గలపుం గామము జీవచిత్తములలోఁ గల్పించి, వారల్ నెలం
తలకున్ దాసులుగాఁ జరింప నిరయద్వారంబు చూపించె దా
నల, నీయార్జవ మేమి చెప్పవలె! దేవా! చిత్రచర్యానిధీ!

మ. కలవో? లేవో? యెఱుంగరానితమముల్ గల్పించి, లేఁడన్న వా
రల శిక్షించెద వింతకన్నఁ గలదే క్రౌర్యక్రమం బిట్టి నీ
కలుషోద్యోగము జీవకర్మఫలముంగాఁ జెప్పి నిన్నెన్న వి
హ్వాలతత్త్వజ్ఞుల నేమనంగవలె! దేవా! చిత్రచర్యానిధీ!




# ప్రభాతము

బ్రహ్మ విద్యావిభవంబునం బొదలు వి
జ్ఞాని లావణ్యతేజంబువోలెం
గనుసన్నమాత్ర జగముఁ బరిపాలించు
సరసమహా వాగ్విలాసంబువోలె
గిలిగింతచనవులఁ గలికిమొగ్గ నలర్చు
పవన కిశోరంపుఁ బాటవోలె
జగతినంతయుఁ జిత్రశాలఁ జేసెడు బాల
కృష్ణు మోహనవేణు గీతివోలె
దివ్యపురుషుని చిత్తంపుం దేటవోలె
భవ్యకరుణారసంపు వైభవమువోలె
సరస సత్కార్యఫల వికాసంబువోలె
వఱలు నతిలోకమధుర ప్రభాతకాంతి.

—సుధానిధి.




వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

౧

[illegible]యిపేర సరస్వతీపత్రికలో నిదివఱ( గొన్నియపూర్వవిషయములను బ్రకటించితిని. మఱికొన్ని యిక్కడ వెల్లడించుచున్నాను. కృష్ణదేవరాయలు సాహిత్యమందేకాక సంగీతమందును మిక్కిలియభిరుచిగలవాఁడు. ఈ సంస్థానమున బండారులక్ష్మీనారాయణుఁడని యొక సంగీత విద్వాంసుఁ డుండెను. రాయలయంతఃపుర స్థానమున నాయన నాట్యరసాధిపత్యము వహించియుండెడువాఁడు. ఆతఁడు రచించినది సంగీతసూర్యోదయమని యొక సంస్కృత గ్రంథ మిప్పుడు దొరకినది. దానిపీఠికలో విద్యానగరము, కృష్ణరాయలదిగ్విజయములు, వర్ణితములయినవి. రాయలదిగ్విజయవర్ణనములలో నపూర్వవిషయము లొండురెండు గానవచ్చుచున్నవి. సంగీతసూర్యోదయకారునకు అభినవభరతాచార్య, రాయబయకార, తోడరమల్ల, సూక్ష్మభరతాచార్య, బిరుదములు గలవు. కృష్ణరాయ లీయనకు బంగారు పల్లకీ, ముత్తెసరులజల్లులుగలవి రెండు ముక్తాతపత్రములు, మదపుటేన్గులు, మలహారీవాద్యము ఒసఁగెను. ఈయన విష్ణుభట్టారకుల యొద్ద దత్తిలకోహలాది భరతమత గ్రంథములను సవ్యాఖ్యముగా నధ్యయనము చేసినాఁడు. తాళాధ్యాయము, నృత్తాధ్యాయము, స్వరగీతాధ్యాయము, జాత్యధ్యాయము, ప్రబంధాధ్యాయము, అనియైదధ్యాయములతో నీతఁడు సంగీతసూర్యోదయము రచించినాఁడు. ఈయన గ్రంథావతరణికనుండి కొన్ని శ్లోకములు:—

శ్లో. కర్ణాటాహ్వయదేశసౌఖ్యజననీ
శ్రీ తుంగభద్రావృతా,
మాతంగోన్నతమాల్యవత్ క్షితిధర
శ్రీ హేమకూటాన్వితా;
పంపాద్రీశ్వర విట్ఠలేశ్వర కృపా
దృష్టిప్రభామండితా,
శ్రీవిద్యానగరీ విభాతి ధరణీ
ధమ్మిల్లమాణిక్యవత్.

* * * *

కృష్ణరాయలదిగ్విజయములు

శ్లో. బాల్యేఽసౌ సకలకలాకలాపయుక్త
స్సప్రా(త్రా?)ణం సపది విజిత్య గంగరాజమ్;
భఙ్క్త్వా తచ్ఛివనసముద్ర ముత్కటం ద్రా
గావాసం వ్యతనుత నిర్భరం శివానామ్.

శ్లో. దుర్గం జిత్వాథ సోఽసా వుదయగిరివరం
తత్ర రాహుత్తరాజం,

ఖండీకృత్యాశు హృత్వా యుధి నగరవరే
కొండవీడ్వాం(?)కొండవల్లాః;
జీవగ్రాహం గృహీత్వా గజపతితనయం
పొట్టునూర్పట్టణాగ్రే,
విశ్వశ్లాఘ్య ప్రతాపో బిరుదయుతజయ
స్తంభ ముచ్చై ర్న్యఖానీత్.

శ్లో. సోఽయం కృష్ణనరేశ్వరో గజపతిం
జిత్వా తదీయశ్రియా,
సాకం తస్యసుతా ముదూహ్య యవన
క్ష్మాపం సపాదం తతః;
గొబ్బూరుస్థలవాసినం సరభసం
జిత్వాను విద్రావ్య తం,
హస్త్యశ్వాన్ స తదీయదుర్గ మతులం
......మారుమాదత్తవాన్.

శ్లో. కృష్ణా ముత్తీర్య సోఽయం యవనజనపదం
వహ్ని సాత్కృత్య సర్వం,
పేరోజాంబాదసించా ద్వరు(?) సగర సమా
ఖ్యాని దుర్గాణి జిత్వా;
భఙ్క్త్వోచ్చైః పారసీకంకలుబరగపురీం
ద్రాక్సపాదార్ధమానః ?, [మహిమా
కాంతా(క్రాంత్వా?)వ్యాకృష్టవాన్ దోర్బలఘన
శ్రీన్ సురత్రాణపుత్రాన్.

గ్రంథకర్త

శ్లో. తస్య శ్రీకృష్ణరాయస్య కృపా క్షీరాబ్ధిచంద్రమాః;
లక్ష్మీనారాయణో నామ వర్తతే సరసాగ్రణీః.

... ... ... ...

సదాభినవశబ్దాది భరతాచార్యనామకమ్,
బిరుదం ధరణీచక్రే ధత్తే చక్రమి వాచ్యుతః.

శ్లో. శ్రీమత్కృష్ణనరేశ్వరస్య దయయా
స్వర్ణాంచితాం పాలకీం,
ముక్తాగుచ్ఛకృతానుబద్ధవలయం
ముక్తాతపత్రద్వయమ్;
శశ్వ న్నృత్త మతంగజాన్మలహరీ
వాద్యం నిజాంతఃపుర,
స్థానే నాట్యరసాధిపత్య మసకృ
ల్లక్ష్మీపతిః ప్రాప్తవాన్.

శ్లో. సంగీతాగమ లక్ష్యలక్షణనిపుణై
శ్శ్రీవిష్ణుభట్టారకైః
జ్ఞాత్వా దత్తిలకోహలాది భరత
గ్రంథాన్ సటీకాన్వితాన్
భూమా కీర్తిశరీరరక్షణధియా
గ్రంథః కృతోఽయం మయా,
......యోగ్యతాధికతర
స్సంగీత సూర్యోదయః.

## గద్యము

ఇది శ్రీమద్విప్రకులవర్య భండారు విఠ్ఠలేశ్వరవ్యం దనసూత్ర(?)భరతా (లిఖితా?)చార్య రాయబయకారతోడర మల్లాభినవభరతాచార్య శ్రీ లక్ష్మీ నారాయణ విరచితే సంగీత సూర్యోదయే—

## ఇంకొకవిశేషము

ఈభండారులక్ష్మీనారాయణుఁ డొక్క కృతికర్తయగుటేకాక మఱి కృతిభర్తయు నయిన ట్లెఱుఁగఁబడుచున్నాఁడు. భానుకవి యని యొక తెనుఁగుకవి యాతనికంకితముగాఁ బంచతంత్రిని దెనిఁగించినాఁడు. చిట్టయమంత్రి (చిట్టమరసు ?) ప్రేరణచే, నరసింహభట్టు, నరసమంత్రి, అవధానముకృష్ణఘనుఁడు, భరతము విష్ణుభట్టు (ఈతఁడే లక్ష్మీనారాయణునకు సంగీతాగమము నుపదేశించినవాఁడు) అనువారు సమ్మతించి ప్రోత్సాహపఱుపఁగాఁ లక్ష్మీనారాయణుఁ డీభానుకవిని దనపేరఁ బంచతంత్రిని దెలిఁగింపఁగోరినాఁడట! భానుకవి తనకృతిపతి సంగీతసూర్యోదయము రచించెనని చెప్పలేదుగాని యాతనిబిరుదములను, అభినవభరతాచార్యాదులను దఱచుగా గ్రంథమునఁ జేర్కొన్నాఁడు.

క. పతికంటె మంత్రి బలిసిన
క్షితి యాతనిదైతసర్చు సిద్ధము సతి దా

బతికంటె శవరయైనను
బతికార్యము చెడును సూత్న భరతాచార్యా!

విద్యానగరము నీతఁ డిట్లు ప్రశంసించి నాడు :

సీ. పంపావిరూపాక్ష భైరవవిట్ఠలే
శ్వరముఖ్యదేవతా వ్రజముచేత
పరిపంథిగర్వవిభాళన శ్రీకృష్ణ
రాయభూధవభుజారక్షచేత
భటనటజ్యోతిష పౌరాణికభిషగ్వి
చక్షణసత్కవీశ్వరులచేత
సంతతమదవాహిచారుశుండాలను
టాజనప్రకటఘోటములచేత

గీ. రమ్యమైయుండు విద్యాపురంబునందు
నిమ్మహాకృతిభానుక వీశ్వరుండు
తెనుఁగుబాస నొనర్చెను వినుతికెక్క
నవని నాచంద్రతారార్కమనుచుఁ దనర.

ఈపంచతంత్రిలో కథలోఁగూడ నీతిపద్యములు కృతిపతిసంబోధనముతో నున్నవి. "కరణికలక్ష్మ, సూక్ష్మలిఖితాచార్యా! విట్ఠయ లక్ష్మధీమణీ,"- ఇత్యాదులు. ఇట్టి సంబోధనములవలన నీతఁడు సంగీతాచార్యుఁడేకాక మంత్రియు నని యెఱుఁగ నగుచున్నది.

మాదిరికొక్క పద్యము:—

సీ. విద్వత్కవులయందు విశ్రాణనంబును
ప్రత్యర్థినిభులందు బాహుబలము
శరణాగతులయందుఁ గరుణాకటాక్షంబు
నృపకార్యములయందు నీతిగరిమ
బంధుసంతతియందు పరమసంతోషంబు
నాశ్రితులందుఁ బాయనికలంపు
ధర్మమార్గమునందుఁ దగిలినచిత్తంబు
సత్యవాక్యములందు జతురతయును

గీ. గలిగి యెవ్వాఁడు మెలఁగు జగత్త్రియమున
నతనికీర్తులు లుబ్ధమోహాంధతమస
పటల మణఁగించుఁ జంద్రికాప్రభలయట్లు
లలితగుణధుర్య విట్ఠయలక్ష్మణార్య!

* * * *

౨

కృష్ణరాయలు రాజ్యమేలుచుండఁగా నీశ్వరదీక్షితుఁడను సంస్కృతవిద్వాంసుఁ డొకఁడు వాల్మీకిరామాయణమునకు బృహద్వివరణమని లఘువివరణమని రెండువ్యాఖ్యలు రచించినాఁడు. శ్రీకృష్ణరాయల కలు వదిగడియలలో రామాయణ మేడుకాండలు వినిపించి యాయనప్రోపునఁ జిత్రకూటమున (హంపి) నుండి రామాయణవ్యాఖ్యలు తాను రచించిన ట్లాతఁడు చెప్పుకొన్నాఁడు.

శ్లో. బృహద్వివరణంచైవ తథా వివరణం లఘు;
వ్యధా ద్రామాయణే వ్యాఖ్యాద్వయ మీశ్వరదీక్షితః.

శ్లో. కర్ణాటాధీశ్వరే రాజ్యం కృష్ణరాయే ప్రశాసతి;
రామాయణం చిత్రకూటే వ్యాఖ్యాదీశ్వరదీక్షితః.

* * * *

3

నగరు, తగరు, తొగరు, పగరు, అని చరణాద్యక్షరములుండునట్లు రామాయణ, భారత, భాగవతపరములుగా మూఁడుపద్యములు చెప్పుమని పెద్దన సమస్యయడుగఁగా నట్లే చెప్పి సత్కృతుఁడయిన చింతలపూఁడి యెల్లయకవికి శ్రీకృష్ణరాయలు రాధామాధవుఁ డని బిరుదనామ్మ మిడెను.

శా. రాధామాధవ యుమ్యతాంకితముగాఁ
బ్రౌఢక్రియం జెప్పితి
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గ
ర్ణాటేశు మెప్పించి నా
నాధాత్రప్రతిమాన సత్కవులలో
నగ్రాసనశ్రేణితో
రాధామాధవనామమందిన జగ
త్ప్రఖ్యాత చారిత్రుఁడన్.

ఈరాధామాధవకవికృతులు రాధామాధవము, విష్ణుమాయావిలాసనాటక ప్రబంధము, తారకబ్రహ్మరాజీయము, ననునవి దొరకియున్నవి.

*　*　*　*

౪

ఆముక్తమాల్యద కృష్ణదేవరాయరచితమని గ్రంథమందున్నను బెద్దనరచించినదని లోకమునఁ బ్రతీతికలదు. వ్యాఖ్యాతలు లాక్షణికులు, కొందఱల్లే గ్రంథములందును జెప్పినారు. ఆముక్తమాల్యదా వ్యాఖ్యాత శ్రీనివాసకవి:

ఉ. ఉరువగు విష్ణుచిత్తతన
యోద్వహనంబును సంస్కృతాంధ్రవా,
గ్గరిమ నలంక్రియారసస
ఖంబగు నట్లుగఁ బెద్దనార్యుఁడు,
ధ్గురభణితిన్ రచించె నది
దుర్ఘటబోధముగావునన్ ధరన్,
స్థిరమగుచుండునట్లు
గనుజేసెదఁ డీక సవిస్తరంబుగాన్.

గుడిపాటి వెంకటకవి టీక

గీ. ప్రేమ నల్లసాని పెద్దన యాముక్త
మాల్యదాఖ్యకృతి సన్-చితముగఁ
జేసె నీవు టీక చేయుము చెఱకునఁ
బండు పండినట్టులుం[?]గాన.

సీ. కరమర్థిఁ గవిరాయగండ పెండేరంబు
చెల్లించుకొన్నట్టి బిల్లిదుండు
కవులలోపల నాంధ్రకవితాపితామహ
బిరుదాంకుఁడైన గంభీరమూర్తి
మనుచరిత్రాదిసమ్యక్కావ్యరచనలఁ
జల్పినవైష్ణవ చక్రవర్తి
కృష్ణరాయలు తనకేల్దమ్మిచే నెత్తఁ
బల్లకి యెక్కినభాగ్యశాలి,

గీ. అలఘుఁ డలసాని పెద్దన యాఘనుండు
మహిమఁ జేసినయాముక్తమాల్యదా ప్ర
బంధ మెచటఁ దదీయధీపటిమ యెచట?
నాకు శక్యంబె దానికిఁడీక సేయ?

రంగరాట్ఛందస్సులోఁ గూడఁ బెద్దన చెప్పిన యాముక్తమాల్యద యనియున్నది.

*　*　*　*

౫

విశాఖపట్టణమండలమున "ప్రపంచదర్పణ"మని యొకసంస్కృతగ్రంథము ప్రాచ్యలిఖిత పుస్తకశాలవారికి దొరకినది. అది సంధానగ్రంథము. ప్రాచీనగ్రంథముల నుండి యనేకవిషయము లందు సంకలనము చేయబడినవి. అందీక్రింది శ్లోకము లున్నవి:

అల్లసాని పెద్దనార్యేణ సత్యావధూపరిణయే:

శ్లో. అంగులీషు కురంగాక్ష్యా శోభతే ముద్రికావళీ;
ప్రోతేవ బాణైః పుష్పేషో స్సూక్ష్మలక్ష్యపరంపరా.

అల్లసాని పెద్దనాఖ్యేనా ప్యేవముక్తం రసమంజర్యామ్:

శ్లో. ఉడురాజముఖీ మృగరాజకటి
ర్గజరాజగతిః కుచభారనతా;
యది సా రమణీ హృదయే రమతే
క్వజపః క్వతపః క్వసమాధివిధిః.

మొదటిశ్లోకముగల గ్రంథముపేరు సత్యావధూప్రీణన మయియుండునేమో! ఆముక్తమాల్యదలో కృష్ణరాయల కృతులుగా నీ గ్రంథములుగలవుగదా!

"సీ. పటికితు ప్రేక్షోపమల"—ఇత్యాదిపద్యమున—
"భావధ్వనివ్యంగ్య సేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూ ప్రీణనంబు"— "మఱియు రసమంజరీముఖ్యమధుర కావ్య, రచన మెప్పించుకొంటి గీర్వాణభాష"—

ఈ సంధానగ్రంథమున నీ పేళ్లతోఁ బెద్దనార్యకృతులను బేర్కొనుట వింతగదా! కృష్ణరాయకృతులలోనివిగాఁ గూడ నందు శ్లోకములున్నవి.

కృష్ణరాయస్యాలంకారసారసంగ్రహే—

సిందూరం రవి మిందు మానన మహో
ధమ్మిల్లరాహోర్గ్రహో,
న్యగ్రాధం గ్రసతీతి తచ్చ విబుధై
ర్నిర్ణీత మాత్పాతికమ్;
కోశే చంచలతా భవిష్యతి హా
త్స్యత్కుంతలే కర్షణం
కాం ... హే
అంగే మహాన్సంగరః.

ఇందుఁజూపఁబడినశ్లోకములు సుభాషిత రత్నభాండాగారమునఁగూడనున్నవి. "అంగుళీషు" ఇత్యాదిశ్లోకము బిల్హణునిదిగా నందుఁ జెప్పఁబడినది. తక్కినవి యెవ్వరు రచించినవో యందు లేదు.

ఆగ్రంథసంధాతబోధ్యుఁడు. ప్రసిద్ధగ్రంథకర్తల పేళ్లతో నెక్కడివో తెలియరాని మంచిశ్లోకములఁగూడ నాతఁడు గూర్చియుండునని సందేహించుటకుఁ గొన్నిచోట్ల నెడము గలుగుచున్నది. ఈశ్లోకము లట్టివయియుండవచ్చునేమో!



## ఈ వేళ కనుపించునా?

తురగా వెంకటరామయ్య గారు

పూతవయసే, వెన్న
పూసమనసే, కెంపుఁ
దమ్మిరేకులకండ్ల
తళుకులే తెలుపునే.
బాలకృష్ణునిబిలువవే!
కోకిలా! ప్రణయరాథను నిలుపవే!

2. వలపించి మాయమై,
విలపింప జేయుటా?
కలికమ్ములోకైన
గానరాకుండుటా?
దారుణమ్మనితెల్పవే!
కోకిలా! తగదుతగదని చెప్పవే!

3. ఘుఱచినానే మేను
మఱచినానే మనసు
బ్రతుకెల్ల నతనికే
వదలి యిట్లయితినే
మఱువవద్దని చెప్పవే!
కోకిలా! కరగురీతులనాడవే!

4. గుట్టులేదే మనసు
పట్టలేకున్నానె
ఎట్టు లీకన్నీటి
యేళ్లీదుదానసే
యమునలో బడుమందువా?
కోకిలా! అతని నిచటకు దెత్తువా?

5. విడిచినానే సిగ్గు
విడిచినానే సిరులు
నిలువనీడే లేక
విలపించుచుంటినే,
తెలుపనైనా తెలుపవే!
కోకిలా! అటుక లుంటే పాపవే!

6. మొదలె తెలియని నన్ను
మోహాలలో నిల్పి
రాగాల దీయించి
రాకుండబోవునా ?
నీవైన వచియింపవే!
కోకిలా! సాధించి తోడితేవే!

7. నమ్మినానే మాట
కమ్మదనములు, వలపు
లమ్మినానే వాడు
నమ్మడే, కఠినుడే
రాధమన సెఱిగింపవే!
కోకిలా! సాధించి తోడితేవే

8. మేఘాలమేడలో
మెఱుపు దీపాలలో
కాలసుందరి యిచ్చు
కాలు విననేగెనో
పిలువనైనా పిలువవే?
కోకిలా! యలుగరాదని పల్కవే!

9. వేదాలవీథిలో
వివరింపనేగెనో
వాదాల యెండలో
వడగొట్టి పండెనో
చూడనైనా చూడవే?
కోకిలా! జాడలైనా తీయవే!

10. యోగిహృదయాలలో
దాగి రాకుండెనో
రాగిణీవలయాన
రంజిల్లుచుండెనో
వెదకుజాడలు గాంచవా?
కోకిలా! వెంటవత్తును పాడవా!

11. పట్టలేనే యతని
దిట్టలేనే యలిగి,
వేయిబాములబెట్టి
విసిగించినా సరే
కంటబడితేచాలునే!
కోకిలా! కాలదన్నిన జాలునే!

12. పిల్లడా? లోకాలు
కొల్లగొనుచోరుడే?
గాలించిచూచినా
కనుపడని కృష్ణుడే!
ఈవేళ కనుపించునా?
కోకిలా? ఈజీవ మిక నిల్చునా?






# దిగంబర యోగి

కే. వి. బసవరాజు గారు

శ్రీ వేంకటేశ్వరునిదర్శనార్థము నేను తిరుమలకు బోతిని. ఒకనాటియుషః కాలమున నచ్చటిపర్వతారణ్యశోభను దిలకింప సచ్చవాడమై బయలుదేరితిని. కొండపై నుండి క్రిందికి పెక్కుదారు లుండెను. అందే దారి యెచ్చటికేగునో నేనెఱుగను. నిర్జనారణ్యప్రదేశమును జూడనెంచినవాడ నగుటచే మనుష్యుల రహదారిగానుండెడి బాటలను విడిచి ఆనవాలుమాత్ర మగుపడుచుండెడి యొక్కక్రొత్తదారి బట్టి పోతిని. ఆమార్గము నిమ్నోన్నతప్రదేశములలోనుండి వంకరటింకరులుగా బోయెను. నూరుబారల దూరమునడచునరికి చిట్టడవిలో బడితిని. నిలివెడెత్తున బెరిగి బోరెడావల నేమియును పడనంతటి దట్టముగా బెనచికొనిపోయిన ముండ్లడొంకలనడుమనుండి నడచుచుంటిని. ఒకమనుష్యుడుగూడ గొన్నిచోటుల నొదిగి ప్రక్కగా నడువవలసినంతటి యిరుకుగ నా దారి యుండెను. ప్రక్క డొంకలలోనుండి సర్పాదిక్రూరజంతువులువచ్చి పైబడునేమో యని గుండెలు కొట్టుకొనసాగెను. మఱికొంత నడచునరి కాబాటయొక ప్రక్కకు మఱలెను. అచ్చటనుండి యొకలోయవంటి పల్లపుప్రదేశమునకు దిగెను. ఆలోయలోనుండి కొంత నెత్తముతో సరిగానుండునట్లు పెరిగి లోపలి భాగ మగుపడకుండ బెద్దచెట్లావరించి యుండెను. ఆ దుర్గమప్రదేశములో అడుగులజాడమాత్రము కనుపడెను. కానిమ్మని తెగించి దిట్టతో ముందడుగువైచితిని. అచ్చట నొకచాపరాతిబండ యుండెను. దాని నెక్కి నలుదిక్కులు చూచితిని.

బాలభానుని యరుణకిరణప్రసారముచే జివురుజొంపములు కెంపులబంతులవలె నింపు నింపుచుండెను. వేపపూవుల వెగటువాసనకు గోరింటపూవుల ఘుమాయింపు విరుగుడుగా నుండెను. ప్రకృతిశోభ కానందమగ్నుడనగు నాకన్నులకొకవైపునగురివెందడొంకచాటున నొక మనుష్యాకారము గోచర మయ్యెను. ఆనందమున కాశ్చర్యముతోడయి నన్నచ్చటి కీడ్చికొనిపోయినది. గుడుగుడు గుంచముగా డొంకలచుట్టుదిరిగి సందుచేసికొని యాగురివెందముందుజేగి చూచితిని.

దిగంబరుడు, గూని మూపు పైకి వ్రేలాడు కుఱుచ కెంజడలవాడు, ధూళిధూసరితదేహుడు, పద్మాసనాసీనుడు, బక్క-

పలుచని వాఁడు, ఒకయోగి కడుపువెన్నుతో నంటబెట్టుకొని కన్నులు సగముమూతలు వడియుండ బ్రహ్మతేజస్సు వెడలగ్రక్కుచు పరమాత్మానుభూతిలో మునిగియున్నాఁడు. నేను గిక్కురుమనకుండ నరగడియ నిలబడిచూచి యొకప్రక్కను జతికిలబడినాను. ఎందఁలకు నిరీక్షించుచుంటినో, ఎంతకాలము నిరీక్షింతునో, ఏమికోరి నిరీక్షించుచున్నానో నాకే తెలియదు. నాదృష్టి యాయోగియందు స్తంభించెను. ఱెప్పఁయినను వ్రాల్చితినో లేదో చెప్పజాలను.

ఒకటిరెండుగడియల కాయనపొట్ట కదలజొచ్చెను. కట్టెవంటి వెన్నెముక వంగజొచ్చెను. కనుఱెప్పలల్లాడజొచ్చెను. చిన్నయూపిరి బయలువెడలి మీసను లెగురజొచ్చెను. మెల్లన గనులువిచ్చి యా బైరాగి నన్ను జూచెను. బుస్సుమని యొక్క నిట్టూర్పు విడిచెను నేను ప్రణమిల్లితిని. కనుబొమ లెగురవైచి, తలపంకించి, గుప్పిటచేయి యూపి నీ వెవడ వను నర్థముకల సన్న జేసెను.

సామాన్యముగా బైరాగులు హిందూస్థాని మాటాడుదురు. వారిలో జాలమందికి తెలుగు వచ్చియుండదు. నాకు హిందూస్థాని రాదు. తప్పో, యొప్పో యిట్లంటిని. "మై తెలంగీ బ్రామ్మణ్ హై" నాకాశ్చర్యకరముగా నాతడు "నీ కేమికావలెను?" అని స్వచ్ఛమగుతెలుగున ప్రశ్నించెను. ఆయనకు దెనుగువచ్చుట నాకు హిందీవచ్చినదానికంటె తృప్తినిడెను. మా కిట్లు సంభాషణము సాగెను.

నేను:—స్వాములసేవగోరి వచ్చితిని.

యోగి:—స్వామికొండపైనున్నాడు; పొమ్ము.

నేను:—వారిదర్శనముమాత్రమే సులభము. అనుగ్రహము దుర్లభము.

యోగి:—నాయునికి నీ వెట్లు తెలిసికొంటివి?

నేను:—వేంకటేశ్వరుని ప్రేరణమువలన.

యోగి చివాలున లేచి నడువసాగెను. నేనును లేచి వెంబడించితిని. ఎంతదూరము



"స్వామికొండపై నున్నాడు; పొమ్ము"

పోవుదునో కాని పదిబారలు నడచినపిదప యోగి తిరిగిచూచి "నీకు నాతో నేమిపని? వచ్చినదారినిఁ బొమ్ము" అనెను.

నేను:—మిమ్ము సేవింపుచు మీ వెంట నుండెదను. వెనుకకు బోవనొల్లను.

యోగి:—ఓయీ! నీవు రాజాలవు. సంసారసుఖలంపటుల కీయడవిలో జోటులేదు.

నేను:—నాకు సంసారమం దిచ్ఛలేదు. మీ పాదసేవఁ జేయుచు నీయడవియందే వసించెదను.

యోగి:—నీకు భార్యయు బిడ్డలు నున్నారా?

నేను:—ఉన్నారు.

యోగి:—వారి నేమిచేయుదువు?

నేను:—దైవవశము చేయుదును.

యోగి:—నీకు నాతో నేమిపని?

నేను:—నన్ను దరింపజేయుడు. మీ దాసునిగా జేసికొనుడు.

యోగి:—తరణోపాయము లడవిలోకంటె నింటిలోనే యెక్కువలున్నవి. అచ్చటనే యభ్యసింపుము.

నేను:—స్వామీ! గురువులేనిదే యెట్లు తరింపగలను?

యోగి:—నీకుటుంబజనులే నీకు గురువులు. అన్వయించుకొనుము.

నేను:—సంసారానుభవము లేమిచే స్వాములిట్లు సెలవిచ్చుచున్నారు. అదికాంతాకనకములకు బట్టుగొమ్మ.

యోగి:—కాంతాకనకమంత్రము లుపాసించి సిద్ధుడవైతివేని మోక్షము కరతలామలకమే.

నేను:—మహాత్మా! శాస్త్రవిరుద్ధమగు దారిని జూపి నన్ను భ్రమపెట్టుచున్నారు.

యోగి:—శాస్త్రజన్యజ్ఞానముకంటె ననుభవజ్ఞానము గొప్పది. కావున ననుభవసిద్ధుడవు గమ్ము. పొమ్ము.

నేను:—స్వామీ!మీయనుభవ మదియేనా?

యోగి:—అవును. ఇక నీవు రావలదు. పొమ్ము.—అనియోగి దారిబట్టెను. నేనును వెంబడించితిని.

యోగి:—వత్సా! నీమూర్ఖతమాని వెనుకకేగుము. నీవు నన్ను వెంబడింపజాలవు.

నేను:—[సాష్టాంగపడి] "మహాత్మా! మీ యనుభవమును నాకు దెలిపి నన్ను తరింపజేయుడు" అని రెండుపాదములు పట్టుకొంటిని. యోగికి మనసు కరగెను కాబోలు. గులకసూదిరాళ్లపై గుతిల పడిన నన్ను లేవదీసినాడు. నేనును లేచి కాలితో రాళ్ల నవలికి ద్రోసికొని కూర్చుండబోవ యోగి నవ్వి "ఇంతేకదా?" అనినాడు. అదేమో యిప్పటికిని నాకర్థముకాలేదు.

యోగి:—వత్సా! నీవు నేడు నాతపస్సునకంతరాయ మొనరించితివి. నిన్ను ద్రోసిపుచ్చలేకున్నాడను. అందుకు గారణములు రెండు. దైవికమగు మనసంఘటనము, నీకుగల మోక్షేచ్ఛ; కాని విద్యా

సంపూర్తికి "ఓనమాలు" చెప్పమను చున్నావు. అందుకు సంసారమే తగిన బడి. ఇది యధికారస్థానము. అచ్చటఁ బనికిరానివా రిచ్చటను బనికిరారు. ఇది నాయనుభవము. ఇం కేమికావలెను?

నేను:—మహాత్మా! మీచరిత్రమును వినిన గాని మీసంసారానుభూతి యెట్టిదో నా కర్థముకాదు. అనుగ్రహించి యానతిండు.

యోగి:—నాయనా! మనయీద్వైవికసమావేశమునకు ఫలము నాపూర్వచరిత్రస్మరణము కాబోలును. అందువలన నీకేమియు లాభముండదు. కాని నావైరాగ్యలత కదియొక దోహదమగుగాక! ఇన్నివిధముల బ్రార్థించువానిని ద్రోసిపుచ్చుట యహంభావ మనిపించికొనును. కావున మూడుమాటలలో ముదిముక్కలతో కథ ముగింతును. వినుము:

నేనొక యాంధ్రబ్రాహ్మణపండితపుత్త్రుడను. మాతండ్రి ధనికుఁడు. ఏకపుత్త్రుడనగుటచే నల్లారుముద్దుగా బెంచిరి. నాబాల్యమునందే తండ్రిగారు గతించిరి. అంతటితో నే నింటియజమానుఁడనైతిని. మాతండ్రిగారు నాకొక కులీనయగు కన్యకను వివాహమొనర్చిరి. నాకుఁ బదునెనిమిదేండ్లు వచ్చుసరి కామె కాపురమునకు వచ్చెను.

నాయనా! మఱచిన మాటలను మననమునకు దెచ్చికొని చెప్పెడి నామాటలు నీకింపుగానుండవు. అంతరంగము నను సంధించి కొనెదవేని యర్థోపలబ్ధితో - నంతగా బని యుండదు.

పెత్తనము చేతికివచ్చినదిమొదలు నేను పూలరంగడనై యిల్లును, దేహమును గుల్ల చేసికొంటిని. గృహలక్ష్మివచ్చుసరికి ధనలక్ష్మి లేచిపోయినది. అప్పటికి నాకుగలయాస్తి నా భార్యకు బెండ్లినాడుంచిన నగలుమాత్రమే. నాచరిత్రము విని నాగడుసరిమామగారు నగలను తనయొద్దనుంచి బొందున పుస్తెతో నాభార్యను గాపురమున కంపినాడు. ఎటులయినను దండ్రిగారియొద్దనుండి సొమ్ములు తెమ్మని నాభార్యను నిర్బంధించితిని. నాభార్య నానిర్బంధమును దండ్రికి వినుపించిన-చోదన్నునాయొద్దకు బంపడనికాబోలు చెప్పదాయెను. తండ్రి నిరాకరించినమాటలకు మృదువులగు పర్యాయపదములను గల్పించి నాకు జెప్పుచుండెడిది. మా యిరువురినడుమను ఆమె కాపురము దుర్భరముగా నుండెను. ఇది గాదుపనియని నామామగారికి కఠినశిక్ష విధించితిని.

నేను:—ఏమిశిక్ష?

యోగి:—నాభార్యను విడిచి దేశాంతరము లేచిపోవుట. ఇంతకంటె నల్లుండ్రు మామలకు విధించెడి శిక్షయేమి? ఒకసంవత్సరము కంటఁబడలేదు. నాభార్య బెంగగొని మంచముపట్టెను. ఆమె యవస్థ జూడలేక మాపిసినారిమామగారు వ్యయప్రయాసలకోర్చి నాకొఱకు దేశమంతయు వెదకించెను. వారికి దొరకకుండ వారి యవస్థలుచూచి- నాసమర్థతకు నేనేమెచ్చి కొంటిని. ఇక నేను మనుష్యయత్నము వలన దొరకననిమెంచి "మాయల్లుడు

వచ్చి మాయమ్మాయికాపురము కుదుట బడినచో వేంకటేశ్వరునకు మాయమ్మాయిచేత నిలువుదో పిచ్చెద"నని మ్రొక్కి మీదుకట్టిరట. శనివారపుదీపారాధనలు, ఏకభుక్తములు, మొదలుపెట్టిరి. మామగారి కాపాదమస్తకమును పంగనామములమయమై పోయెను. నాభార్య మేనత్తయగు ముసలమ్మకు ప్రతిదినము రాత్రిళ్లు గంగిరెడ్లవాండ్రు వచ్చినట్లును, ఎద్దుపైబడి క్రుమ్మినట్లును కలలు రాదొడగెను. నా భార్యకు స్వప్నములో ముత్తైదువులువచ్చి "నేను అలవేలుమంగమ్మ" నని పసుపుకుంకుమలీయసాగిరి. ఇంతలో నాకును అత్తవారింటివైపు కాలుసాగెను.

నేను:—అహాహా! స్వామిసాక్షాత్కారము. "కలౌ వేంకటనాయకః" అన్నమాట నిజము.

యోగి:—నీలాగుననే ప్రజలలో వేంకటేశ్వరునిపై విశ్వాసము మెండయ్యెను. ఏయింటజూచినను పూజలు మ్రొక్కుబడులు మితిమీరెను. అడ్డబొట్టులవారుగూడ అవసరమునుబట్టి నిలువుబొట్టులవారయిరి.

నేను:—మీకెప్పుడును స్వామి కనుపడినట్లు చెప్పరేమి?

యోగి:—అయ్యో! కనుపడకేమి? ప్రతిదినమును పట్టెవర్ధనాలతో నామామగారువచ్చి నా భార్యనగలన్నియు నొలిచి నాకిచ్చినట్లు కలలు వచ్చుచునేయుండెను. ఆమాట మూటగట్టుకొని నామామగారికి చెప్పుటయు, వారు దానికి సంతానలాభమో, సంపల్లాభమో ఫలముచెప్పుటయు నేను మాయత్తవారియింటికి పోయినది మొద లనేకసారులు జరిగెను. నేను వారియిల్లు చేరినదిమొదలు దేవుని వీరావేశము హెచ్చుగాసాగెను. నాయిల్లాలికి ఆరోగ్యము శీఘ్రములోనే కలిగెను. గణాచారి గమళ్లవెంకమ్మ గజ్జెలుకట్టుకొని వచ్చి మాటిమాటికి "నీయల్లుని తీసుకువచ్చిన నన్నుమఱచిపోయినావా? నాకొండకువచ్చి నిలువుదోపెప్పుడిచ్చెదవు?" అని ప్రాణములు కొఱుకసాగెను. విసిగి మామగారు వైకుంఠైకాదశికి తిరుపతి ప్రయాణము నిశ్చయించిరి. ఇది యంతయు నే నచ్చటికేగిన రెండునెలలకే.

నేను:—మీమామగారికిని మీకునుగల కలహకారణ మేలాగు కుదిరినది?

యోగి:—అడుగవలసిన ప్రశ్న మడిగితివి. నేను బుద్ధిగలిగియుంటినని విశ్వాసము వారందఱికిని గలిగెను. అందుచే నెలరోజులగుసరికి నాభార్య నగలతో నాయొద్ద నిద్రించుట కాజ్ఞనిచ్చిరి. అతివిస్తరమేల? వైకుంఠైకాదశి రేపనగా దిరుపతి జేరితిమి. సకుటుంబపరివారముగా బోయి యొకసత్రమున మంచిగదులలోవిడిసితిమి. భోజనాదికము లయిన పిదప నించుక విశ్రమించి కొండపై చిత్రములు చూచుటకు సికారికి బయలుదేరితిమి. ఆనాడు గొప్పసాహుకార్లు గుడిలో మ్రొక్కుబడి పెండ్లి చేసికొనుచుండిరి.ముఖమంటపమున కార్వేటినగరపుకల్యాణియను వేశ్యమేళము

మేజువాణి జరుగుచుండెను. పెండ్లివారు సభచేసిరి. ప్రేక్షకులుత్రొక్కులాడుచుండిరి. అదేమో చూతమని మావారిని దప్పించి కొని యామూకలో దూరితిని. ఆకళ్యాణి రూప గానాభినయసమ్మోహములో బడి యుండనిచో జనులు తొక్కిడి బాధకు ప్రాణములు విడిచి యుందును. ఎంతకాల మైనటిదో నేనెఱుగను. మేజువాణిముగిసి, కళ్యాణి విడిదిలో బ్రవేశించి నాకంటికి దూరమయి, నేను సత్రములో జేరు వఱకు రాత్రి పదిగంటలయినది. మా వాండ్రు నాకై బెంగపెట్టుకొని కూర్చుం డిరి. ఏవో టంకములతిక్కి, మెతుకులు గతికి ప్రక్కపై జేరితిని. ప్రయాణశ్రాంతులై యందఱును తెప్పవాల్చుట తడవుగా నిద్రించిరి. మామామగారు చిరుగుర్రున కారంభించిరి. నేను లేపి యిట్లంటిని. "మామగారు! ఇది రహదారిసత్రము. మన మెంతగదులలో నున్నను జాగ్రత్త మంచిది. కనుక నగలు తీసి పెట్టెలో బెట్టి మఱనిద్రింపుడు." నామామగారు తన మొలలలోని తాళపుగుత్తి విసరి "జాగ్రత్తచేసి నీదగ్గిరనే యుంచుము" అనిరి. నాభార్యనులేపి ముక్కుపుడకసహితము తీయించి బట్టలడుగున పెట్టెలో బెట్టి సరుదు సరి కరగంటయయ్యెను. అంతలో మా మామగారు నిద్రావశులయి గుఱ్ఱుపెట్టిరి. ఆయనకు నిద్రాభంగముసేయనొల్లక తా ళపుగుత్తి నామొలలలోనే యుంచితిని. ఆ యనకు నాయం దమితవిశ్వాసము గలు గుటచేతనే నేనాయనతాళముపట్టుట తట స్థించినది. నేనును నడుమువాల్చితిని. కాని కంటిమీద కునుకురాలేదు. దేహ మచ్చటనేయుంచి కామరూపముతో సం చరించుచుంటిని. కొట్టివేసినటు లందఱును గాఢనిద్రలో నుండిరి. నాయనా! ఆపైని వారివృత్తాంత మేమయినదో నాకింతవఱ కును దెలియదు.

నేను:—ఎందువలన ? తామచ్చటనే పండు కొంటిరికదా?

యోగి:—లేదు.

నేను:—ఎచ్చటికేగితిరి?

యోగి:—కార్వేటినగరమునకు.

నేను:—ఏల ?

యోగి:—నిలువుదోపిచ్చుటకు.

నేను:—ఎవరికి ?

యోగి:—కార్వేటినగరపు కళ్యాణికి.

నేను:—[నిశ్చేష్టుడనై మాటాడ లేకుంటిని.]

యోగి:—వత్సా! అట్లు వెలవెలపోయెద వేమి ?

నేను: మిమ్ముగూర్చిన యీవిషయమును నమ్మజాలకున్నాను.

యోగి:—అట్లైన నాయీ ప్రయాసమంత యు వ్యర్థము, ఇక నీవు పోవచ్చును.

నేను:—మహాత్మా! క్షమించి పైవృత్తాంత మానతిండు.

యోగి:—ఓయీ! నామాటలం దసత్యభ్రాం తి వదలి వినుము. తెల్లవారుజామున

నగలపెట్టెనెత్తిని బెట్టుకొని భోగమువాండ్ర బండ్ల వెనుకబడి కార్వేటినగరపు దారిని బట్టితిని.

నేను:—ఆ బరువును మీ రెట్లు మోవగలిగితిరి ?

యోగి:—నేనా మోచినది ? నామోహావేశము. పెట్టెనుగాదు. ఒప్పుకొనెనేని కళ్యాణినిగూడ మోచియుందును.

నేను:—అంతదూరము నడచినను మీకు గాళ్లులాగలేదు.

యోగి:—అప్పుడు లాగలేదు. తలచికొనినచో నిప్పుడు లాగుచుండును. నాయనా! కథ సాగనిమ్ము. వారితో మాట మంతి కలిపి మచ్చికచేసికొంటిని. ఊరిసమీపమునకేగుసరికి బండిపై జేరగలిగితిని. కొంగుదాకి కొంతాస దీర్చికొన్నాడను. ఓయీ! తలవంచికొందువేమి ? సిగ్గుపడకుము. ఇప్పటినాస్థితినిబట్టి లజ్జాకరమేకాని యప్పటిదృష్టిలో నది ప్రయోజకత్వమే.

నేను:—స్వామీ ! తరువాత.

యోగి:—వేంకటేశ్వరుని మొక్కుబడిని వెలకాంతకు దీర్చితిని. కాని దానికంటె వేంకటేశ్వరుడే సులభు డనిపించినాడు. ఆయన భక్తులకు వరములిచ్చును. కళ్యాణి నాకు వరప్రదాయిని కాలేదు. అభయహస్తముమాత్రము లభించెను. పెండ్లిలో నొకలఘాధికారిపై కళ్యాణి కన్ను వేసినది. వలపన్నినది. ఆచేప యదివఱకొక గాలములో దగుల్కొనియుండుటచే దీనిలో బడలేదు. ఆకోమటిబిడ్డడు అదివఱకే యొక వెలకాంతవలపులో జిక్కియుండెను. అందు నాకొకపదవి లభించినది. ఏమనగా ! కళ్యాణి యావైశ్యునికి రాయబారముజరుపుటకు నన్ను నమ్మిన బంటుగా నేలెను. అది గొప్పయదృష్టమని యుబ్బి తబ్బిబ్బయితిని.

కళ్యాణి జాబులు కోమటికి రహస్యముగా నేనందఁజేయుచున్న సంగతి వానియుంపుడుకత్తెకు దెలిసెను. ఆవీథిలో నేనడుగుపెట్టినపుడెల్ల నాతొత్తు నన్ను బత్తులడల దిట్టుచుండెను. ఇప్పుడు నీతలయెక్కి త్రొక్కుచున్న యీసిగ్గు నాకప్పుడు మొగమైనను జూపలేదు. అది నాయదృష్టమే సుమా ?

నేను:—సిగ్గుమాలినతన మదృష్టమా ?

యోగి:—పాపపుణ్యములలో దేనియందైననుసరే తుదముట్టసాగినప్పుడే కాని ముక్తి చేకూరదు. ప్రారంభమందే విరక్తియో, తృప్తియో గలిగిననది తుదముట్టదు. అప్పుడు నాకు సిగ్గు గలిగినచో నేనీస్థితికి వచ్చియుండను. తరువాత వినుము. "దూషణభూషణతిరస్కారములు దేహమునకేకాని యాత్మకులేవ" ను మహావాక్యము ననుసంధించుకొంటిని. కళ్యాణి కార్యసిద్ధియే నాకు ముక్తియని కోమటి విటుని తొత్తుగుమ్మము చుట్టు కుక్కవలె దిరిగితిని.

నేను:—శివశివ! (అని చెవులుమూసికొన్నాడను.)

యోగి:— 'కుక్కపోలిక' నీవోపమానమని యేనా? దానివలె దండప్రహారములకు గుఱికాకుండనిచో దానికంటె కొంత మేలనిపించికొనియుందును. ఓయీ! ఎంతసేపు నవ్వాపికొందువో చూచెదనులెమ్ము.

నేను:— తరువాత వినిపింపుడు.

యోగి:— అడుగవలసిన ప్రశ్నలడుగజాలని నీవంటిసిగ్గరి సత్యమును గ్రహింపజాలడు. వ్రతముచెడినను ఫలముదక్కినదాయని యడుగుము. నేను తినినదెబ్బలన్నియును కళ్యాణి చేతితో నిమిరినంతనే మానిపోవునని యాసపడితిని. బిక్కమొగముతో నేను గళ్యాణిదగ్గఱకు బోయితిని. "ఏమి వార్త" లని కళ్యాణి గంపెడాసతో నన్నడిగెను. "వార్తలేమియునులేవుగాని వాతలివిగో" యని దెబ్బలు చూపించితిని. వత్సా! అప్పుడామె యేమిచేసినదో చెప్పుము. నీతెలివి చూతము.

నేను:— సరే, కళ్యాణికటాక్షము వచ్చియుండును.

యోగి:— కటాక్షము. కంటితోఁగాదు. కాలితో. వట్టిదికాదు; "అప్రయోజకపుముండకొడుకా" అను బిరుదుతో. భాభా! తలయెత్తుము. నీవౌచిత్యము నెఱుగవు. ఎఱిగినచో "షేలు! బళీ! సెబాసు!" అని సాధువాదముచేసి యుండవా?

నేను:— మీ రూరకుంటిరా?

యోగి:— చిన్నప్పటిచదువు జ్ఞాపకమువచ్చినది.

నేను:— ఆ చదువేది?

యోగి:— కలముకాగితము నిటుదెమ్ము-వ్రాసి యిచ్చెదను. నేను జేబులోనికలముకాగితము నిచ్చితిని. ఆయనవ్రాసి మడతపెట్టి "ఓయీ! నీవావలకుబోయినప్పుడొంటరిగా జదువుకొనుము. నీవు మొదట నీగురువెవ"రని యడిగితివికాదా? ఇప్పుడు నీవేనిర్ణయింపుము.

నేను:— (సాష్టాంగపడి) మహాత్మా! నాకు ముక్తిమార్గముజూపుడు.

యోగి:— నేను తిరిగి తిరుపతిదారిబట్టితిని. నీవును వచ్చినదారినేపట్టుము.

నేను కన్నులుమూసికొని నిమిషముండి లేచి చూచితిని. శ్రీవేంకటేశ్వరస్వామి గర్భాలయములో దేవుని ముందుపడియుంటిని. కొంతసేపు విభ్రాంతుడనై యుండి లేచితిని. స్వామి కెఱిగి బయటికిబోయి కాగితమువిప్పి చూచుకొంటిని. అం దీ శ్లోకము వ్రాయబడి యున్నది.

"శ్లో. యాం చింతయామిసతతం మయి సా విర
క్తా, సాప్యన్యమిచ్ఛతిజనం సజనోన్యసక్తః;
అస్మత్కృతేచ పరితుష్యతి కాచిదన్యా,
ధిక్తాంచ, తంచ, మదనంచ, ఇమాంచ,
మాంచ."

ఆహా! మహాత్ములచరిత్రము లద్భుతజనకములుకదా!




విద్వాన్ కట్టి కామేశం గారు

ఘనచండత్వముఁ బాసి వేవిరివియై గాఢాగ్నిసంతప్తమౌ
పెనముం బోలెను నెఱ్ఱవారి దినకృద్బింబం బదస్తాద్రి నం
దినసీడెంతయు దీర్ఘమయ్యెఁ దనపైఁ దేజస్వి దూరంబుగాఁ
గను వృద్ధిం గను టబ్బురం బెయని లోకంబుం బ్రబోధింపఁగన్.

ఉ. దిక్కులకెల్ల దివ్యతరదీప్తుల నిచ్చిన లోకబాంధవుం
డక్కట యస్తమించు నిఁక నారయరాదు పదంబు సేరఁ డిం
కెక్కడి కేగువారమని యిండ్లకుఁ జేరె ద్విజాళి, తేజముం
డక్కియినుండు దద్దయు నడంగుట గాంచుచు మెల్ల మెల్లఁగన్.

["ఆరయరాదు" అర్థాంతరమున "నేక్షేతాదిత్యముద్యంత మస్తంయంతం కదాచన" అనువిధిని గమనింపవలెను.]

["మెల్ల మెల్లగన్." అర్థద్వయమునందును "ప్రాయోభృత్యాస్త్యజంతి ప్రచలిత విభవం స్వామినం సేవమానాః" అనుసూక్తిని గమనింపవలెను.]

క. ఎంతయుఁ దేజముగల్గిన, నెంతయు మిన్నందియున్న నెంత తిరిగినన్
అంతంబు తప్పదని వేదాంతము బోధించె సూర్యుఁ డస్తంగతుఁడై.

క. ఎంత కరబలముకలిగిన, నెంత ప్రతాపంబునున్న నెంత వెలిఁగినన్
అంతయుఁ గాలవశంబని, యెంతయు బోధించె నినుఁడు హీనప్రభుఁడై.

మత్త. సుంతయుం దనుజూడరాకయె చొక్కి పుట్టినదాదిగా
సంతతప్రభతోడ వెల్గినచండభానుఁడు గ్రుంకినన్
అంతనెంతయు నెఱ్ఱకాంతులు హత్తె నాదెస నంతయున్
జింత చచ్చినఁ బుల్లచావదు సిద్ధమంచును దెల్పుచున్.

చ. పటుతర తేజమున్ విడిచి భాస్కరుఁ డస్తము నందినంతఁ జీ
కటిమయమయ్యె నక్కట జగంబు సమస్తము దుర్నివారమై

యట ఘనమిత్రుఁడస్తమును నందఁగ జాడ్యము నంధకారము
ద్భటమయి గ్రమ్ముచుంట యది భావ్యమెయౌఁగద యెంచి చూడఁగన్.

["జాడ్యము" అర్థాంతరమున "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్," అనుసూక్తిని గమనింపవలెను.]

చ. జనులకు నెల్లపట్టులను సౌఖ్యమెకూర్చుచు దుర్నిరీక్షుఁడై
యినుఁ డుదయించి యున్నతిఁ జెందును రూపములేకయుండి యా
యినుఁ డటులేగినంతటనె యెక్కడనుండియొ యొక్కటొక్కటే
కనఁబడెడిన్ గ్రమక్రమముగాను గ్రహంబులు భాసురాకృతిన్.

["సౌఖ్యమె" అర్థాంతరమున "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను సూక్తిని గమనింపవలెను.]

చ. కలకల నెల్లరుల్లసిల గబ్బున హ్లాదముఁ గొల్పుచుండి తా
నలఘునమైన తేజము నొకప్పుడు చూపనిరాజునందె పో
చులకగ మచ్చగానఁబడుఁ జూడుఁడటంచును బోధసేయుచున్
లలితకలంకితోఁచె గగనంబున సర్వకళాప్రపూర్ణుఁడై.

["సర్వకళాప్రపూర్ణుఁడై" అర్థాంతరమున "బోధించు" అనుక్రియపట్టున ఈ విశేషణము సాభిప్రాయమైయున్నదని గ్రహింపవలెను.]

తే. గీ. మచ్చపడకయె మనవలె మచ్చపడిన, పిదప నట్టిట్టు వంకలు పెట్టికొనుచు
నెంతకాలము తిరుగుదు రిలను మనుజు, లంచు బోధించెను గలంకి స్వానుభవము.

ఉ. ఘోరతరప్రతాపమును గొల్పు నినుం డతఁ డస్తమించి త
చ్చారుకళాప్రపూర్ణుఁడగు చల్లనిరా జుదయింప నంతయున్
భోరు సెలంగఁ బొంగుచు సముద్రుఁడు దద్దయు మిన్నుముట్టఁ దా
నారయ లోకధర్మమది యచ్చెరువందఁగనేల దానికిన్.

ఉ. చండితనంబు మీఁఱగను చయ్యన నెవ్వరియడ్డులేక వే
ఱొండును బాటులేక మఱి యోటమి యించుకయైన నెప్డు లే
కుండఁగఁ గర్ణరంధ్రములు హోరునఁ జిల్లులుపోవుచుండఁ జీ
రండల దృశ్యరూపమొనరన్ విహరించెడి రాత్రియంతయున్.

["హోరున" అర్థాంతరమున "తమ దుశ్చరిత్రవలన గలిగిన ఘోషవలన" అని గ్రహింపవలెను.]



చెన్నపురి నేపియరుపార్కులో జరిగిన సభయందు మహాత్మునకు స్వాగతపత్ర సమర్పణము



చెన్నపురి తిరువళ్లిక్కేణిలో నాలువదగు స్త్రీల ఖాదీప్రదర్శనము—మహాత్మునకు స్వాగతము.

క్రౌన్‌ఫోటో బ్యూరో, చెన్నపురి.

ఉ. అరుదుగ పీర్లపండుగుకు నంతట జేగురుపూసి తోడుతన్
విరివిగ నెల్లపట్టులను బెల్లుగఁ జల్లిన వెల్లచుక్కలన్
దురకలగోడమించుగతి తోరపుమిన్ను చెలంగె లెక్కకుం
దొరకని తారకావళులతోడ వెలుంగుచు వింతగొల్పుచున్.

ఉ. శ్రీలనుమించి డెందములు చిందములాడఁగఁ జేరి యొక్కచో
వేలుపులాడుచున్ దిగువపెట్టిన దింపుడుపేకముక్కనా
లాలితమయ్యె మిన్నుకవిరాజ సుకీర్తితచంచదాకృతిన్
వేలకొలందిచుక్క లవిపెల్లుగ వెల్గుచుఁ దేజరిల్లినన్.

క. చంద్రుఁడుమధ్యను దారక, లందందును జంద్రికయును నంతట నలరన్
బృందారకులాడెడి పేకందన రెడి యాసుకరణి గగనము వెలిఁగెన్.

చ. అరుదుగ నాటకంబున మహావిభుపాత్ర ధరించినట్టి యా
సరసనటుండుదాల్చిన ప్రశస్తపుదుస్తుల మించు ముచ్చె బం
గరు నగిషీలనొప్పు ఘనకంచుకమో యన నేత్రపర్వమై
కరము వెలింగె మిన్న దియగణ్యలసత్తరచారుతారలన్.

మ. జలమై చంద్రికయొప్పఁ బూర్ణవిలసచ్చంద్రుండు లోమట్టునై
యలరం గానలయంచులందుఁ గననౌ నానీటిబొట్లట్లు చు
క్కలు నెంతేనియుఁ జెన్నుమీఱఁగను నాకాశంబుచూడన్ మహా
కలశంబై గనుపట్టె నుజ్జ్వలతరాకారంబు శోభిల్లఁగన్.

మ. తగదర్పారులయప్డు భాసురహయోత్తంసంబు మీఁదం ధగ
ద్ధగితంబై కమనీయమై ప్రవిలసద్రత్నావళీ చిత్రితం
బగు పల్యాణమనంగ నంబరము నేత్రానందముం గొల్పుచున్
బొగడన్ మించెను వేలులక్షలగుచున్ జుక్కల్ విజృంభించినన్.

క. మినుకుమినుక్కని చుక్కలు, ఘనముగ నుదయింప మిన్ను కరము వెలింగెన్
తనకావలి దెస దీపము, తనరగఁ జూపట్టు వెదుఱుతడకయనంగన్.

మ. అలరన్ గోడయి పేకముక్కయి భళా! యాకంచుకంబై లసత్
కలశంబై యలజీనునై తడకయై తానిట్టులేపట్టునన్
పలురూపంబుల నల్లమానిసికిఁ గన్పట్టెన్ నభం బెన్నఁగా
నలభూతంబుల చిత్రమే యిదిగదా యాశ్చర్యమింకేటికిన్.

["ఆశ్చర్య మింకేటికిన్" "ఇంకను ఈరీతిని ఎంతైనను వర్ణింపవచ్చును. కాని యది యాశ్చర్యము కా"దని భావము.]

N. B. శుక్లపక్షరాత్రులును కృష్ణపక్షరాత్రులును యథాయోగముగ వర్ణింపఁబడినవి. సహృదయులు పక్షద్వయైక్యవిరోధమును శంకింపరాదు.




పాలపర్తి ఆంజనేయులు గారు

౧

జగపతిరాజు గొప్పశ్రీమంతుఁడు. విశాఖపట్టణ మంతటిలో వీరికిఁ గల పలుకుబడి మఱియొకరికి లేదు. జమీందారిపాయఁగ నివసించును. ఈయనకు జమీందా రను బిరుదొకటి లేదు గాని సాలుకు పాతిక ముప్పదివేలు వచ్చు గొప్పయెస్టేటుమాత్ర మున్నది. విశాఖపట్టణము బీచిరోడ్డుమీఁద నొక విశాలమైన యారామముమధ్య వీరిమేడ గలదు. ఆతోఁట నానావిధఫలపుష్పశోభితములయిన తరులతాగుల్మాదులతోడను, నిర్మలసలిలపూరితమయిన తటాకముచేతను విరాజిల్లుచు వినోదవిహారము సల్పువిలాసవంతులను, చిత్తశాంతి నభిలషించు విరాగులను, నాహ్వానించుచుండెను. ఆమేడ ముందుభాగములో నొక విశాలమయిన చావడిలో యెస్టేటు ఠాణేదారులు, గుమస్తాలు, పారాజవానులు గలరు. అంతర్మహాలునందు జగపతిరాజుగారు కాపుర ముండియుండిరి. వీరెంత విద్యావంతులయినను, నవనాగరికులయినను పూర్వాచారముల నిసుమంతయైనను వదలలేదు. గృహమర్యాదలను, కులకట్టుబాటులను బహుజాగ్రతతో కనిపెట్టుచుందురు. వీరి కిద్దరు కొమార్తెలు మాత్రము గలరు. వారిమీఁద జగపతిరాజున కత్యంతప్రేమ. వారు క్రిందనడచిన పాదములు కందిపోవునని యెంచును. పుత్రులు లేనికారణమున వారిని మిక్కిలి గారాబముతో నరచేతులలోఁ బెంచుచుండెను. జగపతిరాజునకు తనపుత్రికల నత్తవారింటికిఁ బంపుట కిష్టము లేదు. కావున పెద్దకొమార్తెను, సామాన్యకుటుంబమునకుఁ జెందిన యొక చక్కని చిన్నవాని కిచ్చి వివాహముచేసి యల్లునిఁ గూఁతును నింటఁ బెట్టుకొనెను. రెండవకొమార్తెసహిత మీడేరినపిల్ల యగుటచే వివాహముఁ జేయఁ దొందరపడుచుండెను.

౨

శ్రీమహారాజులుంగారు విజయనగరములోఁ గళాశాలను స్థాపించినప్పటినుండియు క్షత్రియబాలురుసహితము ఉన్నతవిద్యాభ్యాసమున కలవడిరి. భోజనాదివసతుల నేర్పఱచి బాలు రుత్తమవిద్య నార్జించుటకు శ్రీరాజుగారు ప్రోత్సాహ మొసంగుచుండిరి.

విజయనగరమున కనతిదూరమున చిట్టివలస యను గ్రామమున్నది. రామరాజు చాల బీదవాఁడయినను గ్రామములో మర్యాదగలవాఁడను వాసిఁగాంచియున్నాఁడు. వంగసమును బట్టిచూడ రామరాజొకప్పుడు

బ్రతికి చెడినవాఁడని తెలియుచున్నది. ఆయనకు పదియెకరముల మెట్టభూమిమాత్రము గలదు. ఒక్కఁడే కుమారుఁడు. నరసింహరాజు మంచి అందమయిన చిన్నవాఁడు. బుద్ధిమంతుఁడు. తెలివితేటలు గలవాఁడు. చిన్ననాఁటనుండి విద్యయందాసక్తిగలవాఁడగుటచే నెటులనో తండ్రిని ఒప్పించి తోడిబ్రాహ్మణ బాలురతోపాటు విజయనగరము వెళ్లి కాలేజిలో విద్యనభ్యసించుచుండెను. విద్యార్థులందఱిలో రూపమందేకాక గుణసంపదయందును నరసింహరాజు మిన్నయై యుండెను. మెట్రిక్యులేషన్ పరీక్షలో పిల్లలందఱిలోను మొదటివాఁడుగఁ గృతార్థుఁడగుటచే నుత్తమవిద్యా గరచుటకుఁ దగిన వసతి లేకపోయినను, ఉపాధ్యాయులయొక్కయు, తోడిస్నేహితుల యొక్కయు, ప్రోత్సాహముచేత కాలేజితరగతిలోఁ బ్రవేశించెను. ఇంతవఱకుఁ జెప్పించిన చదువుకే తండ్రి అప్పుచేయవలసివచ్చెను. కాని, పిల్లవాఁడక్కరకువచ్చి గొప్పయుద్యోగము చేయునను గంపెఁడాశతో అప్పులోనప్పని ఋణముచేసి ప్రతినెల కావలసిన పైకము పంపుచుండెను. ఇట్లుండ ఎఫ్. ఎ. పరీక్షకాకపూర్వమె తండ్రి స్వర్గస్థుఁ డాయెను. తండ్రిచనిపోయిన దుఃఖమొకవంకను, ముందుగతిదోఁపక యొకవంకను గ్రుంగుచున్నను సహజ ప్రతిభాశాలియగుటచేఁ బరీక్షలో జయమొందెను. కాని పరీక్షలో జయమొందితినని యానందించుట కతఁడు నోఁచుకొనలేదు. ముందుచేయునది తోఁపక యతఁడు కుందుచుండెను. బి. ఎ. చదువవలెననెడియాశయొకవంకను, లేమియొకవైపునను నతనిని బాధింపఁజొచ్చెను. కాని యతనితల్లి యతనికి ధైర్యముఁ జెప్పి యెచటనో సొమ్ముఁ దెచ్చియిచ్చి అతనిని విజయనగరము పంపివేసెను.

3

'ప్రణబాధకన్న ఋణబాధ ఎక్కు' వనుట లోకవిదితముగదా! సీతమ్మ కుమారుని విద్యకై పలుపాట్లు పడవలసివచ్చెను. పొలముల పరులపాలుచేసి మృగతృష్ణంబోలు విజాతీయవిద్యకై నగరసీమల కెగఁబ్రాకు జానపదుల దుస్థితి నేఁడు మనము కన్నులారఁ గాంచుచున్నాము. ఋణదాతలు సీతమ్మను బాధింపఁజొచ్చిరి. ఈబాధ కోర్వఁజాలక కుమారునితోఁ దనయవస్థను జెప్పక, పొలమమ్మిన యెక్కువసొమ్ము వచ్చుననిమాత్రము చెప్పి పొలమమ్ముటకు నిశ్చయించెను. అప్పులు తీర్చినది. శేషించిన ధనముతోఁ బిల్లవానిచదువు ప్రథమవత్సరమైనను గడచునట్లులేదు. ఆమె మాత్రము ఇరుగుపొరుగువారికిఁ బాలుపెరుగమ్మి గుట్టుగ జీవయాత్ర గడుపుచుండెను.

౪

జగపతిరాజుకొమార్తెకు వివాహముచేయవలెనని తొందరపడుచుండెను. ప్రేమావతికి షోడశవర్షములు నిండి సంప్రాప్తయౌవనయైనది. మేలిమిబంగారును మించిన దేహకాంతిచేతను, పొడుగు పొట్టి కాని దేహపరిమాణముచేతను ఆమెతనూవిలాసము ఒప్పియుండెను. సిందుచందురునివంటి మోము, విశాల నయనములు, వంకరలు దిరిగిన ముంగురులు,

తుమ్మెదరెక్కల ధిక్కరించు నిడుదలయిన నల్లని కురులు, ఆమెలావణ్యము, చూచు వారల మోహింపఁజేయుచుండెను. యౌవనవతులు యువకులఁ బెండ్లాడఁగోరుట ప్రకృతి ధర్మము. తల్లిదండ్రులు, ధనము, ప్రసాదింపగల సమస్తసౌఖ్యము లామెకుఁ గరతలామలకములైనను ఆమె యేలకో చింతాక్రాంతచిత్తయై అతిభారముతో రోజులు పుచ్చుచుండెను. అట్లగుట, తల్లిదండ్రు లామెకుఁ దగిన వరునిఁ దెచ్చి పరిణయముచేయ యత్నించుచుండిరి.

సాటివారలలో యుక్తవయస్కులైన బాలు రుండినను జగపతిరాజు నభీష్టముఁ జెల్లించువా రెవరును లేకుండిరి. శ్రీమంతులు తమ తనయుల నత్తవారింట నిల్లరిక ముంచ నిష్టపడరు. తన ముద్దుతనయ నత్తవారింటికిఁ బంపుట గర్హ్యముగా జగపతిరాజుకుఁ దోఁచుచుండెను. సంబంధ మెక్కడను కుదురలేదు. కర్తవ్యము దోఁపక ఆందోళితహృదయుఁడై విచారించుచుండెను. ఇట్లుండ నొకనాఁడు విజయనగరముకాలేజి ప్రిన్సిపాలుగారియొద్దనుండి ఉత్తరము వచ్చెను. ఆయుత్తరమువిప్పి చూచుకొని సంతోషచిత్తుఁడై భార్యతోఁ జెప్పి వెంటనే విజయనగరము బయలుదేరి వెళ్లెను. రైలు దిగి జగపతిరాజు సరాసరి ప్రిన్సిపాలుగారి ఆఫీసుగదిలోనికి వెళ్లెను. శ్రీరామావతారముగారు జగపతిరాజుకుఁ జిరపరిచితులు. కుశలప్రశ్నలైనపిమ్మట తమదృష్టిలోనున్న బాలురఁ గూర్చి రామావతారముగారు సవిస్తరముగా ముచ్చటించిరి. వారిలో జగపతిరాజుకోరికల ననుసరించి నరసింహరాజు అన్నివిధములఁ దగియుండునని వారు సలహానిచ్చిరి. జగపతిరాజు పిల్లవానినిజూడఁ గుతూహలము గలవాఁడయి వానిని బిలుపింపఁ గోరెను. నరసింహరాజు వచ్చి ప్రిన్సిపాలుగారికి నమస్కరించి నిలుచుండెను. జగపతిరాజు వానిని బ్రక్కనున్న బల్లపైఁ గూర్చుండఁగోరెను.

నరసింహరాజు కప్పటికి ఇరువదియొక్క సంవత్సరములు. మామూలు గోరంచుపంచ, షర్టు, ఉత్తరీయము మాత్రమప్పు డతను ధరించియుండెను. అవియుఁ గొంతవఱకు మాసియుండెను. ఆమలినాంబరములనుండి యతని శరీరకాంతి నివురుకప్పిన నిప్పువలె అచ్చటచ్చట తళతళలాడుచుండెను. విశాలమైన ఫాలము, కలువరేకులవంటి కన్నుదోయి, ఉంగరములు దిరిగిన ముంగురులు, యతని ధీప్రభావమును, అందమును బ్రస్ఫుటము చేయుచుండెను. నరసింహరాజు ముఖలక్షణముల నవలోకించి భ్రమచెంది జగపతిరాజు రెప్పవాల్పక అట్టె చూచుచుండెను. నరసింహరాజు సందర్భమును గ్రహించినవాఁడై సిగ్గుచేఁ దలవంచుకొని కూర్చుండెను.

రామా: అబ్బాయి! మీదే వూరు?

నర: మాది చిట్టివలస.

రామ: మీనాయనగారి పేరేమి?

నర: రామరాజుగారు.

నరసింహరాజునుగూర్చి రామావతారముగారు అంతయు నెఱిఁగినవారగుటచే ఆప్రశంస కట్టిపెట్టి నరసింహరాజును సంబోధించి 'జగపతిరాజుగారు గొప్పశ్రీమంతులు, పేరుప్రతి

[illegible] [illegible] [illegible] వివాహము చేయవలెనని కోరుచున్నారు. నీయభిప్రాయ మేమి?

నరసింహరాజు సిగ్గుపడుచు "నాకేం తెలుస్తుంది. మా అమ్మగారు పెద్దది ఉన్నది. ఆమె యిష్ట ప్రకారము జరుగవలసి ఉంటుంది. నాదేమి లేదు." అని జవాబు చెప్పెను. అంతట నరసింహరాజు వెళ్లిపోయెను.

జగ: రామావతారంగారూ! మీరు మిత్రులైనందుకు నాకీసంబంధము కుదిర్చిపెట్టవలె. పిల్లవాడిని చూస్తే చక్కగా ఉన్నాడు. నాకు విడిచిపెట్ట బుద్ధి పుట్టలేదు. వాళ్లు బీదవాళ్లయినప్పటికి వంశము మంచిదే. వారి బీదతనంతో మనకేమి? పిల్లవాడు మనయింట్లోనే వుంటాడుగా. ఇది మంచి పోనీకండి.

రామ: పిల్లవాడు మా కాలేజి పిల్లలందరిలో [illegible]. బీదవాడయినను నీచగుణ [illegible]. మీగృహము నలంకరించదగినవాడే. కాని చదివేది ఇంగ్లీషు. మన ఆచారాలు, పద్ధతులు వచ్చుతాయా, తీరా మీయింట్లో యిల్లరికము ఉంటాడో ఉండడో, అదే చిక్కుగా వున్నది.

జగ: 'ధనమూల మిదంజగత్.' మీకు తెలియని దేమున్నది? పట్నముపంపి ఎం. ఎ. చెప్పిస్తాను. అతనికి ఎంతకావలెనంటె అంత ఖర్చుపెట్టుకోంటానికి యిస్తాను. అవిషయమున నాకేం భయములేదు. మీరు చేయతగిన సహాయం మాత్రం చేయండి.

రామ: అందుకేమాత్రం అభ్యంతరముండదు.

అంతట జగపతిరాజు ప్రిన్సుపాలుగారి వద్ద సెలవుపుచ్చుకొని విశాఖపట్టణము చేరెను.

౫

జగపతిరాజు భార్యతో జరిగినవృత్తాంత మంతయుఁ జెప్పచు, "పిల్లవాడు మనకొరకే పుట్టినట్లున్నాడు. అందమందుగాని, విద్యయందుగాని, గుణమందుగాని [illegible] తయు లేదు. కడు బీదకుటుంబము మాత్రమగును. నిజముగా ఆయింట [illegible] కాడు" అని పలికెను.

భార్య: వాళ్లు బీదవాళ్లయితే మనకేం, [illegible] వంతులైతే మనకేం? మనపిల్ల వెళ్లి వాళ్ల గుడిసెల్లో కాపురము చేయబోతుందా? మనము వెళ్లి విందులు [illegible] న్నామా? వస్తారు; నాలుగుమెతుకులు తిని మనయింట్లోనే పడివుంటారు. ఆలస్యమెందుకు? మన పురోహితుణ్ణి గుమస్తాను చిట్టివలస పంపించండి.

జగ: అవును; నీవన్నమాట నిజమే. అలాగే పంపుతాను.

౬

గుమస్తా పురోహితుడు యిద్దరు చిట్టివలస వెళ్లిరి. రామరాజుగారి యిల్లు పెద్దవీధినే ఉన్నది. వారి ఇంటిగుర్తు తెలుసుకొని వీరిద్దరు వెళ్లి వారియింటి అరుగుమీదనే కూర్చుండఁ బోయిరి. వారెవరో యెందుకు వచ్చిరో నరసింహరాజు తల్లి సీతమ్మకుఁ దెలి

యదు. అయినను గృహస్థధర్మము ననుసరించి మర్యాదచేసెను.

సీతమ్మ: శాస్త్రుల్లుగారూ, మన దేగ్రామము? ఏంపనిమీాద దయచేశారు.

పురో: మాది విశాఖపట్టణము. రామరాజుగారి యిల్లు యిదేనా?

సీతమ్మ: అవును. ఇదే. మమ్మన్ని మీారేం యెరిగివున్నారు?

పురో: ఎఱుగకేంలెండి. రామరాజుగారుచాల మంచివారు; నిదానస్థులు. బ్రాహ్మణభక్తి గలవారు. మంచివంశం. మీాకు పిల్లలెంత మందమ్మా?

సీతమ్మ: నాకు ఒక్కడే పిల్లడు బాబు. విజయనగరంలో చదువుతున్నాడు.

పురో: వివాహమయిందా?

సీతమ్మ: చదువయితేగాని చేసుకోనన్నాడు బాబుగారు. ఆలాగే కానిమ్మని వూరుకున్నాను.

పురో: చదువుకుంటూంటే పెండ్లి చేసుకోకూడదా? ముద్దుముచ్చటలు చిన్నతనంలో చూడాలిగాని, గడ్డంమీాసాలు వచ్చిన యేంబాగుంటుంది?

సీతమ్మ: పెద్దదాన్ని నాకు ముద్దుముచ్చట చూచుకోవాలెననివుంటే మాత్రం బీదవాళ్లకు పిల్లనిమెవరిస్తారు?

గుమాస్తా: సంబంధమువుంటే చేస్తారా?

సీతమ్మ: చేస్తారా అంటె నేనేంచేస్తా బాబుగారు. డబ్బా? దుగ్గానా? కాస్తకూ స్తతో అవుతుందా? లేదా అంటె మంగళసూత్రం చేయించి మూాడుముళ్లు అప్పోసాప్పో చేసి వేయించగలను గాని ఇంకేం చేస్తాను. ఆరోజువచ్చి నేనంతవఱకు బ్రతికివుంటే మాట గద!

గుమాస్తా: మీారు బాగావుండగానే చేసి కళ్లతో చూచి సంతోషిస్తే మంచిది. మీాకేం కష్టంగాని, డబ్బుఖర్చుగాని లేకుండా గొప్పయింటిపిల్లను తెచ్చి పెళ్లి చేసేభారం నాది. మీాకదంతా ఎందుకు? మీాకిష్టమేనా?

సీతమ్మ: ఇష్టంలేకేం బాబుగారు. ఎక్కడైనా సంబంధం ఉన్నదా?

పురో: సంబంధం లేకేం. కాని మీారొక్క సంగతికి తలవూగిస్తే చాలు. పిల్ల




సీతమ్మ: ఇష్టంలేకేం బాబుగారు. ఎక్కడైనా సంబంధం ఉన్నదా?

గొప్పయింటిపిల్ల. అతిసుకుమారంగా, గారాబంగా జమీందారీపాయగా పెరిగింది. పిల్లను యిచటికి పంపటానికి యిష్టపడరు. పిల్లవాడినే తమవద్ద వుంచుకొని పెద్దచదువులు చెప్పించి ఆస్తికొంత ముట్టచెప్పాలని వున్నది. ఈపద్ధతి మీకిష్టమేనా?

సీతమ్మ: ఏంచెప్పను బాబు. నాకు ఒక్కపిల్లవాడు. వాడు కండ్లముందర లేకపోతే నాకేం తోస్తుంది. నేనేంకష్టాలుపడ్డావాడు సుఖంగా వుండాలనే. అయినా మేము సామాన్యులం. అంతగొప్పవారితో మాకు సంబంధమేమిటి? అది ఎట్లా పొసగుతుంది.

గుమాస్తా: అదంతా మీకేల? కుదిర్చే భారం మాది. కొడుకును కోడల్ని చూచుకొంటూ మీరుకూడా అచటనే వుండవచ్చు. నేజెప్పినసంగతి మాత్రము మీకిష్టమేనా?

సీతమ్మ: నాయిష్టానికేం లేండి. ఎక్కడైనా వాడు సుఖంగా వున్నాడంటె చాలు. అయితె ఎవరిపిల్ల బాబుగారూ!

పురో: విశాఖపట్టణంలో జగపతిరాజుగారి రెండవకొమార్తె. పదహారు సంవత్సరాలు. పిల్ల చక్కని చుక్క. మంచి వంగసం. ఈమాసంలో బహుళంలో ముహూర్తం. మేము అందుకొఱకే వచ్చినాము. ఆయన వారి గుమాస్తా. నేను వారి పురోహితుణ్ణి. మారాజుగారు విజయనగరంవెళ్లి పిల్లవాణ్ణిచూచి మాట్లాడినారు. ఇక మీరు 'సరె' నంటె అయినదన్నమాటే.

నరసింహారాజు తల్లి ఆశ్చర్యపడి సిగ్గుచేగడపదాటి లోనికివెళ్లి తలుపుచాటున నిలువఁబడెను.

పురో: అమ్మా, మీరుపెద్దలు. మేము బ్రాహ్మణులము. మీయిండ్లకు రానివారమా? మీయుద్దేశమేమి?

సీతమ్మ: చెప్పరేం బాబు; నేనింకా యెవరో దారినపొయ్యేవారని అనుకొన్నాను. ఇంతలెక్కజరిగిందాక నేనుమాత్రం వేరే యేంచెప్పతాను. పిల్లవాడికి కబురు పంపి మీకు తెలుపుతాను.

గుమాస్తా: ఇంక పిల్లవాడికి కబురెందుకు? మీఅబ్బాయి 'మాఅమ్మగారి యిష్ట'మని మారాజుగారితో చెప్పినాడు. మీపురోహితుణ్ణి పిలిపించండి తాంబూలాలు పుచ్చుకోవచ్చును.

అంతట నరసింహారాజు తల్లి పురోహితునకుఁ గబురుపంపి తాంబూలములు పుచ్చుకొనెను. ఆరోజు పురోహితుని గృహముననే విందు లారగించి వారిద్దరును మఱునాఁడు విశాఖపట్టణముచేరి శుభవార్త యజమానుల కెఱుకపరచి బహుమానములఁ బడసిరి.

౭

రూపసియు, విద్యావంతుఁడును, సుగుణఖనియు, నైన యల్లుఁడు దొఱకినాఁడను సంతసమున జగపతిరాజు వివాహప్రయత్నములనతివిరివిగాఁ జేయుచుండెను. గృహప్రాంగణమున విశాలమైన పందిళ్లువేయించెను. పందిళ్లకుఁగట్టఁబడిన ధవళవసనముల తెల్లఁదనము

సుధాకరునిధావళ్యమునుధిక్కరించుచుండెను. పత్ర పుష్పపతాకములచే నావరణమంత యు నలంకరింపబడెను. చిత్రకారులు గృహ మునంతయు నలంకరించి శోభాయమానము గఁజేసిరి. జగపతిరాజు బంధువులు మిత్రపరివా ర సహితముగ విచ్చేసిరి. నరసింహరాజునకు బంధుకోటి అంతగ లేదు. అందుచేతఁ దోడి సహాధ్యాయులను సహితము కొంత మందిని దీసికొనివచ్చెను. వియ్యాలవారు ఎక్కువ మంది లేనందున విడిదికిఁ బ్రత్యేకముగ నే ర్పాటులేమియు జరుగలేదు.

వధూవరులు మంగళస్నానము లాచరిం చి చిత్రవిచిత్రముగ గనులపండువుగ నలంకరిం పఁబడిన వివాహవేదికపై నాసీనులైరి. మంగళ తూర్యనినాదములు మిన్నుముట్ట, విప్రు లాశీ ర్వాదములు చేయ జగపతిరాజు నరసింహ రాజు పాదములఁగడిగి కన్యాదానముచేసి పాణి గ్రహణమహోత్సవము జరిపించెను.

౮

వివాహానంతరము అల్లుని కర్చుకై జగ పతిరాజు ప్రతినెల యేబదిరూపాయలు పంపు చుండెను. అందుఁగొంతపైకము మిగిల్చి నర సింహరాజు తల్లికిఁబంపుచుండెను. నెలకొక్క పర్యాయమైనను నరసింహరాజు తల్లినిజూచి వచ్చెడివాఁడు. దసరా సంక్రాంతి సెలవులకు మాత్రము అత్తవారింటికి వెళ్లెను బి. ఎ. యూనివర్సిటీపరీక్ష యైనవెంటనే స్వగ్రామము నకు వెళ్లి తల్లితోఁ గొన్నిదినములు గడసి తర్వాత అత్తవారి యింటికి వెళ్లెను. తల్లిని జూచుటకై నరసింహరాజు తనయల్లుఁడైన పిదపఁగూడ చిట్టివలసకు వెళ్లి యాపూరికొంప లో నుండుట జగపతిరాజు చాల అవమాన ముగా నెంచుచుండెను. ప్రథమములోనే అ భ్యంతరపెట్టిన బాగుండదని ఓపికతోనుండెను.

మేనెలలో విద్యార్థులందఱు పరీక్షాఫలిత ములకై చకోరపక్షులవలె నెదురుచూచు చుండిరి. ప్రతిదినము విద్యార్థులు పోస్టాఫీసుకు వెళ్లి పేపర్లు చింపి యాతురతతో నంబర్లకై వెదకుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు నరసింహ రాజునకు బట్టనమునుండి తంతివార్త వచ్చెను. తంతి యెచటనుండి వచ్చినదా యని యింటి లోనివారందఱు భీతచిత్తులై తత్తరపడుచుం డిరి. ఇంతలో నరసింహరాజు మేడ దిగివచ్చి కెలిగ్రాము చింపి చూచి తాను పరీక్షలో రాజధానిలో ప్రథముడుగాఁ గృతార్థుఁడైనట్లు తనప్రొఫెసరు తంతి నంపినట్లు తెలియఁజేయ నందఱును సంతోషమునఁ దేలియాడిరి. వెనుక నుండి వచ్చుచున్న ప్రేమావతి యావర్తమా నమువిని ప్రఫుల్లవదనయై భర్తతోఁగలిసి మేడ మీఁదికి వెళ్లిపోయెను. పిమ్మట లడ్డూలను దెప్పించి అందరికిని ప్రేమావతి స్వయముగఁ పంచిపెట్టెను.

నరసింహరాజు విశాఖపట్టణమునకు వచ్చి నెలరోజులకుఁబైన యైనది. తానుపరీక్షలో జ యమొందినసంగతినరసింహరాజువెంటనేతల్లికి ఉత్తరము వ్రాసెను. అతను స్వయముగ వెళ్లి తల్లి యానందమును ఇనుమడింపఁజేసి తానును యానంద మొంద నభిలషించుచుండెను. కాని ఈసంతోషసమయమునఁ దానొక్కఁడే పోవు టకన్న భార్యనుగూడఁ దీసికొనివెళ్లినఁ దల్లి

మేరలేని యానందవార్ధిమునుంగునని యోచించెను. వివాహమైనపిదప ప్రేమావతి అత్తవారిల్లుత్రొక్కి యెఱుఁగదు. నరసింహరాజు తల్లియు మఱల వియ్యాలవారి యింటికి వచ్చియుండలేదు. ఈకతమున భార్యను దప్పక తీసికొని వెళ్లవలెనను గట్టిఅభిలాష మనమునఁ బాదుకొనెను. ఇందలి కష్టనిష్ఠురముల నాతఁడారయకపోలేదు. కాని నాలుగురోజులు చూచి వచ్చుటకు వెళ్లినంతమాత్రమున నెట్టి లోపము, గౌరవహాని కలుగఁజాలదని యాతఁడెంచెను. ఎట్టకేలకు భోజనానంతరము మామగారితో నీప్రస్తావనఁ దెచ్చుటకు నిశ్చయించెను.

జగపతిరాజు భోజనముచేసి విశ్రాంతిగఁ దాంబూలము వేసికొనుచుండెను. నరసింహరాజు యిష్టాగోష్ఠి కొంతయైన పిమ్మట, కంపితహృదయముతో "మామగారూ! నేను పరీక్షు అయినపిమ్మట మాఅమ్మగారివద్దకు వెళ్లియుండలేదు. ఈసంతోషసమయమున నేనొక్కడనేకాక మీకొమార్తెను సహితము దీసికొనివెళ్లి నాలుగురోజులు మాఅమ్మగారితో గడపి రావలెనని యున్నది." అని సవినయముగఁ బలికెను. ఈమాటవినినతోడనే జగపతిరాజు కోఁచూపుతో నొక్కపర్యాయము నరసింహరాజును గ్రిందినుండి మీఁదికిఁజూచి "ఏమి! మాపిల్లనుమీవూరుతీసికొని వెళ్లుతావు? ఇట్టి తలబిరుసుమాటల నిక నావద్ద మాటాడకుము. మాపిల్లను మీయింటికి పంపేయెడల నిన్ను యిక్కడ ఉంచుకొను టెందులకు?" అని కోపముతో గర్జించెను.



"ఏమి! మాపిల్లను మీవూరు తీసికొనివెళ్లుతావు?"

నర: "మీకు చాలకోపమువచ్చినది. నా వివాహమైన పిమ్మట మాఅమ్మగారొక్క పర్యాయమైనను కోడలిని చూచియుండ లేదు. అందువలననే పంపమని కోరియుంటి?" అని శాంతముగ పలికెను.

జగపతిరాజు వినట్లు నిర్లక్ష్యభావముతో నూరకుండెను. నరసింహరాజు తనకుఁ గలిగిన పరిభవమునకుఁ గుందుచు నటనుండి లేచి వెళ్లిపోయెను.

౯

రాత్రి శయనగృహమున నరసింహరాజు మోమున వన్నెదక్కి విచారగ్రస్తుఁడై కుర్చీలోఁ గూర్చుండియుండెను. ప్రేమావతి పూర్వోక్తమగు నుదంతము నంతను వినియేయుండెను.

గదివాకిటనుండియే భర్తచింతాక్రాంతచిత్తుఁడై యుండుటఁజూచి మొగము చిట్లించుకొనెను. ప్రేమావతి సహితము తల్లిదండ్రులవలెనె తా నత్తవారింటికిఁబోవనవసరములేదనియెంచు చుండెను. సమస్తభోగము లిచట జరుగు చుండ వాని నన్నిటిని విడిచిపెట్టి మట్టికొంప లలో నేల మ్రగ్గవలెనని యామెతలంపు. తాను వచ్చునప్పటికి వాడుమొగము పెట్టుకొని కూర్చుండియున్న నరసింహరాజును జూచి సహింపఁజాలకపోయెను. నరసింహరాజు మనో గతవ్యాకులత నణుమాత్రమైనను ఆమె గ్ర హింపలేదు. అంతియెకాదు! ఆగ్రహము సహి తము వచ్చెను. భార్యను సంతోషపెట్టుటయె భర్తకు ముఖ్యకర్తవ్యమని యామె అభిప్రాయ ము. అంతట బిరబిర భర్తయొద్దకువెళ్లి "నన్ను చిట్టివలసకు బంపనన్నారనియేనా కొంపమునిగి పోయినట్లు విచారించుచున్నారు" అని కోప ముతోఁ బలికెను.

"అవును. కొంతవఱకదియె కారణము"

"అయితే, అచట మేడలా, మిద్దెలా, ఎలెక్ట్రిక్ దీపాలా, ఫాన్సా, పంపులా, కోచి బండ్లా, మోటార్లా? ఏమిభాగ్యము బోర్లబడ్డ దని వెళ్లడం?"

"ఎందుకా? మాఅమ్మగారిని చూచు టకు? పెండ్లియై సంవత్సరము దాటిపోయినను ఆమె తిరిగి నిన్నెప్పుడు చూచియుండలేదు. పెద్దతనంలో కోడలు దగ్గరనుండుటకు నోచు కొనకపోయినను చూడవలెననియైన యుం డదా?"



"నన్ను చిట్టివలసకుబంపనన్నారనియేనా కొంప మునిగిపోయినట్లు విచారించుచున్నారు."

"చూచుటకే యైనచో యిచటికే ఆమెరాకూడదా? మానాయనగారెన్ని పర్యాయములు కబురుపంపినను ఆమె రా లేదు. అదేమి గొప్పతనమో? అయినా పల్లెటూళ్లలో పడివుండువారలకు పట్టణ ములకు రాఁగిట్టదు"

"ఆహా! మా అమ్మె యిచటికి రావలె! నీవు మాత్ర మచటికి వెళ్ల కూడదు."

"ఏమి! అంతఆశ్చర్యపడుచున్నారు. దీనిలో వింతయేమున్నది. ఆమెకు యేమి లేదు; మీరు; అంతేకదా! ఆటిసిటిలో మీ అమ్మగారుగాని, మీరుగాని నా కిచట జరిగినట్లు జరిగించగలరా? ఇక నన్నుగూడ ఆ పాడుఊళ్లె కీడ్చుకొని పోవుటెందులకు?"

"నిజమే. నేను ఆమెకొడుకును. ఆమె నాతల్లి. పెద్దతనంలో ఆమెవద్ద కనిపెట్టుకొని యుండి ఆమెరోజులు వెళ్లబుచ్చుట నావిధి. నీవుకూడ వచ్చిన మంచిదని చెప్పినాను".

"మీరుమాత్రము వెళ్లిన ఎన్నిరోజు లుం దురు? బహుశః ఒకవారమో, పదిరోజులో."

"ఓహో! వెళ్లితే అసలే వెళ్లుతాను. లేదా, అథమము మాఅమ్మగారు బ్రతికియు న్నంతవఱకు తిరిగి రాను. అందువల్లనే నీవు కూడ వస్తే బాగావుంటుంది" అని నరసింహ రాజు విషయమంత బయటకుఁ దీయుటకుఁ బలికెను.

"నేను రాను. మీరుకూడ వారంరోజుల కంటె యెక్కువ యుండుటకు వీలులేదు."

"ఓహో! బాగానేవున్నది. నీవు రానూ రావు; నేను వెళ్లనూ కూడదు. ఇది పోలీసు జబర్దస్తీకి మించిపోయిందే. నీవు వస్తే వస్తావు? నేను వెళ్లుటమాత్రము నిశ్చయము."

"మీఅమ్మ మిమ్ముల నిచ్చివేసినప్పుడు యిట్టిషరతు లేమి కోరలేదు. మీరు మా స్వాధీనము. మీఅమ్మ కెట్టిఅధికారం మీ మీదలేదు. గతిలేక యిల్లరికము వచ్చిన తర్వాత యింక హక్కేమిటి? ఇల్లరికము వచ్చిన అల్లుడు ఇంట్లో పెండ్లాము చెప్పు చేతల క్రింద వుండవలె. అతని యిష్టము సాగదు. ఇందుకేనా మా నాన్నగారు మీకొఱకు ఇంత సొమ్ము కర్చుపెట్టినది. ఇందుకేనా చదువు చెప్పించినది? తినియుండలేక అనవసర కలహమునకు కాలు దువ్వుచు న్నారు. అవసరమైతే మీఅమ్మే వచ్చును. ఈపోరిక నేను పడలేను" అని చివాలునలేచి హంసతూలికాతల్పమువలె మెత్తగా నమర్పఁబడిన శయ్యపైఁ బడి నిద్రపోయెను.

తెలిసి తెలియని భార్య ప్రల్లదపుపలుకులు ములుకులై హృదయమున నాట నరసింహ రాజు మారుమాటాడక కదలక మెదలక కుప్ప కూలి కుర్చీలోఁ గూర్చుండెను. ప్రేమావతి నిద్రించినది. నరసింహరాజు మనమున ఝంఝూ మారుతమువలె నొక గొప్పతుపాను వీచుచుం డెను. భావము లుత్తుంగతరంగములవలె లేచి విరిగిపడుచుండెను. "ఆహా! ఏమి! ఐశ్వర్యము మహాభాగ్యమని అందఱు చెప్పెదరు. ఇదెంత వెఱ్ఱిమాట! ఈచిన్నది బంగరుతూగుటుయ్యె లలో చుట్టఁబట్టిగదా యొరులకష్టసుఖముల నించుకైనను గ్రహింపఁజాలకున్నది. చివఱకు తనమేలు తానైనను నెఱుఁగకయున్నది. ధనమె సమస్తమని తలంచుచున్నది. సమస్తసౌఖ్య ములు, తల్లిదండ్రులు, ధనము ప్రసాదింపగల రని యెంచుచున్నది. ధనముగాని, తల్లిదం డ్రులుగాని ప్రసాదింపజాలని దాంపత్యాను రాగరసకుంభమును కాలితోదన్ని బోర్ల ద్రోసికొనుచున్నది. భర్త బానిసీడనియెంచు టచేగదా ఈయబల ప్రణయమహిమను గు ర్తింపజాలకయున్నది! పురుషులు సహితము అహంకారఘూర్వాహుళ్లై స్త్రీలను బానిసలుగా తలంచుచున్నారు. ఇది మనదేశ దౌర్భాగ్య ముగదా! స్త్రీపురుషాన్యోన్యత మృగ్యమైన గృహములు గృహములా? అవి శ్మశానములు గావా? అట్టి గృహములు దయ్యాలకొంప

వలె చొచ్చుటకు భీతిగొల్పునుగదా! నిలువ నీడలేని యెడారులుగదా! అవి మనసాంఘిక మూఢాచారముల నిందింపవలెగాని యాబాలి కను నిందించిన ప్రయోజనమేమి?"

"సంపదల దులదూగినంతకాలము దాఃద్ర్యముయొక్క కష్టనిష్ఠురముల నెవరును దెలియజాలరు. ఐశ్వర్యము స్వర్గధామమున కే కాక ప్రేమరాజ్యమునకు సహితము పెట్టని గోడయై యడ్డుదగులుచున్నది. నేనిచటను న్నంతకాలము ప్రణయమహిమనుగాని, దాంపత్యధర్మమునుగాని ఈమె గుర్తెరుంగ జాలదు. అనురాగనిజానుభవము స్వాతంత్ర్యమందే కలదు."

"స్త్రీ పురుషులు పరస్పరము ఒకరికొఱకొకరు ఆత్మసమర్పణము చేసినప్పుడే పార్వతీపరమేశ్వరుల లీలామూర్తి గోచరమగును. బజారునుండి అన్నివస్తువులు దెచ్చినటులనె నన్నును నామామగారామెకు దెచ్చియిచ్చిరి. నేనుసహితము ఆమెయిచ్చవచ్చినటుల నాడుకొనుట కేర్పడిన యాటవస్తువునని యీామెతలచుచున్నది. అందఱు నౌకరులవలెనె నేనును ఆమె యభీష్టముల నెరవేర్చుట కేర్పడిన నౌకరునని యీామెభావించుచున్నది. అంతకన్న నెక్కువఉత్తమాదర్శముగాని,భావముగాని ఆమె మనమున లేదు. కూపస్థమండూకమువలె నాలుగుగోడలమధ్య బెరిగిన ఆడువారలకు ప్రపంచజ్ఞాన ముండజాలదుగదా! ఎట్టి శ్రీమంతులకైనను సామాన్యజనులతో గలసిమెలసి తిరిగి విద్యాబుద్ధులు గఱచిననే ప్రాపంచకజ్ఞాన మలవడును. అంధప్రాయముగ వచ్చుచున్నయాచారముల రూపుమాపినగాని సంఘము నావరించిన యజ్ఞానతిమిరము బాయజాలదు." (త్రుళ్లిపడి లేచి కూర్చుండి) "ఎందుకీ పిచ్చియాలోచనములు! కర్తవ్యమేమి? కేవలమజ్ఞానముచే ఈమె యిట్లు ప్రవర్తించినదనుట నిశ్చయము. కాని, ధనములేనప్పుడుగాని ధనమువిలువ తెలియదు. కావున నేను కొంతకాల మజ్ఞాతవాసము చేసినగాని యీామె సతీధర్మమును గ్రహింపజాలదు. ఇంతటి పరిభవము జరిగినపిమ్మటకూడ నిచట నేనెట్లుండ నేర్తు! ఇంత చదువు జదువుకొని పొట్టపోసికొన జాలనా! లేనిచో నీయింతికై నామానప్రాణముల మంటగలిపి యీామె కూడిగముచేయుచు బడియుండవలెగదా! ఇట్టి నీచపుబ్రతుకు బ్రతుకుటకన్న ప్రాణముల దొఱగిన మేలే యగు. ఏమైనను అగుగాక! నేనిక నీయింట నొక గడియ యైనను నిలువజాలను. నామనము తపించుచున్నది. నాకు శాంతిలేదు. నేపోయెద"నని చెంగున లేచి నిద్రావశయై యున్న ప్రేమావతివంకఁజూచి యొక నిట్టూర్పు విడిచి గుండె రాయిచేసుకొని యర్ధరాత్రి యనియైన జంకక నరసింహరాజు యిలువెడలిపోయెను.

౧౦

తెల్లవారినది. ప్రేమావతి నిద్రనుండి లేచి కనులు నులుముకొని అటునిటు చూచినది. మంచముపై భర్తలేడు. ఆమెకేదియో చెడుకలకూడ వచ్చియుండెను. ఆమెగుండెల లో పెద్దరాయిపడినట్లుండెను. గదిఅంతయు వెదకినది. నరసింహరాజు ఎందును గానరాడు. అప్రయత్నముగానె యీామె కెప్పు

మని కేకవేసెను. ఇంటిలోనివారందఱు పరుగు పరుగున వచ్చిరి. తనభర్త యెందును గానరాఁడని ఆమె యేడ్వసాగెను. ఇల్లువాకిలి అంతయు వెదకిరి. ఇంతలో పాలావాఁడు రాత్రి రెండుజాములకె చిన్నబాబుగారు రేచటికో వెళ్లిరనియు, తాను వెంట వచ్చెదనన్నను వలదని చెప్పిరనియు, ఒకచీటిని మాత్రము తనకిచ్చిరని యు చెప్పి యాచీటిని యిచ్చెను. అది ప్రేమావతికి వ్రాయఁబడినది.

"ప్రియమైన ప్రేమావతికి, శ్రీమంతులకు కష్టనిష్ఠురములుగాని, మంచిచెడ్డలుగాని తెలియవు. ధనమే వారికి సర్వస్వము. బీదలు భాగ్యవంతులతో సాటి కాజాలరు. వారికిని వీరికిని సంబంధబాంధవ్యము లసంభవములు. నీవు భాగ్యవంతుని ముద్దుబిడ్డవు. నేను దరిద్రురాలి తనయుఁడను. నేను నిన్ను బోషింపజాలను. నాకట్టిసమర్థత కలిగినప్పుడె నిన్ను తీసికొని వెళ్లెద. నేనిట నుండి మనజాలను. నాతల్లియే నాకు సర్వస్వము. నాకు కుబేరునిధనమంతయు నిచ్చినను నాతల్లిని విడిచియుండజాలను. దైవము నిన్ననుగ్రహించుగాక."

—నరసింహరాజు.

ప్రేమావతి ఉత్తరము జదువుకొని గ్రుడ్లనీళ్లు కుక్కుకొని, దుఃఖము పొంగిరా గదితలుపులు వేసికొని గతరాత్రివృత్తాంతమును దలఁచుకొని విచారపడసాగెను.

౧౧

దినములు వారములైనవి. వారములు నెలలైనవి. నరసింహరాజు జాడ తెలియరాదు. ప్రేమావతి విచారమునకు మేరలేదు. ఆమె యేకాంతమున నిట్లు తలపోయఁ దొడఁగెను. "నాతండ్రి యాడినమాటలకే నొచ్చుకొని కుందుచున్న నాభర్తను నేను సహితము మూఢురాలనై నోటవచింపరాని పలుకులు పలికితిని. నాకంతమప్పుడు నొక్కుకొనిపోయినను మేలయ్యెడిది గదా! అబ్బా! నేనెట్లు భరింతు నీవియోగము! నాపతి నన్ను విడిచి వెళ్లినప్పుడుగదా సతికి పతియే గతియని తెలియవచ్చినది. గాఢమోహమున దగిలియుంటి నని నేనే యెఱుంగనైతిగా! నాభర్త నాకు వశుడైనా డనుకొంటి గాని నన్నే వశపరచుకొన్న సంగతి తెలియదాయెను. అకటా! నాహృదయము హరించినాడుగదా! స్త్రీకి అనురాగవంతుడైన పతియె ధనము, తల్లియు, తండ్రియు, సర్వము నని నేడుగదా సుబోధకమయ్యె. నాపతి నాచెంతజేరినావలపుల దీర్చుచున్నంతకాలము పతియె



"ప్రేమావతి ఉత్తరము జదువుకొని.........గతరాత్రి వృత్తాంతమును దలఁచుకొని విచారపడసాగెను."

ప్రాణమిత్రమని యెఱుంగనైతి. నాకోర్కెల దీర్చుటకు నియమితుడైన భృత్యుడని యెంచితి. నాహృదయకమలాసనాసీనుడై నహృదయేశు డని గ్రహింపజాలకపోతిని......

"ధనవంతునికి ధనము విలువ దెలియదు. దారిద్ర్య దేవత ఆవహించి నప్పుడుగదా కానిడబ్బు విలువ దెలియును. కన్నతల్లిదండ్రులకన్న నెక్కుడుగ లాలించి ప్రేమించిన భర్తను తూలనాడిన నిర్భాగ్యురాలను. మహాపాపిని. కుమతిని. ధనమదాంధకారమున కన్నులుమూసికొనిపోయిన నాకు సుగుణఖనియై విరాజిల్లు నారాజు ఎట్లు కనుపించును? వివేకహీనురాలనగు నాకేల యాజ్ఞానభాస్కరుడు, తేజోమూర్తి దక్కును? నాపతిలేని హర్మ్యములు వనవాటికలు, యెడారులే గదా! ఇక నాజీవితము దుర్భరము. నేనింతవఱకు కష్ట మను నదియె యెఱుంగను. ఇప్పుడు నాచింత బాపు వారెవరు? ఈధనమంతయుయిప్పుడెందులకును కొఱగాదుగా! నాతల్లిదండ్రులుసహితము నాకు తోడ్పడజాలరుగదా! నాతండ్రి బింకముచే బిఱ్ఱబిగిసి చిట్టివలసనైనను మనిషిని పంపడాయె. పంపియేమి, పంపకేమి? అచటను లేరనియేకదా తెలియవచ్చినది. ఆయన సిరిసంపదల ముందర నాపతి యెందుకును కొరగానివాడుగా నున్నాడు. పట్టెడన్నముకై తమ యింట పడియుండునని యనుకొనినాడు కాబోలు! నాభర్త విద్యావిహీనుడా! చేతగానివాడా! ఆహా! ఏమి, ఈయనమూర్ఖత. ఇప్పడైనను ఆయననుసమాధానపరుప యత్నింప కూడదా! ఎంతటిదురదృష్టవంతురాలను నేను! నేనేల యీభాగ్యవంతుని యింట బుట్టితి! నేనే సామాన్యగృహస్థునియింట జనించినను నాపతి గృహమునకేగి నాయిల్లు నేచక్కబెట్టుకొని సుఖముగ కాపురము చేయుచుండెడి దాననే నాతండ్రి భాగ్యమేగద నన్నింత జేసినది! ఎందుకీయిల్లరికము? ఇది యొక సదాచారమా! భార్యాభర్తల నెడబాపి, అన్యోన్యానురాగమును గగనకుసుమముగ జేయు దీనినేల రూపుమాపరు? సంఘము జడత్వము వహించినది. దీనిని బట్టుకొని నాతల్లితండ్రులు పెనగులాడనేల? నాయింట నేను స్వతంత్రురాలనై కాపురము చేయుచుండిన చూచి సంతోషించరాదా? తమకుండిన పెట్టకూడదా? పంజరమున బంధింపబడిన పిట్టలవలె మా స్వాతంత్ర్యమును, నిర్మలానందమును, చూర్ణీభూతముచేసినపిమ్మట వీరిభాగ్య మాసించువారెవరు? అనుభవింప నోచుకొనని సంపదయేల? అయ్యో, నాతండ్రిని దూరనేల? నేనుమాత్రము చేసినదేమి? విచారనిమగ్నుడైన భర్తనోదార్చుటకు మారుగ అగ్నిహోత్రమున నాజ్యము బోసితి. అనరానిమాట లాడితిని. నేనెంతటిశిక్షకైనను పాత్రురాలనె. అందులకే విధాత నాకిట్టి వియోగదుఃఖమును విధించినాడు. నే నెట్టి క్రూరమతినై సంచరించినను నాపతి నాపై యింకను అనురాగమునె కనబఱచినాడు. ఆయన శాంతమునకు మేరలేదు. నన్ను బోషింప శక్తిగలిగినప్పుడె తీసికొని వెళ్లెదనని వ్రాసినాడు. నన్ను తిరస్కరించలేదు. నన్ను బోషింపగలవాడు, నాకానందమొసగూర్పగలవాడు నాభర్తగాక మఱియె

[illegible] కబురంపినను నాపతి యెచట నున్న [illegible] మాటాడక పోవుదాన. హా! దైవమా! [illegible]దుడుకుదనమునకు దగిన ప్రాయశ్చిత్తము [illegible]వి. ఇకనైనను నాపై కరుణించి నాపతి [illegible] నన్ను జేర్పుము. ఇవియే నీ కనేక ప్రణామములు. నీశరణు చొచ్చినాను. రక్షింపుము" అని పరిపరివిధములఁ బరితపించుచు ప్రేమావతి కాలము పుచ్చుచుండెను. మఱియు మునుపటివలె సకలాభరణభూషితయై విలాసినివలె నుండక సామాన్యస్త్రీవలె జీవితము గడుపుచుండెను. ఆభరణములఁ దీసివైచినది. శయనగృహమందలి యలంకారముల నన్నిటిఁ దీసివేసినది. నౌకరులెంతమంది యున్నను గృహకృత్యముల నెరవేర్చుటకు వారికై యెదురుచూడక యెల్లపనుల నవసరము కలిగినప్పుడెల్ల నామెయే చేయుచుండెను. అన్నిపనులు దల్లి కంటె ముందుగ నామెయే చేయుచుండెను. తల్లి సయితము పనిసందడిని విచారమును మఱచి పోవునేమోయని ఆమెపనుల కడ్డుచెప్పుట లేదు. విశ్రాంతి సమయములందు సద్గ్రంథములతోఁ గాలక్షేపము చేయుచుండెను. ఇదివఱ కెంత భోగియో యిప్పుడంత విరాగియై యామె వారల కాశ్చర్యము గొల్పుచుండె[illegible] వైరాగ్యముఁజూచి తల్లిదండ్రులొక్కొకప్పుడు సంతృప్తిని మఱియొకప్పుడు విచారమును బొందుచుండిరి. చిట్టివలసలో నరసింహరాజు తల్లియు లేదు. ఆమె యెక్కటికి వెళ్ళినదో ఊరివారి కెవ్వరికిఁ దెలియదు.

ప్రథమ భాగము



## తొలి ముద్దు

మునిమాణిక్యం నరసింహారావు, [సాహితీసమితి]

వెచ్చవెచ్చని తొలిముద్దు బెట్టుకొనగ
అతివ నీమోవి నామోవి నంటినపుడె
విరిగిపడునట్లు తిరిగి యీ విశ్వమెల్ల
కప్పివడిపోయె గాఢాంధకార పటలి

శుష్కపత్రంబులవోలె సంక్షోభ మొందు
ఈ ప్రకృతి నెల్ల నొకట దహించివేయ
విడునాల్కలఁ జాపుచు బాడబాగ్ని
అబ్ధినుద్భూతమయ్యె భయావహముగ

క్షోణిపై శైలశిఖరముల్ కుప్పగూల
అతితరంబుగ వీచు ఝంఝానిలమున
వేడిరక్తంబుచిమ్ముట వెట్టినట్లు
హృదయనాళాలు తాపంపురొదలు వెట్టె

యౌవనపు కావిపూత లసందెగిలిన
సంజ, చీకటిచాటున జారిపోవ
జీవనామృతకలశంబు చేతబట్టి
త్రావబోయిన నామేను తల్లడిల్లె

# శ్రీకృష్ణదేవరాయల యఱవమంత్రులు

ఆ. రంగస్వామి సరస్వతి గారు, బి. ఏ.

వైశాఖమాసము 'భారతి'లో "ద్రవిడ వాఙ్మయము : ఆంధ్రులు" అను వ్యాసములో కృష్ణరాయల యాస్థానమున గొంద ఱఱవకవులు పండితులు నుండినది మాత్రమేకాక యతని మంత్రివర్గములో గూడ గొందఱు ద్రవిడు లుండినట్లు సూచింపబడినది. అట్లు సూచించినమంత్రి 'అఱం వళర్త్త మొదలారి.' ఇతనికే 'అఱ మాతుఙ్గ'అనియు,'శేమ్మ్యార్ అఱమాతుఙ్గ' అనియు నామాంతరము లుండినట్లు ద్రవిడవాఙ్మయమునుండి యెత్తి చూపబడెను. అయిన నీమంత్రినిగూర్చి శాసనము లెచ్చటనైన గలవా? కేవల మేదో గ్రంథమునందలి వాక్యముల చేతను, చాటుపద్యముల చేతను మాత్రమే యీయనవిషయము మనకు తెలియుచున్నదా? చాటుపద్యములలో మాత్రము దొఱకిన విషయము చరిత్ర కంత విలువగలది యనదగునా? వెనుకటికాలమువా రాచాటు పద్యముల వ్రాసియుండరాదా? ఇట్టి సంశయములు కొందఱకు పొడమవచ్చును. ఈ విషయమై శాసనములను వెదుకగా నందుకూడ ఈ యఱవమంత్రియొక్క పే-రగపడెను. వాని లోని విషయము గవర్న్మెంటు శాసనపరిశోధక శాఖవారి సాంవత్సరిక నివేదికలో నుండి యిందు వ్రాయుదును. 1921-వ సంవత్సరము శాసనములలో 370-వ నెంబరు శాసన మాతని గూర్చినది. ఈశాసనము దక్షిణార్కాడు జిల్లాలో తిరువది అను ప్రసిద్ధమైన శైవక్షేత్రమందలి వీరట్టానేశ్వరుని యాలయమం దున్నది. ఈశాసనమందు కృష్ణరాయలతండ్రి యగు "నరసానాయకుడు" ఆ శివాలయము లోని యభిషేకమంటపమందు ప్రతిదినమును ఏబది దీపములును, మహామంటపమందు నూరుదీపములును వెలిగించుటకును, 'చాముండి నాచ్చియార్' అను నమ్మవారి గుడియందు నైవేద్యమునకును తిరుమూరుపట్టు సీమలోని ఆలంగాల్కుప్పం అను గ్రామమును దానముచేసినట్లు తెలియుచున్నది. నరసానాయకునికి ఈ శాసనమందు అరంవళర్త్తనయినారు కార్యకర్త్తగా నగుపడుచున్నాడు. ఈశాసనము వికారిసంవత్సరమున వేయించినది. దీనికి సరియగు క్రీస్తు సంవత్సరము 1480 అగును.

ఈ మంత్రియొక్క మఱొక శాసనము 1921-వ సంవత్సరపు 450 నెంబరుగలది. ఇది దక్షిణార్కాడుజిల్లాలోని తిరువెణ్ణెనెల్లూ రను శైవదివ్యదేశ మందలి వీరట్టానేశ్వరుని యాల

యమం దున్నది. మహామండలేశ్వర సాళువ నరసింగరాయల కాలమున ప్లవసంవత్సరమున తిరువదిసీమలోని దేవాలయముల మందలను మేపెడు గొల్లవారు 'శదక్కడమై' అను పన్నును చెల్లింపలేక యితర ప్రదేశములకు వలసపోగా నాపన్ను నరసానాయకుని కార్యకర్తయైన అఱంవళర్తనయనారుయొక్క ప్రార్థనపై తగ్గింపబడెను. ఈ శాసనము ముందుదహరించిన దానిపిదప ప్లవసంవత్సరమున వేయించబడినది. దీనికి సరియగు క్రీస్తు సంవత్సరము **1482** అగును.

ఇంకొకశాసనము 1921 వ సంవత్సరపు 473 నెంబరు గలది. ఇందలిరాజు 'కుమార మల్లికార్జున రాయలు.' ఈరాజు సాళువ నరసింగరాయలును, కృష్ణరాయలతండ్రియగు నరసానాయకుడును తా మస్వతంత్రులు గాక పూర్వము సేనాధిపతిగా నుండినవాడు. ఈశాసనముగూడ తిరువెణ్ణెనెల్లూరునందే దొరకినది. దీనికాలము శాలి 1407 అనగా క్రీ **1485.** ఇందు విజయనగరసామ్రాజ్యమునకు జేరిన వళుదిలంపట్టురాజ్యము అను చిన్న మండలములోని 'కైక్కోళర్' అను సాలె జాతివారికి వారియుత్సవములయందు పల్లకి, శంఖము మొదలగు బిరుదచిహ్నములను కాంచీపురమునందలి కైక్కోళజాతివారివలెనే యుపయోగించునట్లు 'అరంవళర్తనయినారు' శాసనము చేసెను.

ఈమూడునుగాక నీయఱంవళర్తమొదలియారు శాసనములు కొన్ని కలవు. అందొకటి తామ్రశాసనము. ఈతామ్రశాసనము ['Rangachariya's Index') అనుశాసనసూచియందు ఉత్తరార్కాడుజిల్లాలోని నెం 532రు గలది. ఈశాసన మింకను గవర్నమెంటుశాసన శాఖవారిచేతికి వచ్చి పరీక్షింపబడలేదు. ఇది 'తిరువణ్ణామలై' అను నరుణాచలక్షేత్రమున పరెయనాడు మఠమను మఠములో నున్నది. ఈశాసనమునందు 'అలెయరుంకొండతంబిరాను' అను పండారసన్న్యాసికి అరంవళర్త మొదలియారును, 56 దేశములమహాజనులును చేతి యొకమఠము కట్టించినదే కాకయా దేవాలయమందలి యమ్మవారిగుడివిమానము కట్టించి, దేవస్థానమునకును, పండారములకును 'మేలప్పాళయము' అనుగ్రామమును, గ్రామమునందు జరుగు పెండ్లిండ్లయందు ఆరుపణములు, బియ్యము, వస్త్రము నీయవలసిన యేర్పాటు చేయబడినది. ఈశాసనము పూర్ణముగా శోధించిన నింకను విశేష విషయములు బయలువెడలవచ్చును. ఈపై మూడుశాసనములనుండియు నీ'అరంవళర్త మొదలియారు విజయనగర సామ్రాజ్యమున కుమార మల్లికార్జునరాయలకాలము మొదలుకొని సాళువనరసింగరాయలు నరసానాయకుడు ఈరాజుల కాలములలోనుండి కృష్ణరాయలకాలములోగూడ ప్రసిద్ధుడై యుండినట్లు తేలుచున్నది. కృష్ణరాయలకాలమున కీమంత్రి చాల వయసుచెల్లినవాడై యుండవలెను. కనుకనే యీయన పేరు వెనుకకాలమందలి శాసనములలో మన కగుపడకుండుటకు కారణమగునేమో? చాలకాలము విజయ

నగరము 'హంపి'లో నివసించియుండుటచేత నే యీమంత్రికి ద్రవిడవాఙ్మయమున 'అంపి అటమాతుఙ్గ' అని పేరయియుండవలెను.

'తిరువాహూర్' క్షేత్రమునందలి యర్చకుల విషయమై 'తత్త్వప్రకాశుఁడ'ను కవి వ్రాసిన పద్యములో కృష్ణరాయల మంత్రి మతొకనిపేరగపడుచున్నది. [౧] ఇందలి

మరువు పుగళ్ కృష్ణమహారాశరాశై
అరియవడమలైయారాశై,

అను వాక్యములో 'వడమలైయార్' అనునది యింకొకమంత్రిపేరుగాఁ గనుపడుచున్నది. అరవమున 'వడమలై' అనగా నుత్తరపర్వతము. ఈపదము కొన్ని ప్రదేశములలో హిమవత్పర్వతమునకును, కొన్ని ప్రదేశములలో తిరుమల తిరుపతి దేవస్థానమునకు పర్యాయపదముగా వాడబడును. అందుచేత నీ'వడమలయార్' అనుపదము 'తిరుమల' అనుపేరుగల్గిన సాళువతిమ్మరసును గూర్చినదని కొంద ఱభిప్రాయపడిరి. అయిన 'సాళువ తిమ్మ' అని సరిగా లేక యింతటి విళంబిత ప్రతీతికమగు పదమును కవిత్వమర్యాద దెలిసినవా రెవరును ప్రయోగించియుండరు. 'వడమలైయార్' అను పదము దక్షిణదేశములో సాధారణముగా పురుషులకు నామముగానున్నది. ఆపేరుగల్గినమంత్రి యొకడు కృష్ణరాయలయాస్థానిలో నుండవలెను. ఆతనిగూర్చి వాఙ్మయమునందలి యీచాటుగాథగాక వేఱేమైన సమాచారము తెలియునా? శాసనములలో నెందైన నత డుదాహృతుడా? 1921 సంవత్సరము 307 నెంబరుశాసనములో నీమంత్రి పేరగపడుచున్నది. ఈశాసనము చెంగల్పట్టుమండలములోని 'అరశర్కోవిల్' అను గ్రామమున నున్నది. ఇందు అరశర్కోవిల్‌గ్రామమునకు క్రొత్తగావచ్చి కాపురము లేర్పఱచుకొనురయితులకు ఒకసంవత్సరముపన్ను లేకుండనుఅంతకుపిదపవారీయుపన్నులనిర్ణయమును ప్రచురించియున్నది. ఈశాసనములోనిరాజు కృష్ణరాయలే. ఇది భావసంవత్సరము కార్తికమాసము ముప్పదవతేదిన ప్రకటించినది. దీనికి సరియయిన క్రీస్తుసంవత్సరము 1514 15. ఈ శాసనములో కృష్ణదేవరాయులకు దక్షిణదేశరాజప్రతినిధియై 'కరణిక' బిరుదమును వహించిన మంగరసయ పేర్కొనబడినాడు. ఈ మంగరసయ్యకు పుణ్యముగా 'వడమలైయారు' ఈశాసనమును వేయించెనట. కరణికమంగరసయ్యయొక్క శాసనము లనేకము లిదివఱకే మనకు తెలిసియున్నవి. ఇతడును కృష్ణరాయలకుపూర్వము నరసానాయకుడు, వీరనరసింగరాయల కాలములలోకూడ సేనాధిపతిగా నుండెను. కృష్ణరాయలు 'ఆముక్తమాల్యద'లో యామునాచార్యుల రాజనీత్యుపన్యాససందర్భమున మంత్రిగా నొకని నియమించునప్పు డతడు తనతండ్రి తాతలకాలము నుండి వచ్చినవాడుగానుండిన మంచిదని చెప్పినాడు. ఈయుపదేశమును రాయలు తనయాచరణానుభవములనుండి గ్రంథమున జొన్పియుండవలెను. ఇట్లే రాయలయాస్థానమునందలి యితర ప్రసిద్ధపురుషులనుగూర్చి మనకు క్రొత్తగా తెలిసినదాని క్రమేణ ప్రకటించుచుందును.

[౧] ఈతనివిషయము 'ద్రవిడవాఙ్మయము—ఆంధ్రులు' అను వ్యాసమున నీపత్రికలోనే వెనుక చర్చించియున్నాను.

# సార్నాదు స్తూపములు

కో. నరసింహాచారి గారు

సార్నాదు పూర్వమొకప్పు డున్నత స్థితియం దుండిన బౌద్ధుల పుణ్యక్షేత్రమైన పట్టణము. ఇది వారణాసికి 4 మైళ్లు ఉత్తరమున ఘాజిపురమార్గ మున కనతిదూరముననున్నది. ప్రస్తుతము సార్నాదుకు




క. ప్రధాన ఆలయము. గ. జగత్సింగు స్తూపము. చ. స్తూపగర్భిత స్తూపము. జ. స్తూపము.
త. అశోక స్తంభము (భారతి సం.౧, ౧౧ వ సంచిక ౧౩౫ పుట చూ.) ద. ఆలయము. న. ఆలయము.

పోవుటకు వారణాసి- ఘాజీపురమార్గమునుండి చీలి రావలసియున్నను, పూర్వకాలమున వారణాసినుండి సార్నాదుకు తిన్నగా నొకమార్గ ముండినట్లు చిహ్నములు కొన్ని గలవు. ఈపట్టణము సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రమైయుండిన కాలమున నందు గొప్ప 'విహార'ము'ను ఆశ్రమములును, మఠములును, స్తూపములును, దేవాలయములును, గణనాతీతముల గనుండి ప్రాచ్యదేశములగు బర్మా, జపాన్, చీనాదేశములనుండి బౌద్ధయాత్రికులు వచ్చుచు పోవుచుండిన దేశముగా నుండెను. గౌతమబుద్ధుడు తనచే నూతనముగ నెలుంగబడిన మోక్షమార్గమును లోకమునకు వెల్లడిచేసిన ప్రథమప్రదేశమగుటవల్లనే ఈపట్టణము బౌద్ధప్రపంచమున ప్రసిద్ధపుణ్యక్షేత్రమయి వెలింగెను. గౌతముడు గయయందు బోధివృక్షముక్రింద దపమాచరించి బుద్ధుడై వారణాసిజేరి తత్సమీపమున నీసార్నాదునందే ప్రాణిహింసను గర్హించుచు సర్వప్రాణి సమత్వమునుగుణించిన ప్రథమోపన్యాస మొనరించెను. ఇదియే బుద్ధుడు తనమతము స్థాపించిన మొదటిదేశము. ఇదిగాక బుద్ధుని జన్మక్షేత్రమగు 'కపిలవస్తు', తప మాచరించిన 'గయ', నిర్యాణమొందిన 'కుశినగరము' బౌద్ధప్రపంచము లోని యత్యుత్తమ పుణ్యక్షేత్రములు.



ఆలయములలో శంఖమునుంచుటకు పయోగింపబడుచుండినపీఠము

బౌద్ధులు సార్నాదును 'మృగదావ' (కురంగారామ) మనుపేర నెఱిగియుండిరి. బుద్ధుడు ఈమృగారామమున 'న్యాయచక్ర'మును (ప్రథమమతబోధ) ద్రిప్పుటవల్ల నిరుగడల గురంగములు గలచక్రము బౌద్ధుల మతచిహ్నమయి యొప్పుచున్నది. ఈచిహ్నము ప్రస్తుతకాలమునగూడ బౌద్ధులచే ధరింపబడు చున్నది. టిబెటు దేశమున గల బౌద్ధగురువులగు 'డలాయిలామా'లకు గూడ నీ కురంగచక్రచిహ్నమే మతచిహ్నముగా నున్నది.

సార్నాదుబౌద్ధులకే కాక జైనులకును పుణ్యక్షేత్రమై యున్నది. ఇందు జైనుల ఏకాదశతీర్థంకర బిరుదాంకితుడును 'సింహపురి' (సింఘపూర్) వాసుడునైన శ్రీఅంశనాధుని జ్ఞాపకార్థ దిగంబరులను జైనశాఖవారిచే క్రీ. శ. సం. 1824 న గట్టబడిన దేవాలయము కలదు. సార్నాదున 'ధర్మేక్ష' (ధర్మ లేక న్యాయవిచక్షణము) యనుప్రదేశమున నొక గొప్పస్తూపము కలదు. దీనికిప్పుడు 'ధామేక్ స్తూప'మని పేరు. (భారతి సంపు-౧, ౧౧వ సంచిక, ౧౩౫ పుట చూడుడు)

బౌద్ధచక్రవర్తి యగు అశోకుడు సార్నాదునందొక గొప్పస్తూపమును స్తంభమును కట్టించెను. క్రీ. శ. 400—411 మధ్యకాలమున నుత్తరహిందూస్థానమందంతయు సంచరించిన ఫాహియాననుచీనాయాత్రికుడు కురంగారామమున 4 గొప్పశిఖరములను, బౌద్ధసన్యాసులకై కట్టిన 2 మఠములను తానుచూచినట్లు వ్రాసియుండెను. క్రీ. శ. 640 సం. హియన్ త్సాంగను పరియొక చీనాయాత్రికుడు వందలకొలది దేవాలయములను, 200 అడుగుల-యున్నతి గలిగి శిఖరమున హేమమయమగు ఆమ్రఫలముచే నలంకరింపబడిన గొప్ప విహారమును, ఈవిహారమున న్యాయచక్రము ద్రిప్పుచుండు బుద్ధుని గొప్పవిగ్రహమును చూచినట్లు వ్రాసియుండెను. ఆకాలమున 1500 మతోపదేశకులు నుండినట్లు ఆతడు చూచియుండెనట.

సార్నాదు క్షీణదశకు కారణ మిదమిత్థమని నిర్ణయింపను నాధారము లెవ్వియు కానరాకున్నను ఈ దురంతము ఆకస్మికమయి దారుణ మయినదనియు, బుద్ధిపూర్వక దౌర్జన్యమువలన దేబడినదియు నని యచ్చట ద్రవ్వి ఎత్తబడిన శిథిలములవలన నెరుగదగియున్నది. క్షీణ




న. ఆలయముయొక్క ప్లానును, ఎత్తును




జ. స్తూపముయొక్క ప్లానును, ఎత్తును

దశ ప్రారంభించినవెనుక తగునుద్ధారకులు లేకున్న కాల
దేవత యసహాయముగ నాక్షీణదశను పూర్తిజేయ గలు

గును. కాలక్రమమున మఠస్తూపాదులు నాశములు కాగా
నొకటిరెండుమాత్రము శిథిలములుకాక నిలిచి యున్నవి.





౹ద. ఆలయముయొక్క ప్లాను ఎత్తును.



మంజుశ్రీ విగ్రహము

ఇనుపకమ్ములచే నొకదాని నొకటి చేర్చి బిగియింపబడిన శిలలు గలదగుటచే ధర్మేకు (ధామేక్) స్తూపమును, నాక్బరు చక్రవర్తిచే తనతండ్రి జ్ఞాపకార్థము గట్టబడిన శిఖరము గలదగుటచే, చక్రవర్తిపైగల గౌరవమువల్ల నాశకులచే, తాకబడకుండిన చౌఖండి స్తూపమును శిథిలములు కాక నిలచియున్నవి. చాలమట్టునకు సార్నాదులోని శిథిలమైన కట్టడములన్నియు నధికారపదవియందుండిన వారి గృహనిర్మాణాది స్వోపయోగార్థమును, అయోమార్గముల వేయుటకును రాళ్లకొఱకు త్రవ్వబడి పాడుచేయబడినవి వారివారికి సాధ్యమయినంతవరకును త్రవ్వగా జిక్కిన శిలావిగ్రహములు, విలువగల లోహపదార్థములును, ధనమును (నిమ్కుము) బండ్లకెక్కించుకొని పోబడినవి కాన చరిత్రకారులకు కావలసినంత యాధారములు లేనందున నీక్షేత్రమునుగురించి పూర్ణముగా నెఱుంగదగు భాగ్యము మనకు లేకున్నది.

క్రీ. శ. 1815 సం. న స్వార్థపరత్వము లేక కర్నల్ మక్కెంజిగా రీస్థలమును త్రవ్వించిరి. తదనంతరమున క్రీ.శ. 1835—36లో జనరల్ కన్నింగ్ హాముగారీస్థలమును త్రవ్వించినపుడు బౌద్ధసన్న్యాసుల మఠమును

దేవాలయమును, కనుగొనఁగలిగిరి. దేవాలయసమీపమున వారికి శిలావిగ్రహము లనేకములు దొరకినవి. 1848-52 సం.లో కిట్టోగారు ధర్మేక్ష (ధామేక్) స్తూపముచుట్టును త్రవ్వింపగా ననేక స్తూపములు, ఆలయములు, చైత్య శాల యను కొనదగిన యొకకట్టడమును కనుగొనిరి.

### జగత్ సింగు స్తూపము

18వ శతాబ్దాంతమున వారణాసిరాజగు చేత్ సింగుని మంత్రియగు జగత్ సింగుయొక్క గృహనిర్మాణమునకై కావలసిన రాళ్లకొఱకు త్రవ్వించుచుండగా నీస్తూపము బయటబడెను. జగత్ సింహుని పనివారు త్రవ్వ




౧. జగత్ సింగు స్తూపము

నపు డొక ధనాగారమునుగూడ నిందుగనుగొని యందలి వస్తువులన్నిని దాటవేసిరి.

ఈస్తూపము వలయగర్భితవలయములతో గట్టబడి యున్నది. అన్నింటికిని లోపలనున్న వలయముయొక్క వ్యాసము అ-44.—అం-3. దానిపైనుండు వలయము యొక్క వ్యాసము. అ. 55—అం. 3 ను కలిగియున్నది.

ఈస్తూపము, ఒకదానిపై నొకటిగా బోర్లించ బడిన గిన్నెలవలె నప్పుడప్పుడును కట్టబడిన స్తూపసముదాయమై యున్నది. ఇది ఇటికలతోను, మట్టితోను, కట్టబడి పైపూతకుమాత్రము గార యుపయోగింపబడి యున్నది.

ఇటికలు సాధారణముగా 20 × 3½ × 2¾ అంగుళముల మొదలు 15 × 12½ × 3 అంగుళముల వరకు పరిమాణభేదములు గలిగియున్నవి.

## దేవాలయము

ఇది సమచతురమై ప్రతిప్రక్కను 68 అడుగుల పొడవుగలిగియున్నది. ప్రతిప్రక్కయందును చిత్రమున గనుపఱచినరీతి నంగణములు ముందునకు వచ్చియున్నవి. ఇదికూడ నిటికలతో కట్టబడి కుడ్యము లన్నియు దళముకై బలిష్ఠములై యెంతభారము నైన మోవగలిగి యున్నవి.

## అశోక స్తంభము

పై నుదహరింపబడిన యాలయమునకు పశ్చిమమున నొక స్తంభము కలదు. ఇది మిక్కిలి శిథిలమై యున్నది. దీనియునికినిజూడ దీనిని బుద్ధిపూర్వకముగా విఱుగగొట్టినందున ప్రక్కనున్న యాలయముపై నొరిగియున్నట్లు తోచును. స్తంభశిఖరమున నలువైపుల జూచుచుండు నాలుగుసింహములు వీపులు చేరినట్లుగా చెక్కబడియున్నవి. (భారతి సం-౧. ౧౧-వ సంచిక ౧౩౪ పుట చూడుడు.)

ఇందు రెండుసింహములముఖములు మాత్రము ఆలయకుడ్యమునకు దగులుటవలన భిన్నములై యున్నవి. ప్రస్తుతము చిక్కిన యాధారములబట్టిచూడ నీ స్తంభము భూమట్టమునకుపైన 38½ అ. ఎత్తు గలిగి యొకేరాతితో జేయబడియున్నది. పీఠమున దీనివ్యాసము 3½అ. శిఖరమున అ.1—అం.10 కలిగియున్నది. శిఖరముమాత్రము 7అ. ఉన్నతిగలిగి ఒకగంటయు, దానిపై నొకవలయపీఠమును, దానిపై 4 సింహములును, వాటిపై నొకచక్రమును గలిగియున్నది. ఈశిఖరమునగల చక్రమే 'ధర్మచక్ర' మన బరగుచున్నది. దీనియందు 32 ఆకులు (Spokes) కలవు. సింహములక్రిందగల పీఠమున నొక్కొక్కదానియందును 24 ఆకులుగల 4 చక్రములును, వాటిమధ్య సింహ, గజ, వృషభ, అశ్వరూపములు చెక్కబడియున్నవి.

ఈ స్తంభము హిందూదేశమున నిప్పటివరకును కనుగొనబడిన పురాతనవస్తువులయం దద్వితీయ సౌందర్యము కలదై యున్నది. 2000 సంవత్సరములకు ముందు ఇసుకరాతి (Sand-stone)తో జేయబడిన దైనను చక్కగా నునుపు జేయబడినందున పాలరాతివలె ప్రతిఫలింపజేయు గుణముగలదై కడునందముగా నున్నది.



ఒకస్తూపముపై నొకస్తూపముగా కాలక్రమమున గట్టుచు రాబడినస్తూపము

# రామాయణమునందలి వానరు లెవరు? వా రేరి?

కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి గారు

శ్రీమద్రామాయణమును బాగుగఁ బరిశీలించి చూచిన విద్వాంసులు రామసేనయగు వానరులు ప్రస్తుతకాలమునందలి వానరములు కారనియు వా రొకజాతి మానవులనియుఁ దెలుపుచున్నారు. ఆ యూహనే బలపఱచుచు నే నొకవ్యాసమును వ్రాసి శ్రీ శారదలోఁ బ్రచరించినాను. నా వ్యాసమును సరిగఁ జూచుకొనక కొన్ని యాక్షేపణముల మహారాజశ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు శ్రీ భారతిలోఁ బ్రచురించిరి.

## హీనజాతి యన నేమి?

నేను వానరులను హీనజాతి* యంటిననియు, వారు చండాలాదులవంటి నిమ్నజాతులు కారనియు, శ్రీ పంతులవారు లిఖించిరి. వానరులు తక్కువవారలని నేను వ్రాసితినిగాని, దానిచే వారు చండాలాదులవంటి నిమ్నజాతులను భావముతో నే నట్లు వ్రాయలేదు. దేహనిర్మాణమునందును, జ్ఞానస్థానమగు మెదడు నందును గొంత తక్కువవారని నా తాత్పర్యము.

## వానరుల తోఁకలు

"పైపెచ్చు వారికి తోఁకలున్నట్లు" నేను వ్రాసితినని శ్రీ పంతులవారు వింతపడఁజొచ్చిరి. వీరి వింత నాకు వింతను బుట్టించుచున్నది. పైపెచ్చు వారికి తోఁక లున్నవని నేను గల్పించి వ్రాయలేదు. శ్రీమద్రామాయణమే వారికి వాలములున్నట్లు తెలుపుచున్నది. నే నీ వానరుల విషయములో రామాయణము చెప్పు లక్షణములనే కైకొంటిని. కాని క్రొత్తలక్షణముల వ్రాయలేదు.

కావున వీరు వాలములుగలట్టియు, పరిపూర్ణమానవత్వమునకు రానట్టియు నొకవిధమగు మానవజాతియని విజ్ఞులు వ్రాసినరీతిగా నేనును వ్రాసితిని. శ్రీమద్రామాయణకాలమునందు వాలములుగల హీనమానవజాతి యొకటి యుండెడిదని తోఁచెడిని. వారు కొన్ని మృగలక్షణములును, గొన్ని మానవలక్షణములును గలిగియుండెడివారు. తోఁకలుండెడివి. ఈ యంశములు రామాయణమును బట్టియే తెలియవచ్చుచున్నవి. వానరు లన తక్కువనరులని యర్థము. దేనియందు దక్కువయన దేహనిర్మాణ సౌభాగ్యమునందును, బుద్ధివిభవమునందును, రామాది మానవులకంటెఁ దక్కువయని భావము.

## తోఁకలుగల మానవజాతి యిప్పు డేది? వా రెక్కడ?

అని శ్రీ వీరభద్రరావుగారు ప్రశ్నించుచున్నారు. వా రిప్పు డున్నారని నేను తెలిపియుండలేదు. పూర్వము రామాయణకాలములో మన భారతవర్షములో వాలములుగల హీనమానవు లుండెడివారు. రామాయణకాలము మిక్కిలి ప్రాచీనము. అప్పుడున్న జంతుజాలమునకును, నిప్పుడున్న జంతుజాలమునకును, గొంత భేదము కలదు. భూమి పరిణామమును బొందుచు రాఁగా రాఁగా జాత్యంతరపరిణామము లనేకములు జరుగుచున్నవని శాస్త్రములు తెలుపుచున్నవి. వేదములు మానవుఁడు సృష్టిలోఁ దుదివాఁడని ఘోషించుచున్నవి. "బైబిలు"ను నిట్లే తెలుపుచున్నది. మన సాంఖ్యశాస్త్రమును, పాశ్చాత్యుల ప్రకృతిశాస్త్రములును దీనినే రూఢిచేయుచున్నవి. డార్విన్

---

* నా వ్యాసములో హీనమానవు లను పదమునే నేను వాడలేదు. హీననాగరకతగల ప్రాకృతమానవు లన్ని పశుత్వముగల ప్రాకృతమానవులని వ్రాసితిని. అట్లనుటయే హీనమానవు లనుటగాఁ బ్రస్తుతము దీసికొందము.

మున్నగు పశ్చిమదేశవిద్వాంసులు చెప్పినదియు నిట్టిదియే. భగవంతుని దశావతారములను దీనినే బోధించుచున్న వందురు. ముందు పాదాదికములులేని జలచరములు పుట్టినవి. యాయపాత్తులనుండి సపాత్తులగు కూర్మాదులు పుట్టినవి. ఈకూర్మాదులు విశేషభాగము జలమునందును, నీషద్భాగము స్థలమునందును నుండునవి. వీనినుండి యీషద్భాగము జలమునందును,విశేషభాగము స్థలమునందును నుండువరాహాదులు పుట్టినవి. ఈచతుష్పాత్తులనుండి విశేషభాగము చతుష్పాత్తులుగాను నొకింత ద్విపాత్తులుగాను సంచరించు వానరాదిజంతువులు పుట్టినవి. సదా ద్విపాత్తుగా నుండునరునకును విశేషభాగము చతుష్పాత్తుగా నుండువానరమునకును నడుమ సంబంధముకలుపు మఱికొన్నిజాతు లుండియుండును. స్వల్పముగ చతుష్పాత్తుగను, విశేషము ద్విపాత్తుగను నుండుజాతి యొకటి యీనడుమ నుండియుండవచ్చును. వారేరామాయణమునందలి వానరజాతికావచ్చును. ఈయూహ సమస్తశాస్త్రములకు సమ్మతముగను శ్రీమద్రామాయణవర్ణిత వానరుల కనుకూలముగను నున్నది.

**ఇటీవలి పరిశోధనము లేమి చెప్పుచున్నవి?**

ఇక్కాలమునందలి భూగర్భ పరిశోధకులు నరవానరములకు సంబంధముకలుపు నడిమిజాతు లుండెడివని కనిపెట్టిరి. ఆ యంశము 9-2-25 తేదీగల యాంధ్రపత్రికలో "మనిషి పుఱ్ఱెవంటి కోతిపుఱ్ఱె" యను శీర్షిక క్రిందఁ బ్రచురింపఁబడి యున్నది.

"లండన్ ఫిబ్రవరి 4:—ఉదయం11-40, బుచానాల్యాండులో విట్వాటర్సండు విశ్వవిద్యాలయ పండితుడు తాంగాదగ్గర 50 అడుగుల లోతుగల సున్నపురాళ్లలో పాతిపెట్టబడిన ఒక కోతిపుఱ్ఱె గన్పట్టెను. ఇది చాలకాలమునాఁటి క్రిందిపుఱ్ఱెగా గాన్పించుచున్నది. ఇది మనిషివంటి పెద్దకోతి పుఱ్ఱెవలె గన్పించుచున్నదట. ఇది మనిషిపుఱ్ఱెగాదని డాక్టరుగారను చున్నారు. "గొర్రిల్లా" 'చింపజీ' అను కోతులపుఱ్ఱెవలె నున్నదనుచున్నారు. మాట్లాడుటకు శక్తిలేకపోయెను గాని మాటలగుర్తులు చిహ్నాము లున్నటుల గన్పించెను." ఇత్యాది వార్తను బ్రచురించు పత్రికాధిపతు లీక్రింది సంపాదకీయ వ్యాసము నీవిషయమై ప్రచురించిరి.

"కోతినుండి నరుడు జనించెనని డార్విను సిద్ధాంతము దెలిపియుండెను. దీనిని శాస్త్రజ్ఞులు వేదవాక్యములవలె పరిగణించుచున్నారు. కాని మానవులకు మాట లెటుల యబ్బెను? సంజ్ఞలెటుల దెలిసెను? ఈ ప్రశ్నలకు జవాబు దెలియక పాశ్చాత్య శాస్త్రజ్ఞులు గందరగోళపడుచున్నారు. మానవుని రూపుగల తోకలేనికోతులు గలవుగాని, వానికయినను మానవునిశక్తులు లేవు."

ఇటీవల నొక జర్మను శాస్త్రజ్ఞుఁడు యేబది యడుగుల లోతున నొకపుఱ్ఱెను కనుగొనెను. దానిని పరిశోధింపగ, మానవుఁడును కోతియు గాక మాటలాడి సంజ్ఞలను దెలిసికొనగల వేరొక మధ్యరకపు జాతి కిది సంబంధించి యుండెనని యాతఁడు కనిపెట్టెను. ఈ జాతిని కోతినిబోలు మానవులని పిలుచుటకు బదులుగ, మానవునిబోలు కోతులని పిలుచుట భావ్యముగ నుండునని యాతఁడు సూచించుచున్నాడు. ఇట్టివారు పురాణాదులలో వర్ణించినవానరు లగుదురా? ఇట్టి పరిశోధనముల వలన రామాయణమునందలి భాషాజ్ఞానాదులుగల హీనమానవులు పూర్వకాలమం దుండియుండుట సంభవమే యని బుద్ధిమంతు లూహింపకపోరని తలంచెదను. వానరుల నాగరకత మున్నగునవి రామాదినరుల నాగరికత కంటె నెట్లు తక్కువగ నున్నవో, వానరులం దే, నరులందు లేని పశులక్షణము లేవో, యా వానరులందుఁ గేవల వానరాది పశువులందు లేని నరత్వమేదో, నేను శ్రీశారదలో వ్రాసిన వ్యాసమునందు స్పష్టపఱచి యున్నాను. ఇప్పటికిని గొంచెముగనో, గొప్పగనో వాలముగల మానవజాతి యొకటి కలదని లోకజ్ఞులు చెప్పుచున్నారు. ఆయంశమును నావ్యాసములో వ్రాసియున్నాను, ఇంతకంటె గొప్పగనో సమముగనో వాలముగల జాతియొకటి మనభారతవర్షమునఁ బూర్వకాలమునను నుండి యుండవచ్చును. అట్లేల యూహింపవలయుననిన శ్రీమద్రామాయణ మట్టియూహలు పుట్టించుచున్నది, గావున నట్లు తలంపనైయున్నది. తొల్లి మనభారతవర్షములో హంసాదు లుండెడివని మనగ్రంథములఁబట్టి తెలియవచ్చుచున్నది. కాని యిప్పుడవి యిచట గానరావు అట్లే రామాయణ కాలమునందలి మానవలక్షణములు గల వానరు లిప్పుడు కాన్పింపనందునఁ బూర్వకాలమునందును లేరని తలంపరాదు. కాలము గడచినకొలఁదిఁ బూర్వ

కాలపుజాతు లనేకములు నాశనము నందుచున్నవి. తగు జాగ్రత్త వహింపకున్న నిప్పటిజాతులును గొన్ని యచిరకాలములోనే నాశనము నొందఁగలవు. నశించినజాతుల ప్రధ్వంసాభావము ప్రాగభావమనుకొనుట తగదు. అకాలమునందున్న యీవానరులు జనస్థానము నందలి నరవరులగు ఋషుల సహవాసమువలన గొంత నాగరికతను జెంది విద్యాబుద్ధులు సంపాదించుకొని కిష్కింధారాజ్యస్థాపనము జేసికొని, గృహాదికములు కట్టుకొని వానిలో నివసించెడివారు. కాని కిష్కింధాపురమున నివసించు వానరశ్రేష్ఠులయందే నాగరకత యుండెడిదిగాని వానరసంఘమునం దంతటను సామాన్యముగ నుండెడిది గాదు. మూఁడువంతులు నాగరకులు కానివానరులు మృగతుల్యులై, నివసింప గృహాదికములు లేక చెట్లతోపులు మున్నగువానిలో నివసించెడివారు. సుగ్రీవుని ప్రెగ్గడయగు హనుమంతుఁడు హీనమానవుఁ డెట్లగునని పంతులవారు శంకించిరి. పింగళకుని ప్రగ్గడలగు కరటకదమనకులు ప్రగ్గడలైనంతమాత్రమున నాగరకులగు మానవులగుదురా? రాజునకు దగిన మంత్రు లుండుచుందురు. మృగమునకు మంత్రి మృగమే. వానరులకు వానరులేమంత్రులు. పరమనాగరకులగు పాశ్చాత్యుల సంపర్కముచేఁ బాతాళలోకము (అమెరికా)నందలి యాటవికులలోఁ గొందఱు హూణవిద్యాదికమును నేర్చి ప్రజ్ఞావంతులైనంతమాత్రమున నాదేశస్థులందఱును నాగరకు లెట్లుగారో యట్లే జనస్థానమునందలి ఋషులసహవాసమువలన సంస్కృతవిద్య నొకకొందఱు హనుమదాదివానరు లభ్యసించినను, వారిజాతినంతను విశేషనాగరికతగల జాతియని తెలుపుట కవకాశము లేదు. వానరరాజగు సుగ్రీవునకు హనుమదాదులు ప్రగ్గడలైనను వరరాజగు రామునకు దాసులేకాన వానరులు నరులకంటె గొంత తక్కువవారు. హనుమదాదులు హీనమానవులుకాని వానరులు కారని నేను వ్రాసినట్లు వీరభద్రరావుగారు లిఖించిరి. నే నెచ్చటను నట్లు దెల్పియుండలేదు. హనుమదాదు లిప్పటి వానరములు (క్రోఁతులు) కారంటినే కాని వానరులు (హీనమానవులు) కారనలేదు. హనుమ యెట్టిహీనవానరుఁడో రామసేన యగు తక్కిన వానరసంఘమంతయు నట్టి హీనమానవజాతి యనియే నేను వ్రాసియున్నాను.

## వీరభద్రరావుగారి వానరులు

శ్రీ వీరభద్రరావుగారు ప్రస్తుతకాలమునందలి పల్లెకాపులే కపులనియు, మరకాడులే మర్కటములనియు నేమేమో వ్రాసి యాంధ్రులే వానరులనిరి. ఇప్పటిపల్లెకాపులగు మర్కాడులు మున్నగువారికిని రామాయణమునందు వర్ణింపఁబడినవానరులకును నేవిధమగుసంబంధమును గానరాదు. కపిశబ్దమునందును క, పలు కలవు. కాపుశబ్దమునందును క, పలు కలవు. ఈవర్ణసంబంధమునుబట్టియే కపులది కాపులది జాతియొక్కటియని వీరుతలంచిరి కాఁబోలు! ఈబాదరాయణసంబంధముంబట్టి కాపులే కపులగుచోఁ గాపులనబడువారెల్లరు గపులుకాక పల్లెకాపులు మాత్రమే కపులగుట యెట్లో శ్రీపంతులవారు తెలిపియుండలేదు.

## ఈండ్ర వారింగూర్చి

అక్కరములపోలికంబట్టి యిట్టిభావముల మనము తేల్తుమేని కాపుకులజులగు కార్చెర్ల శ్రీనివాసరావుగారు వ్రాసినరీతిగా నీండ్రవారిండ్రదకులులు గావలసివచ్చును. ఇంద్ర శబ్దమునుండియే యీండ్ర శబ్దము పుట్టినది. ఈండ్రవారిండ్రదకులులు కాఁబట్టియే వీరాకాశగంగతో సంబంధము గలవారుగానున్నారు. మనదేశమునందుఁగల యీడిగకాసులు వీరు తొల్లి యింద్రత్వమునఁగాఁ బ్రభుత్వముచేసిరని తెలుపుచున్నది. ఈట్ అనగాఁ బ్రభువు. దానికి "ఇఁక" ప్రత్యయముచేర్పగా "ఈడిక" యైనది. ఈడికనుండి యీడిగశబ్దము పుట్టినది. ఈట్ లనగా నింద్రులని దీనిభావము. ఈరీతిగఁ దెలుపుచువచ్చిన సత్యచారిత్ర మడుగంటదా! అది యట్లుండ మనవీరభద్రరావుగారు కపులనుగూర్చిన కథలోనుండి శూద్రులు పవిత్రులా యపవిత్రులా యను నంశములోనికి గంతిడి నేనుశూద్రులును బవిత్రులే యని కవిరాజు వత్సవాయినీలాద్రిరాజుగారి గ్రంథపీఠికలో వ్రాసిన యంశమును నధిక్షేపింపఁ జొచ్చిరి. శూద్రులును బవిత్రులే యని నేను నాయిచ్చవచ్చినట్లు దెలుపలేదు. పంచమవేదమగు భారతమును బ్రమాణముగా నిచ్చి యాయంశమును దెల్పినాను. అయ్యెడ "సర్వేవర్ణా బుజవః" అని తెలుపుచున్నడు. అన్నివర్ణములనఁగా బ్రాహ్మణక్షత్రియ, వైశ్యశూద్రులుపవిత్రులనిదీనిభావము. ఈవాక్యమునునాం

గ్లభాషలోనిఁ బరివర్తనము చేసి "All the four castes are holy,, అని మన్మథనాథ దత్తుగారు లిఖించి యున్నారు.

ఇట్టి ప్రమాణములంబట్టి శూద్రులును బవిత్రులే యని నేను వ్రాసియున్నాను. శ్రీపంతులవారి వాదము నంతను నీవ్యాసములో ఖండించుట కవసరము లేదు. ఇది యిందులకు స్థానముంగాదు. గాన మరియొకపరి దానిం గూర్చి ముచ్చటించెద.

రామాయణకాలమందలి రామసేనయగు వానరులు మానవత్వమునందు (దేహనిర్మాణము నందును, మెదడు యొక్క ప్రమాణమునందును) కొంత కొంతవఱకును కొంత పశుత్వమును, కలవారగుటచే వారిని హీనమానవులంటినే కాని యపవిత్రులను తలంపున నే నట్లనలేదని లోకము తలంచుగాక! శ్రీమద్రామాయణమునందలి వానరులు పల్లె కాపులు మున్నగువారివలె దేహాదిధర్మములచే నరత్వ పరిపూర్తి నందినవారు కారనియు, స్వల్పముగ పశుత్వమును నధికముగ మానవత్వమునుగల యొక మిశ్రజాతివారని లోకము గ్రహించుకొనునుగాక.



# చలముతీఱెనే? కన్నులు చల్లవడెనే?

గున్నేపల్లి అక్షయలింగము గారు

కలికి! నీకరుణాకటాక్షముల కెపుడు
దూరమైతినో? యపుడె దుర్వారతాప
వహ్నికీలల దహియింపఁబడితిఁ గాని
కాయమును బాయు భాగ్యమ్ముఁ గాంచనైతి.

లలివహించిన నీబాహులతలఁ జిక్కి
యుల్లమలరించు నీదుచెయ్వులకుఁ జొక్కి
యనుభవించిననాఁటి సౌఖ్యంపుఁ బెంపు
మరలఁగల్గునె? యెన్నిజన్మాలకైన.

అకట! నీదుకటాక్షమాలికల నాకుఁ
గట్టువడునట్టి భాగ్యంబె గలిగియున్నఁ
జెనఁటియై దైవ మిటు సాహసించి నన్ను
దూరదేశాలపాల్సేసి ద్రోహియగునె?

అక్కటా! దైవమును దూఱ నర్హమౌనె?
నిష్కళంక ప్రపూతమై నెగడు నీదు
ప్రేమ మెప్పుడు వెల్వడె భిన్నగతిని
నపుడె దూరదేశాల పాలైతిఁగాదె?

ఎన్నొచిత్రాలఁ జూచితి నెన్నియేని
వింతలను గంటిఁ గాని యావంతయైన
ముద్దులొలికెడునీదు నెమ్మొగమువోలె
హాయి నొసఁగూర్పవయ్యె; నేమందు నకట!

ఎందు వెడలిన వింత లెన్నెన్నిగన్న
నీమృదూక్తియు, నీవ్యక్తి, నీదురక్తి
తలఁపునకువచ్చి నామది తాపమునకుఁ
బాలుపడఁజొచ్చె నీకెంతజాలిలేదొ?

అంతరించెనె? నీదుగాఢానురక్తి
సున్నయయ్యెనె? నాపయినున్నవలపు
పూజ్యమయ్యెనె? నాఁటి నీమోహమెల్ల
చలము తీఱెనె? కన్నులు చల్లవడెనె?




నిడుమోలు కనకసుందరం గారు, బి. ఏ.

ఆకలముల దినుచు కారడవుల నివసించి, సృష్టిరహస్యాలోచనముచే భగవదారాధన మొనర్చుచుండిన ఋషిపుంగవు లతి ప్రాచీనకాలమందే భగవంతుని యనంత ప్రభావమును ప్రకటించు జ్యోతిర్మండలములగూర్చి పరమోత్కృష్టమగు జ్ఞానమును సంపాదించి మనకు ప్రసాదించియుండిరి. బ్రహ్మప్రోక్తమని ప్రతీతివడసిన వేదములయందు సయితము,సూర్యారాధనక్రమము నిర్వచింపబడియున్నది. (ఋగ్వేదము 1 మం. 115 ఋక్కు-చూడుడు)

సూర్యుడు

'వాజీనీతి సూర్య స్తయోషా' (7 మం. 75 ఋ)

యని ఉషాకన్యానాథుడుగను,

'ఉద్వేతి సుభగో విశ్వచక్షుః
సాధారణః సూర్యామానుషాణామ్
చక్షుర్మిత్రస్యవరుణస్యదేవ
శ్చర్మేవయః సమవివ్యక్తమాంసి' (7మం. 63 ఋ)

యని వరుణమిత్రుల నేత్రముగను,

'ఉదుతిష్ట సవితః శ్రుధ్యాస్య
హిరణ్యపాణే ప్రభృతా వృతస్య'

యని హిరణ్యపాణి (బంగారుచేతులు గలవాడు)గను వర్ణించి,

'అయుక్త సప్త హరితః రథస్థా'
ద్యార్యం వహంతీసూర్యంఘృతాచీ' (7 మం.60ఋ)

యని ఏడుగుఱ్ఱములరథమునెక్కి వచ్చునని సూచింపబడియున్నది.

వేదములయందు సూర్యునిగూర్చిన వర్ణనమేతప్ప, తదితర నక్షత్రముల వర్ణనముగాని, చంద్రుండు రాసులయునికిని గూర్చిగాని సూచించియుండలేదు. కాని బ్రాహ్మణములందు మాత్రము, ఒక్కసూర్యుని గూర్చియేకాక, తదితర నక్షత్రములను గొన్నిటినిగూర్చి యుదహరింప బడియున్నది. తైత్తిరీయబ్రాహ్మణమున (1 కాండ 5 ప్రపాఠక 2 అనువాకము)పుణ్య నక్షత్రమన నెద్దియో, యారీతిని నిర్వచించియున్నారు.

'యత్పుణ్యం నక్షత్రం తద్బట కుర్వీతోపవ్యుషమ్
యదావై సూర్యం ఉదేతి అథనక్షత్రం నైతి యా
వతీ తత్ర సూర్యో గచ్ఛేత్ యత్రజఘన్యం పశ్యేత్'

దీనివలన, మనము పుణ్యనక్షత్రమును చూచుటకు, సూర్యు డుషఃకాలమున నానక్షత్రము క్రిందుగా నున్నంతవరకే చూడవలయునని గ్రహింపవలసియున్నది. ఒకనక్షత్రము ప్రత్యూషోదయమైన సమయమునుండి, అది ప్రాతఃకాలమున ఊర్ధ్వబిందుప్రాంతములకు చేరువరకును, దానిని చూడవచ్చునని యిది సూచించుచున్నది. ఈయనువాకమునందే నక్షత్ర ప్రజాపతిని యిట్లు వర్ణించుచున్నది:—

యోవై నక్షత్రియాం ప్రజాపతీవేద
ఉభయో రేనం లోకయోర్విదుః
హస్తాయేవాస్యహస్తాః చిత్రా శిరః
నిష్ట్యా హృదయం ఊరూ విశాఖే
ప్రతిష్ఠా ఽనూ రాధః
ఏష వైనక్షత్రీయః ప్రజాపతిః

అనగా "నక్షత్ర ప్రజాపతి నెరుగు నత డీ రెండులోకములందు (ఇహలోక మందలి నరులును, పరలోకమునందలి దేవతలును) నున్నవారలకును వేద్యుడగు; హస్తానక్షత్రము ఆతని (ప్రజాపతియొక్క) హస్తము, చిత్ర శిరస్సు, నిష్ట్య హృదయము, విశాఖ ఊరువులు అనూరాధ పాదములు."

ఇందు నక్షత్రము లైదు అంగములుగా గలిగిన పరమ పురుషుడొకడు చిత్రింపబడి యున్నాడు. జ్ఞానచక్షువులతో గగన వైశాల్యమును సింహావలోకన మొనర్పగల్గిన ప్రాచీన ఋషులు, బ్రహ్మాండము నావరించెడి పురుష వ్యక్తిని ఊహించి యుండిరనుట మనహిందూమతసాంప్రదాయములందొక వింత గదోపదు. ప్రాచీనఋషుల కస్థిరములగు నిహసాధనములందు విశేషమగు ప్రసక్తియుండెడిదికాదు. తమయరణ్యారాజ్యమును మృగరాజగు సింహము పాలించుచుండెనో, లేక, వంచకుడగు నక్క స్వాధీన పరచుకొనెనో, విచారించుటకు వారెన్నడును కాలము వృథపుచ్చలేదు. విజ్ఞానసముపార్జనమే వారికి ముక్తి. వారివిజ్ఞాన ప్రపంచ మెంత విశాలమో, వారి భావనానిర్మితములగు వ్యక్తులును అంతటి యున్నతములే.

సృష్టికర్త నీరీతిని నక్షత్ర చిహ్నములతో సూచించుటయే యొకవింత. అందును, ఇరువదియేడు నక్షత్ర రాసులలో నైదింటినే కైకొని, వానినే పురుషరూపమున ప్రదర్శించి యుండుట మిక్కిలి వింత. కాని, యీనక్షత్ర వ్యక్తిని దర్శించినంతమాత్రమున, నరున కిహపరసాధకమగు నేయుత్కృష్టవిజ్ఞానము లభించుచున్నది? ఈచిత్తరువునందేదియో యొక మతరహస్య మిమిడియున్నదని విదితమగుచునేయున్నది. కాని దానినిగూర్చి యీదిగువ వ్రాయునదంతయు నొకయూహయే.

ఈయైదురాసులలోను, మొట్టమొదట, 'హస్త' =హస్తముఅనగా 'చేయి' యను నంగమును స్ఫురింపజేయుచున్నదనుట విదితమే. ప్రాచీన ఋషులు వేదకాలమున యిరువదియేడురాసులకును నామకరణముల నొనర్చినపుడు, యీ 'హస్త' రాశియందలి నక్షత్రములు మానవుని కరమువలె నేర్పడియుండెననిమెంచి, దానికట్టి నామమిడియుండవచ్చును, కాని, వారు తదితరములగు యిరువదియారు నక్షత్రములకును పేర్లిడునపుడు, వానిని, మనుష్యుని యంగములతోపోల్చి యుండలేదు. ఈ నక్షత్ర రాసులు, ఆకాశమున నొక మానవుని వేర్వేరు అంగములుగ ప్రదర్శింపవలెనని వారుతలచియుండలేదు. వారట్లేతలచి యుండినయెడల, నన్ని నక్షత్ర రాసులకును, అట్టిపేర్లనే యొసంగియుండెడివారు. కాని, అటుతరువాత, బ్రాహ్మణములు రచింపబడిన కాలమున, దత్కవులు, ఆకాశమున బ్రదర్శింపబడిన యీదివ్య 'హస్తము' నూతగాగొని,

మహోన్నతాకారుడగు దివ్యపురుషు నొకని నిర్మించియుండిరి. ఆతని యన్యాంగములసూచించుటకు వారు చిత్త, నిష్ట్య, విశాఖ, అనూరాధ అను నాల్గురాసుల నేరికొనిరి. ఇరువదియేడు రాసుల్లలో నీనాల్గింటినే వారేల ప్రత్యేకముగ గ్రహించిరో, మన మొకించుక శ్రద్ధతో విచారించిన గ్రహింపగలుగుదుము. 'చిత్'; (జ్ఞానము)నకు స్థానమగు శిరస్సు 'చిత్త' 'విశాఖ' (ద్విశాఖ) రెండు కొమ్మలవలె చీలిపోయిన యూరుద్వయము,'విశాఖ'; ఊరువులకు దిగువ భాగము(అను + ఊరు + అధః) 'అనూరాధ'; నిష్ట్య (ధనిష్ఠ) కుకూడ నిట్టి యర్థమేదియో యుండి యుండవచ్చును. సత్య నిష్ఠా (దీక్షా) పరమగు హృదయమును, '(ధ)నిష్ఠ' సూచించునటుల వర్ణింపబడియుండవచ్చును. ఈరీతిని, ప్రజాపతియొక్క నాల్గు ముఖ్యాంగములసూచించుట కెన్నుకొనబడిన నాల్గురాసులును సార్థకనామము గలవైయుండి యుండవచ్చును. కాని, యిదియంతయు నొక్క యూహయే. బ్రాహ్మణముల రచించిన కవి హృదయ మిదమిత్థమని యెవరుచెప్పగలరు?

ఈనక్షత్ర ప్రజాపతి నొక్కసారి మీరు నోవీథియందూహింపుడు! హస్తానక్షత్రమాతని హస్తము, 'చిత్త'యాతని శిరస్సు...అశ్విన్యాదినక్షత్రములు అపమండలము (Ecliptic) యొక్కభాగములనియు, నవి యాకాశమున పశ్చిమమునుండి తూర్పునకు వరుసక్రమమున నేర్పడియుండుననియు, నాకాశమును పరిశీలించెడి వారెల్ల రెరుగుదురు. ఈయపమండలమందు 'హస్త'కుపిమ్మటనే 'చిత్త' వచ్చుట వలన, నక్షత్రప్రజాపతి హస్తమునకు దిగువనే ఆతని శిరముండినటుల యీచిత్తరువు ప్రదర్శించుచున్నది. అనగా, నక్షత్ర ప్రజాపతి 'ఊర్ధ్వబాహుడై' యున్నటుల వర్ణింపబడియున్నాడు. ఆతడు హస్తములను శిరమునకు పైగా నెత్తుకొనియున్నాడు. ఊర్ధ్వబాహుడగు నిట్టివ్యక్తిని నిర్మించుటయందలి పరమార్థమును గ్రహించుటకు తైత్తిరీయ సంహితయందలి (V, ౨, ౫, ౧) యీసందర్భమును చూడుడు:

'పురుషమాత్రేణ విమిమతే
యజ్ఞేనవై పురుషస్సంమితే
యజ్ఞపురుషైవైనంవిమిమాతే
యావాన్పురుష ఊర్ధ్వబాహుస్తావాన్భవతి.'

అనగా యజ్ఞపురుషునితో పోల్చిచూచినపుడు, యజ్ఞమునొనర్చువాడు, ఆతని చేతులెత్తిన నెంతయెత్తునకుపోవునో అంతయెత్తునకు పెరుగును. సాధారణముగా, నొకమానవుని యెత్తు యెంత యనినపుడు, ఆతని మస్తకము యెంత యెత్తుననున్నదో యనియే మనము గ్రహింపవలసియున్నది. కాని, యంతకుమించిన వృద్ధియంతయు నాతని యాధ్యాత్మిక వృద్ధిగనే మనమెంచవలెను. శరీరముయొక్క పరిమాణము పెరిగినకొలదిని, ఉన్నత ప్రదేశమును చేతితో నందుకొనగలిగినట్లే, ఆధ్యాత్మికజ్ఞాన మభివృద్ధిచెందినకొలదిని, జ్ఞానము క్రమముగ సమున్నతస్థానముల నాక్రమింప గలుగును. కాని, 'యెత్తినచేతియంత యెత్తున పెరుగుట' యనునది కొంత గూఢార్థమును కలిగియుండవచ్చును. జ్ఞానియగువాడు, సర్వ

వ్యాప్తమగు ప్రేమవలన తనదేహము నతిక్రమించి, సర్వవ్యాపియగు మహాపురుషునితో లీనమగును. వేదచరిత్రమున, సృష్టికర్తయగు విశ్వకర్మ ఆదర్శప్రాయమగు నొకయజ్ఞము నొనర్చి తానే, ఆహితాగ్నియందు దుమికి, సర్వవ్యాపియై, సర్వాత్ముడాయెను. అదియే ఆతనిఆధ్యాత్మిక పరిణామము. అటులనే, యజ్ఞము నొనర్చెడి ప్రతిమానవుడును, నిశ్చలమగునట్టి యాధ్యాత్మికస్థితినే పొంది సర్వవ్యాపి యగును. నక్షత్రములనగా, "నశింపనివి" యని వ్యాఖ్యానమొనర్చినచో, నివియే, అట్టి నిశ్చలమును, మరణరహితమునగు నుత్కృష్టస్థితిని సూచించుటకు అర్హములు. యజ్ఞకర్మలనొనర్చెడి ప్రతిమానవుడును, జగమున కాదర్శప్రాయుడగు, విశ్వకర్మను, అనగా ప్రజాపతిని పూజింపవలసియున్నది. కావున నీనక్షత్ర హస్తమునుబట్టి, యూర్ధ్వబాహుడగు నక్షత్ర ప్రజాపతి నిర్మించుట చూడగా హస్తనక్షత్రము ప్రతియేటను సూర్యోదయమునకు పూర్వము ప్రాగుదయమగుచు నరులెల్లరును "ఋతజు"లై యుండవలెనని నిరంతరముద్బోధించుటకేమో యనునట్లున్నది.

ఇది బ్రాహ్మణములందు వర్ణింపబడిన నక్షత్ర ప్రజాపతి చరితముకాని, పురాణములందీపురుషుని వర్ణనమతి చిత్రముగను, సంపూర్ణముగను చేయబడియున్నది. మత్స్యపురాణమున, శివుడా నక్షత్రపురుషు నర్చించువిధానము నారదున కుపదేశింపుచు, నాతని నిట్లు వర్ణించి యున్నాడు.

"(౧) మూలే (నమోవిశ్వధరాయ) పాదౌగుల్ఫౌ (వనన్తాయచ) (౨) రోహిణీ(షు) జంఘేతు (పూజ్యే వరదాయ చైవ ద్వేజానునీ) (౩) చాశ్వికుమార ఋక్షే. (౪) పూర్వో (౫) త్తరాషాఢ యుగే తదోరూ (౬)పూ(౭)ర్వోత్తరా ఫల్గుని యుగ్మకేచ, మేఢ్రింకటిం ...(౮)కృత్తికా,(౯ X ౧౦)భాద్రపదద్వయేచపార్శ్వే, కుక్షిద్వయం (నారద) (౧౧) రేవతీషు. పృష్ఠంగనిష్ఠా (౧౨) (౧౩) విశాఖా...సుభజాశ్చ..., (౧౪) హస్తే పిహస్తా,... (౧౫) పునర్వసా వంగుళి పర్వభాగా. (భుజంగ నక్షత్ర దినేనఖాని సమ్పూజయేన్మత్స్య శరీరిణశ్చ, కూర్మస్యపాదౌ శరణంవ్రజామి) (౧౬) జ్యేష్ఠాసు కంఠే...(౧౭)శ్రవణేన సమ్యక్ (౧౮) పుష్యేముఖం (౧౯) స్వాతీషుదన్తాగ్రం...(౨౦) మఘాసునాసా... (౨౧) మృగోత్తమాంగేనయనే...లలాట (౨౨) చిత్రా ...శిరో(భిపూజ్యం) (౨౩) భరణీషు...(౨౪) ఆర్ద్రాసుకేశాః, (మత్స్య పురాణము—౫౪-(౧౦-౨౦)"

నక్షత్రపురుషుని సర్వాంగకములు,యిరువదినాలుగు రాసులతో పోల్చి వర్ణించినటుల యీపైన పొందుపరచిన భాగమునుండి విదితము కాగలదు. ఇటులనే బృహత్సంహిత (౧౮, ౧౦౫)యందు నక్షత్రపురుషుడొకడు వర్ణింపబడి యున్నాడు. బృహజ్జాతకమందు (అధ్యా ౧ శ్లో౪), పండ్రెండురాసులనుకూర్చి 'కాలపురుషుడు' నిర్మింపబడియున్నాడు.





‘ ఫైయిజీ ’ కృత ఫారసీ రామాయణమునందలి చిత్రము

بعد از ان اندر آب بهشت را در کوه های برج جانب ساخت و کشن را غسل داد و کاو ان بزرگ
و شیر دار از کلهای خود بر آمده پیش کشن آمدند و شیر خود غسل دادند و از شاخهای بزرگ که
در نواحی آن کوه بود بند آب روان گشت و کشن را ان آب شیر غسل کرد و از بهشت دیوتها
کل افشاندند و نقاره های نواختند و کهیسران ثنا گفتند و اطراف عالم و دریای عمان
و درختان جنگل و وحوش و طیور خوشحال گشتند و باز اندر با کشن گفت که از آمدن ما
شما بادشاه شدید و التماس دیگر داریم که زود کنس را و کیسی را وارشت دیت را که شیده و بادبای
روی زمین بکنید و بسر عمه خود را که ارجن باشد او را وجود من دانید بر و مهربان شوید که او بقوت
شما جنگهای خوب بجای خواهد آورد و بقوت شما جنگ بهارته را خوب خواهید کرد و شما
باتفاق آن ارجن راجهای بزرگ را خواهید کشت و من پیش تمام دیوتها و رکهیسران گفته بودم
که ارجن پسر من است و از شکم کنتی متولد شده است راجها را خواهد کشت و جنگهای عظیم
خواهد کرد اگر شما او را قوت خود خواهید داد سخن من در دیوتها راست خواهد شد و اگر نه از
دست او هیچ کار نخواهد آمد ارجن در کمان داری نظیر ندارد دیگر شما نظیر او باشید و در جنگ
را در دمرای او شما باید نگاهبانی او از برای خاطر من خواهید کرد و او را بجای من به بینید
و مرا بجای جان خود تصور بکنید و اگر شما نگاهبانی ارجن بکنید مرگ هم نزدیک او نخواهد آمد بعد
از ین آن ارجن که فرزند من و بسر عمه شماست همراه شما خواهد ماند و هر گاه شما کنس را خواهید کشت
تمام راجهای روی زمین دشمن شما خواهند شد و آن ارجن بقوت شما آن همه را خواهد کشت اگر
شما مرا و دیوتها را از خود میدانید بر ارجن مهربان باشید چون این سخنان را اندر گفت و کشن شنید

* 'ఫైజీ' కృత ఫారిసీ రామాయణమునందలి పత్రము.

* దీనిని పదునాఱవశతాబ్దమున అక్బరుచక్రవర్తియాజ్ఞానుసారము అతని ఆస్థానపండితుడగు 'బదౌని' అనువాడు రచించినట్లు చరిత్ర తెలుపుచున్నది. కాని 'సువర్ణమాల'యందు ప్రకటించినట్లు 'ఫైజీ' కృతముగా చూపట్టెను.



# వైరాగ్యపంచకము

చింతలపూడి శేషగిరిరావుగారు

ఉరుజఠరాగ్ని పీడితున కూరటఁగూర్పవె యుంఛవృత్తిచే
దొరకిననాల్గు గింజలవి? తోయము గ్రుక్కెఁడు శాంతినీయదే?
యరయ నయత్నలబ్ధమలినాంబర ఖండముఁగట్టఁ గూడదే?
పరమనృపాధమాధములఁ బండితు లేలనుగొల్వ? నక్కటా!

గీ. మరణపర్యంతమిట్టు లమానుషముగ, నుదరపోషణ మాత్రకై యుర్విమీఁదఁ
ప్రభునిసేవణ మొనరించి పడసినట్టి, ధనముధనమౌనె? యద్దిదంధనముగాక!
కననుదూఢ గోవర్ధనధనము ధనము! ధాత్రి నాధనంజయవివర్ధనము ధనము!
(?)తలఁపగాఁ బండితసమారాధనము ధనము! కనుక నిదె సుసాధన మబాధనము ధనము!

గీ. ఇదె! దురీశ్వరద్వారబహిర్వితర్ది, కాదురాసికా! మా నమస్కారమమ్మ!
అమితనిరపాయమై యంజనాభమగుచు, మును ధనంజయ స్యందనభూషణమ్మ
గాఁగ పరలిన ధనమె పో! కలదు **మాకు.**

మ. చతురంభోధిపరీతమై తనరు నీక్ష్మాచక్రమం దొక్కచో
శతభాగంబున కేను రాజనని యోజన్ గర్వ సంరంభుఁడై
పతితుండైన నృపాధమాధముని నే వర్ణింప; నారుక్మిణీ
పతి, జీర్ణాంబరుఁడీయ దోసెఁడటుకుల్ భక్షించి యవ్వానినిన్
మితిలేనట్టి ధనాఢ్యుకా సలిపె, స్వామిన్ వానిఁ గీర్తించెదన్.

గీ. జలధిగర్భంబునం దురు జ్వాలతోడ, నాకులముగ మండెడు బడబాగ్నిపగిది
మాదుజఠరాగ్ని మండినమండుఁగాక! ధరసముత్ఫుల్లమల్లీమతల్లికాప
రిమళము దనరు మావాగ్ఝరిని వృథావ్యయంబు సేతుమె? నరవరయాచ్ఞకొఱకు.

* * * * *

గీ. చెంతఁబిత్రార్జితమ్మిసుమంత లేదు, లేశమును స్వార్జితంబైన లేదు మాకు
గాని పైతామహంబయి కాచునట్టి, యాస్తిగలదు వలసినంత హస్తిగిరిని.




## మంగళాచరణము

"విధర్తారం హవామహే, వసోః కువిద్వా నాతినః సవితారం నృచక్షసమ్."

ఓం, నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యో వంశఋషిభ్యో గురుభ్యో నమో మహద్భ్యః.

## ప్రమాణములు

మనము చిలుకను చూచుచున్నప్పుడు మరియొకరు మనసమీపమునకు వచ్చి "అయ్యా! దేన్ని చూచుచున్నారండి?" అని ప్రశ్నచేయగా, "చిలుకను చూచుచున్నానండి" అని సమాధానమును చెప్పుదుము. "అయ్యా! కొంగనుచూచుచు చిలుకనంటున్నా రేమి?" అని వాడు మరల ప్రశ్నచేయగా, 'హోహోవయ్యా, నీకు కొంచెము దృష్టితగ్గినట్లున్నది. ఇదెక్కడకొంగ, చిలుకేనయ్యా' అనిచెప్పగా, 'కాదు కాదండీ, కొంగే' అని యెన్నిపర్యాయములు బోధపరచినను, మనము వానిమాట నమ్మెదుమా? ఈలాగుననే మన జ్ఞానేంద్రియములలో నేయింద్రియము చేతనైనను మనము గ్రహించెడు విషయమునకు విరుద్ధముగ నెవ్వరేమిచెప్పినను దాని నెంతమాత్రము మనము నమ్మము. కనుక ఇంద్రియమునకును వస్తువునకును అవ్యవహిత సంబంధమువలన పుట్టినజ్ఞానమే ప్రత్యక్ష ప్రమాణము.

## అనుమానము

అన్నివిషయములలోను మన యనుభవము చేతనే యథార్థమును తెలుసుకొనజాలము. కాబట్టి కొన్నికొన్ని విషయములలో మన యూహలచేతనే నిజమును తెలిసికొనవలసియున్నది. ఇట్టి యూహలే అనుమాన ప్రమాణము.

## శబ్దప్రమాణము

ఒకమనిషి, తాను బ్రతికియున్నంతకాలము విమర్శించినను, అనుభవముచేతను, యుక్తిచేతను అన్నివిషయములయందును నిజమును కనుగొనుట సాధ్యము కాదు. కనుక ప్రాచీన బుద్ధిశాలురు, అదే కూడుగుడ్డగ బహు పట్టుదలతో ననేక సంవత్సరములు విచారణ చేసిచేసి ఇదమిత్థమని నిర్ణయించి వ్రాసిన గ్రంథములను చదివిచదివి యథార్థజ్ఞానమును సంపాదించుకొనుటయు అత్యావశ్యకమే. కావున మతవిషయములో నిజమును తెలిసికొనుటకు గోరువారు అత్యనుభవశాలురై బహుబుద్ధిమంతులని ప్రసిద్ధికెక్కిన అనేకమహర్షులవలన యావిర్భవించిన గ్రంథములను చదువుటకన్న నుపాయాంతరము లేదు. మనమతగ్రంథములలో ప్రధానమయినదియు, భారతులందరిచేతను సర్వోత్కృష్టమని వేయినోళ్ల పొగడబడుచున్నదియును, సర్వవిషయములను నిర్ఘాటముగ చెప్పుచున్నదియును వేదముగావున నీవేదమే శబ్దప్రమాణము.

## శబ్దవిచారము

మతవిషయమున మనము విచారణము చేయవలయుననిన, శ్రుతి, యుక్తి, అనుభవము, యీమూటిని అనుసరించియే విమర్శింపవలయును. యుక్త్యనుభవములు సరిపడనపుడు శబ్దప్రమాణమును దీసికొనవలయును. ఈశబ్దము మహర్షులయొక్క తపస్సుననుసరించి భగవద్దత్తమైన స్ఫురణవలన బుట్టినదిగాని వారివారి బుద్ధ్యనుసారముగ రచించినవిగాదు. కావున మహర్షులు సమాధియందున్నపుడు భగవద్దత్త స్ఫురత్తువలన యావిర్భవించినది కనుకనే మనప్రత్యక్షానుమానములకు సరిపడనివిషయములలో శబ్దమున జెప్పబడినదే నిజమని నమ్మవలయును.

ఈశబ్దము:— 1. ఋక్కులు; 2. యజుస్సులు; 3. సామములు 4. అథర్వణము, అని నాలుగు విధములు గనున్నది.

ఇంగు పాదనియమము గలిగి ఛందస్సుతో గూడిన మంత్రములు ఋక్కులు.

పాదనియమముగాని ఛందస్సుగాని లేక కేవల వాక్యరూపముగనున్నవి యజుస్సులు.

గానము చేయుటకు తగియున్నవి సామములు.

మంత్రములయర్థమును వలె మంత్రముచే సాధింప దగిన పనులనుచేయుక్రమము సయితమును తెలియ జేయు వేదభాగములు బ్రాహ్మణములు (అథర్వణములు) అని చెప్పబడును.

ఇట్టివేదముయొక్క పూర్వభాగముప వాయు, అగ్ని మొదలగు పంచభూతములయొక్క స్తోత్రములును, ఆపంచభూతములయందు నధిష్ఠించియున్న దేవతలయొక్క ప్రీతినిమిత్తము చేయదగిన యాగాదికర్మలును మాత్రమే చెప్పబడియున్నవి.

క్రమక్రమముగ నా మహర్షులలో సమాధినిష్ఠులా నైనకొలది తత్త్వవిచారమనీప భగవదనుగ్రహమువలన బుట్టినది. ఈతత్త్వవిచారము ప్రభవించిన పైని వారికి సమాధినిగలిగిన స్ఫురత్తువలన పరియొకవిధమైన వేదముద యించినది. అపుడు వారు మొదటి వేదభాగమునకు పూర్వ భాగమనియు, రెండవభాగమునకు ఉత్తరభాగమనియు నామకరణముచేసిరి. ఉత్తరభాగమున బ్రహ్మమునుగూ ర్చియు, జీవపరమాత్మలయొక్క సంబంధమునుగూర్చియు బాగుగ చర్చింపబడియున్నది. ఈవేదభాగములకే ఉపని షత్తులని పేరు. వీటియందు కర్మలవలన నేమియు ప్రయోజ నము లేదనియును, తత్త్వవిచారమే మోక్షసాధనమని యును స్పష్టముగ నుపదేశింపబడినది.

## మతములు.

ఈ యుపనిషత్తులనే యాధారముగ జేసికొని,

1. కపిలుడు సాంఖ్యమతమును;
2. కాణాదుడు వైశేషికమతమును;
3. గౌతముడు న్యాయమతమును;
4. పతంజలి యోగమతమును;
5. జైమిని మీమాంసాశాస్త్రమును,
6. వ్యాసులు వేదాంతమతమును

వ్రాసిరి. ఈయారును షడ్దర్శనము లనబడును. ఈషడ్దర్శ నములలో నేదైననొకటి యుపనిషణ్మతము గావచ్చును. కాని ఆరును కానేరవు. లేదా యీ యారింటికిని భిన్న మైనదిగను గూడ నుండవచ్చును. కాని యీ యారు నెన్నడును కానేరవు. ఈ యారింటియందును కొన్ని గుణములువలె దోషములుగూడ నుండుటచేత నేదైన నొక్కటి నిజమనియు తక్కినవి యబద్ధమనియును చెప్పు టకవకాశము కానరాదు.

## షడ్దర్శన సామాన్య ధర్మములు

ఈ షణ్మతములవారును,

1 ఆత్మనిత్యము.

2 పరమాణువులు నిత్యము.

3 ఈపరమాణువులు స్థూలవస్తు నిర్మాణ కారణములు.

4 జీవాత్మ దేహ సంబంధమును గలిగి యున్నపుడే శుభాశుభ కర్మజన్యఫలము నను భవించును. జ్ఞానాదిశక్తులను గలిగియుండును.

5 ఈ శుభాశుభకర్మజన్యఫలానుభవము స్వర్గనరకములయందున్న సుఖదుఃఖానుభవ ముతో సమాప్తినొందక కుండలోని నీటిని తీసి వేసిన పైని యాకుండ నంటియున్న పాచివలె కొంత నిలిచియుండినందున దాని ననుభవించు టకు జీవాత్మ జన్మించును.

6 సమస్తకర్మలు బంధహేతువులయి జీవా త్మకు జననమరణములను కలుగచేయుచున్నం దున, ముముక్షువు పాపకర్మలను చేయుటయే మాని, పుణ్యకర్మలనుచేయుచు ఫలత్యాగము చేసి, కనక, కాష్ఠ, సుహృత్, అరి, ఉదాసీన, బంధువులయందు సమబుద్ధికలిగి, అన్నిటి

సంబంధమును విడిచికొని యుండవలయును.

అని బోధించుచున్నారు.

మతకర్తల యభిప్రాయములు

సాంఖ్యయోగము పేరునకు భిన్నముగానున్నను వాటిసిద్ధాంతములు పరస్పరభిన్నములుకావు. ఈరెండు మతములవారును:—

1. ప్రకృతి స్వతంత్రము.
2. ఇదేజగత్కారణము.
3. ఆత్మప్రకృతులు అనాదిసంబంధులు.
4. ప్రకృతిపరిణామమే బుద్ధి.
5. ప్రకృతియొక్క కర్తృత్వము ఆత్మ యందు ఆరోపింపబడినది.
6. ఇంద్రియములద్వారమున బుద్ధిపరిణమించుటయే తెలివి.

అని చెప్పుచున్నారు.

[సాంఖ్యులు ఈశ్వరుడు లేనేలేడందురు. యోగమతమువారు ఈశ్వరసత్తనంగీకరించినను అతనిప్రాముఖ్యమును ఒప్పుకొనరు. కావున, ముఖ్యాంశములలో నీరెండు మతములకును విశేషభేదమున్నట్లు కనిపించదు.]

న్యాయ, వైశేషికశాస్త్రములు యుక్తివాదమును గూర్చియు, పదార్థములనుగూర్చియు చెప్పును. ఈయుభయమతములవారును:

1. పరమాణుసంయోగమువలన ప్రపంచము పుట్టుచున్నది.
2. ఈయణువులు ఒకనిచే సృష్టములు కావు.
3. ఇవి నిత్యములు. అదృష్టముచే సంయోగించును.
4. జీవులు అపరిమితములు, నిత్యులు.
5. జీవుడు దేహాధిష్ఠాత.
6. ఈజీవుడు వేదోదిత కర్మలాచరించి ఆత్యంతిక దుఃఖనివృత్తినొంది సుఖదుఃఖముల ననుభవింపక యుండుటే ముక్తి.

యనియును చెప్పుచున్నారు.

[ఈజీవస్థితికిని పాషాణస్థితికిని ఏవిధమైన భేదము కానరాదుగావున, ఇది పాషాణముక్తియని యాక్షేపించుటకు నవకాశమున్నది.]

మరి కొంతకాలము పోయినతరువాత, వైశేషిక, న్యాయగ్రంథ వ్యాఖ్యాతలు

1. పరమేశ్వరు డున్నాడు.
2. ఈయన జగత్తునకు నిమిత్తకారణము.
3. పరమాణువులు ఉపాదాన కారణము.
4 జగత్తు సావయవము గావున సృష్టము.
5 సృష్టికర్త, జీవభిన్నుడు, సర్వశక్తికలవాడు.
6 ఆయన అనుమానప్రమాణబోధ్యుడు.

అని చెప్పుచున్నారు.

[7. ముక్తియందు గౌతమ కాణాదులతో నేకీభవించు చున్నారు. (అనగా పాషాణముక్తి).]

జైమిని విరచిత మీమాంసాశాస్త్రమునకు

పూర్వమీమాంస, కర్మమీమాంస

అని రెండుపేర్లు.

1. దీనియందు తత్త్వవిచారము సున్న.
2. బ్రాహ్మణముల చేతను మంత్రములచేతను చెప్పబడిన కర్మలను గురించి విస్తారముగ వ్రాయబడినది.
3. ఇందు, వేదవిహిత కర్మాచరణమే పరమార్థము.
4. వేదములు నిత్యములు.

5. దీనియందు మహత్త్వమున్నది.

అని మాత్రము వ్రాయబడినది.

ఈమతస్థులలో నెల్ల అగ్రగణ్యుడయిన భాట్టులు

1. అఫలాపేక్షగ యజ్ఞాదులను చేసినచో మోక్షము లభించును.
2. వేదమంత్రమే దేవత.
3. ఫలమును ప్రసాదించు చేతనమైన దేవుడు మరియొకడు లేడు.

అని వ్రాసియున్నాడు.

## గ్రంథారంభము

### ఉత్తరమీమాంస

ఇది వ్యాసవిరచితము. దీనికి వేదాంతశాస్త్రమనియును బ్రహ్మసూత్రమనియును రెండునామములు.

దీనికి 1. శంకరాచార్యులు, 2. రామానుజాచార్యులు, 3. మధ్వాచార్యులు ఒక్కొక్క రొకొక్క భాష్యమును వ్రాసినారు.

శంకరులు అద్వైతమతమును, రామానుజులు విశిష్టాద్వైతమతమును, మధ్వాచార్యులు ద్వైతమతమును స్థాపించినారు. ఈమూటిలో నేదైన నొక్కటియే వ్యాసమతము కావచ్చును. లేదా మూటికంటె భిన్నము కూడ కావచ్చును. ఈముగ్గురు భాష్యకర్తలును కొంత వరకునైన వ్యాసమతము ననుసరించుచునుండవచ్చును. కొంత వరకు ననుసరింపకపోవచ్చును. ప్రస్తుత మీ మతత్రయము లోను మిక్కిలి ప్రాచీనము అద్వైతము. అనేకులు దీనిన వలంబించుచున్నారు. అద్వైతమతభాష్యకర్త శంకరులు.

1. ఆదియందొక్క బ్రహ్మమే యున్నది.
2. అది సత్యజ్ఞానానందాత్మకము, నిర్వికారము, నిరవయవము, నిత్యము, నిర్దోషము, సర్వవ్యాపకము.
3. జగత్తు, పరమార్థముగ సత్యముకాదు. వ్యావహారిక సత్యము.
4. మాయ(అవిద్య)కు బ్రహ్మములోబడినది.
5. ఈవిద్య అబద్ధము (మిథ్య), జడము, సవికారము, సావయవము, అనాది.
6. దీనియందు, ఆచ్ఛాదక, విక్షేప, అనెడు రెండుశక్తు లున్నవి.
7. జీవులన్నియు బ్రహ్మమే.
8. అవిద్య (మాయ) తన యాచ్ఛాదక శక్తిచే జీవుని తనస్వరూపమును తెలిసికొనలేకుండ జేయుచున్నది.
9. విక్షేపశక్తిచే, జీవుని తనకు రూపభేదమున్నట్లు భ్రమపెట్టుచున్నది.
10. 'తత్త్వమసి' ఇత్యాది వాక్యజన్య జ్ఞానమువలన, అవిద్యనశించి స్వస్వరూపజ్ఞాన ముదయించుటయే మోక్ష

మనియును సిద్ధాంతీకరించినారు.

[అద్వైతులు బ్రహ్మసత్త నొప్పికొన్నను, ఆబ్రహ్మము తానేయనుటచే, భగవదాజ్ఞకు లోబడి ఆయన నుపాసించుట సంభవించదు గాన, భగవంతుడు లేడనెడు నాస్తికులకును, ఈఅద్వైతులకును భేదమేమియును లేదు. కనుకనే వీరు ప్రచ్ఛన్నబౌద్ధులని లోకములో ప్రవాద యిదివరకే యున్నది.]

మరియు నీయద్వైతులలో మరికొందరు:—

1. ఒక్కసూర్యుడు, నీటికుండలలోను ప్రతిఫలించినట్లు, బ్రహ్మము మానవుల యొక్కయంతఃకరణములయందు ప్రతిఫలించును.
2. ఆనీటికుండలయందు అనేకసూర్యబింబములవలె గనుపడినట్లు అంతఃకరణములలో బ్రహ్మము అనేకరూపములుగ దోచును.
3. ఆకాశమునందున్న సూర్యబింబమున

కును, ఘటాదులయందున్న ప్రతిబింబ ములకును భేదములేనట్లుగనే, బ్రహ్మము నకును అంతఃకరణలయందు ప్రతిఫలించిన బ్రహ్మ ప్రతిబింబములకును భేదములే

దని చెప్పుచున్నారు.

[ఘటాదులలో సూర్యుడు ప్రతిఫలించినట్లే అంతః కరణలలో బ్రహ్మము ప్రతిఫలించు నని చెప్పినయెడల ఘటాదులయందు సూర్యబింబము లేనట్లే అంతఃకరణల యందును ఆత్మలును లేవు అని చెప్పవలయును. ఈ యాత్మలు మిథ్యలగునెడలవాటికి, జ్ఞానము, తత్త్వవిచారము, లోకవ్యాపారముఎట్లు సంభవించును? అను పూర్వపక్షము జాగరూకమయియున్నది ]

**రామానుజులు**, విశిష్టాద్వైతభాష్యకర్త. ఈయన

1. జీవునకును, ఈశ్వరునకుగల గుణములే యున్నవి.
2. జీవుడుపరమాత్మకు లోబడి యుండవలెను.
3. ఈశ్వరుడే విష్ణువు. ఇతనికి దివ్యమంగళ విగ్రహ మున్నది.
4. మోక్షస్థానము వైకుంఠము.
5. లక్ష్మి యాతని భార్య.

యనియును సిద్ధాంతపరిచినారు.

విశిష్టాద్వైతమున:—

[1. ఈశ్వరునకు రూపమున్నది. 2. భార్య గలదు, అని సాధించుట కష్టతరము.]

**మధ్వాచార్యులు** ద్వైత భాష్యకర్త.

1. జీవేశ్వరులకు భేదమున్నది.
2. ఈశ్వరుడు విష్ణువు.
3. జీవులు పరస్పర విలక్షణులు.
4. ఈశ్వరునకు రూపమున్నది.
5. పరలోకమునందుగూడ జీవులు పూర్వ రూపముతో సమానరూపములతోనే పరమపదమును బొందుదురు.

అని సిద్ధాంతము చేసినారు.

ద్వైతమతమునందు మరణానంతరమున జీవులకు పూర్వదేహ సమానదేహములే యుండును అని సాధించుట కష్టాత్కష్టతరము.

ఇన్ని భాష్యములనుబట్టి యాలోచించినను వ్యాసాభిప్రాయమేమో స్పష్టపడినట్లుకానరాదు. కావున వ్యాసాభిప్రాయమెట్టిదో శ్రుతి, యుక్త్యనుభవములచే విచారింప బడును.

## బ్రహ్మసూత్రరచనా కారణము

ద్వాపరమున **12** సంవత్సరములు క్షామము పెట్టినది. అనేకమహర్షులు కరవుతీరువరకు తమ్ముపోషించవని గౌతముని వేడిరి. అత నందులకంగీకరించెను. కొంత కాలమునకు దేశము సుభిక్షమయినది. మహర్షులతనిమహిమకు మత్సరపడియాతనికెట్లైన నపకీర్తిబుట్టించిపోవుదమని యాలోచించి, దర్భతోగోవుజేసి యాగౌతముని అగ్నిహోత్రగృహమున విడిచిరి. గౌతములు దానినిచిన్న దర్భపుడకతో గొట్టనది మాయగోవుగాన మృతినొందినది. ఈమునులు, "ఓగౌతమా! నీవు గోహత్యచేసిన పరమపాపాత్ముడవుగాన నీతోమాట్లాడకూడదు. నీపాపిష్ఠియన్నమును తినగూడదు. మేము నీయాశ్రమమును విడిచిపోవుచున్నాము." అని పలుక నాగౌతముడు "ఓమహాత్ములారా! నాయందు దయచేసి నన్ను పునీతునిజేయుడి. అని ప్రార్థించుచున్నాను,"అని గౌతముడా మునులను వేడవార్లు,"సరే, స్నానమాడిరా? ప్రాయశ్చిత్తముచేసెదము." అనగా గౌతముడు స్నానార్థము బోవుచు, 'నేమిటీయాశ్చర్యము దర్భకఱ్ఱతో గొట్టినమాత్రమున నావు చచ్చునా! దీనినిజము గనుగొనవలయును." అని యాలోచించి యాతడు దివ్యదృష్టిజూడ నీమునులాచరించిన దుశ్చేష్ట యాతనికి స్పష్టముగదెలిసెను. పిదప నతడు స్నానమాడి యాహ్నికముదీర్చుకొని యాశ్రమమునకేతెంచి మునులనుజూచి, "మునులారా! మీరందరు కృతఘ్నులుగాన మీయందు గాయత్రి పరోక్షమగుగాక!

మీ బ్రహ్మజ్ఞానము నశించుగాక!" యని శపించెను. మునులయందు బ్రహ్మజ్ఞానము నశించినచో జ్ఞానోపదేష్టలు లేనందున క్రమక్రమముగ లోకము నిరీశ్వర మగునని పరమాత్మ, విష్ణువునకు తాను వ్యాసరూపమున నవతరించి యతి సులభముగ బ్రహ్మజ్ఞానము మనుజులకు కలిగేటట్లు చేయవలయునని సంకల్పముఁ బుట్టించెను.

విష్ణువట్లవతరించి జ్ఞానోదయమునకు ముఖ్యకారణములయిన యుపనిషత్తుల యర్థము సులభముగ బోధపడుటకు బ్రహ్మసూత్రములను వ్రాసెను. కావున,

[గౌతమశాపమున మానవులయందు నష్టప్రాయమయిన బ్రహ్మజ్ఞానముయొక్క పునరుద్ధరణార్థము, వ్యాసరూపమున నవతరించిన విష్ణువు బ్రహ్మసూత్రములను వ్రాసెను. కాని జీవుడే బ్రహ్మమని సాధించుటకు కాదని పురాణములలో గానవచ్చుచున్నది.]

## బ్రహ్మసూత్ర రచనాక్రమము

శ్రీవ్యాసులు బ్రహ్మసూత్రములను వ్రాయునపుడే, భాష్యకర్తలు, వారివారి యిచ్ఛానుసారముగ విషయ శ్రుతులను తీసికొనుదురేమో యని సూత్రములను తరుచుగ విషయ శ్రుతిపద ఘటితము లయేటట్లుగనే వ్రాసినారు.

ఉదాహరణార్థ మీక్రింద నొకటిరెండు సూత్రములను మాత్రము వ్రాయుచున్నాను.

బ్ర. సూ. 'అత స్త్వితర జ్జ్యాయోలింగాత్.' (3-4-39)

వి. శ్రు. 'అతః కనీయసా ఏవ దేవా జ్యాయసా అసురాః' ఇందు జ్యాయస్, అను మాట సూత్రమునందును శ్రుతియందును గూడ కనబడుచున్నది.

బ్ర. సూ. 'ఉపమర్దంచ' (3-4-16)

వి. శ్రు. 'ఓమిత్యృచ్ఛా ర్యాంతరిత మాత్మాన మభిపశ్యోపమృద్య పుణ్యంచ పాపంచ కామ మాచరంతో బ్రహ్మైను వ్రజన్తి.'

ఇందు 'ఉపమృద్'పదము శ్రుతి సూత్రములలో నున్నది. ఇట్లు చాలాసూత్రములు వ్రాయవచ్చును. బుద్ధిమంతులకు నొకటిరెండు దృష్టాంతములు చాలునని విరమించుచున్నాను.

## సూత్రార్థ నిర్ణయక్రమము

విషయశ్రుతియొక్క అర్థమును భాష్యకర్తలు వారివారి యిచ్ఛానుసారముగ చెప్పుచుందురేమో యని సంశయించి, వారట్లుచెప్పినయెడల నాయర్థము తనయభిప్రాయమునకు భిన్నమగుటవలన చదువరులకు నిజమయిన జ్ఞానము కలుగును. వారికి ముక్తిరాదు. అపుడు భగవదాజ్ఞానుసారముగ తానుచేసిన ప్రయత్నము నిష్ఫలమగును అని విషయశ్రుత్యర్థములను, శ్లోకరూపముగ తాను సూతున కుపదేశించిన పురాణములలో విషయశ్రుతిప్రతీకముల నుదహరించుచు నుపదేశించినారు.

కాబట్టి పురాణశ్లోకానుసారముగవిషయ శ్రుత్యర్థమును, ఈవిషయశ్రుత్యర్థానుసారముగ సూత్రార్థమును చెప్పిన బ్రహ్మజ్ఞానము మానవహృదయములందు స్ఫురించును.

కావున పైనివ్రాయబడినరీతిని సూత్రార్థమును చెప్పవలయునని వ్యాసనిర్ణయము. మరియొక తీరున జెప్పిన యర్థము వ్యాసమతవిరుద్ధము, వ్యర్థము.



# గులాబిపువ్వు

నాదెళ్ల వెంకట్రావుగారు, బి. ఏ.

సదమలసౌరభంబు వెదచల్లునొ యారసపుంబూలరాణి, నీ
యుదయము నేను లేవఁగనె యుజ్జ్వలకాంతులఁజిమ్ము చీవు నా
యెదుటను తోఁటలోనఁ గనుపించితి వంచితలీల నంత నా
హృదయము పొంగె నిన్ననుట కెందుకొ కాని గులాబిపుష్పమా !

తే. గీ. కనులపండువుసేయు నిన్గాంచినంత, వింతసంతోష మొందె నా స్వాంత మెంతొ !
ఏమిశుభమయ్యెదునొ కాని యీదినంబు, ప్రొద్దునన లేచి నినుఁజూచు పున్నెమబ్బె.

తే. గీ. అత్తరుంబూసి యొంతయుఁ మెత్తనైన, జిలుగుచెంగావి వలువ సొంపొలయఁ దాల్చి
చెలువులొలికెడు సుందరీతిలకమట్లు, కులుకుచున్నావు తోఁటలోపల గులాబి !

చ. మొదటనినుంగనుంగొనఁగ మోదమదెంతయొ కల్గెఁగాని నీ
కొదవఁగనున్న పాటు మది నూహయొనర్పఁగఁ జాలిపుట్టె నే
పదనిమిసాలకో యికను ప్రాణముఁ బాయుదుగాదె భామినుల్
చిదిమి శిరస్సులందు నినుఁజేర్చినయంత గులాబిపుష్పమా !

మ. అహిమస్త ప్రవిభాసిభాసురవిలాసానర్ఘ మాణిక్యముఁ
గ్రహియింపన్ గమకింపఁ గన్నుమనికోరల్ చూపుగా సర్పముల్
బహుచిత్రద్యుతి బంధుర ప్రకట సత్పత్రప్రభాశోభియా
విహగంబు న్వెసఁబట్టఁబోవనె గురు న్వేగంబ విస్వీధికిన్.

తే. గీ. ఎదురుకొనుటకు నవయవం బేమిలేక, పాఱిపోవుట కేనియు వశముగాక
క్రూరమానవకరముల బారినిబడి, మాఱుమాటాడకక్కటా, మడియుదీవు !

మ. వనజాతాసనుఁ డెంత నిర్దయుఁడొ నీపైఁ! గానిచో నక్కటా
నినుఁగాపాడఁగలేని ముండ్లొసఁగె, నంతేకాని వేతేమి సా
ధనసామగ్రి సృజింపఁడయ్యెను భవత్సౌందర్యమే నీకు నా
శనముం దెచ్చెడి హేతువాటఁ గలిగెన్ సంతాప మెంతేనియున్.

ఉ. అందముచిందు వస్తువు లనంతము లున్నవిగాదె యీజగం
బందు. ముదంబొసంగునవి యైనను కాలము రాకముందఱ
చెందును కొన్ని నాశనము, చెల్వునశించి కృశించుఁ గొన్ని వా
నిం దిలకించి మానస మనిర్వచనీయవిచార మొందెడున్.

సీ. కోమలత్వనిధాన కుసుమతారుణ్యంబుఁ, బలుగాకిభ్రమరంబు పాడుచేయు
ననమానసుషమావిలసద్రాక్షకిసలంబుఁ, గోయిల మొదలంటఁ గొఱికివేయు
మహనీయమాధురీమహిమాస్పదఫలంబుఁ, దుంటరి పురుగెక్కి తొలిచివేయు
వనజారి సంకాశ మనుజాస్యము మశూచి, వికృతంబుగాఁ జేసి విడిచిపెట్టు

గీ. దైవయోగంబు నెవ్వరు దాటఁగలరు, భువిని జీవించినన్నాళ్లు కవులకెల్లఁ
బ్రవిమలానంద మొసఁగు నీబ్రతుకె బ్రతుకు, లలితకాంతులకోవ ! గులాబిపూవ !

## శ్రీకృష్ణాశ్రమము, పెద్దపాలెము, కృష్ణాజిల్లా



ఆశ్రమము యొక్క ప్రక్కవైపు



ఉపాధ్యాయులు, విద్యార్థులు



దైవప్రార్థనము



విద్యార్థులు, భోజనము




వింజమూరి పార్థసారథి అయ్యంగార్ [సాహితి సమితి సభ్యుడు]

శ్రీ సల్లపాటి హనుమంతరావుగారి ఆహ్వానాన్ని అనుసరించి ఒకరోజు ఉదయం ప్యాసెంజరులో పెదవడ్లపూడి వెళ్లాను. స్టేషనుపక్క ఉన్న రోడ్డు సరాసరిపోయి దేవేంద్రపాడుకుపోవు బకింగ్హామ్ కాలవదరికి చేరి బల్లకట్టుఎక్కి అవతలివడ్డుకు పోతిని. బల్లకట్టునుంచి కొంతమంది ముందుగా దిగిపోతూఉంటే నేనుకూడా అప్పటికే చాలాఎండ ఎక్కినందున త్వరగా పోదామని దిగబోతూ ఉంటిని. అప్పుడు బల్లకట్టమీదఉన్న ఒక పెద్దమనిషి నన్నుచూచి, 'తాకుతావయ్యా నీయిల్లుబంగారంగాను!' అని పెద్దగా అన్నాడు. ఆ మాట్లాడుతున్న మనిషివంక తిరిగి, 'ఏం తాకుతే' అన్నాను. ఇంతట్లోకే ఇంకోమనిషి కొంచెం బిగ్గరగా, 'ఓహో! స్వదేశపువనుసులు గామాలె!' అని వికటంగా నవ్వడం ఆరంభించినాడు. ముందుగా దిగుతున్న 'ఆఅంటరానివాళ్లను' రాసుకుంటూనే నేను దిగిపోయినాను. పంచముల దౌర్భాగ్యస్థితి తలపునరాగానే దుర్నివారంగా కంట నీళ్లు వచ్చాయి.

ఎండవేడిమి అప్పటికే బాగా హెచ్చవంవల్ల త్వరగా పెదపాలెం చేరుకుందామని గబగబ నడుస్తూ ఉన్నాను. కొంతదూరము పోగానే చేతిలో గ్రంథాన్నొకటి పట్టుకొని మొహంనిండా విభూతి పెండెలు తీర్చిపెట్టుకుని ఏవో కొన్నిమంత్రాలు జపిస్తూపోతున్న బ్రాహ్మణున్ని కలుసుకొన్నాను. ఆయన నావంకతిరిగి 'అయ్యా తమదేవూరు? ఎక్కడికి వెడుతున్నారు?' అని నన్ను ప్రశ్నించాడు. 'మాది గుంటూరుకాపరము, పెదపాలెం పోతున్నాను' అనినేను జవాబుచెప్పాను. అంతట ఆయన నన్ను యెగాదిగా చూసి, 'మాల మాదిగాళ్లకు బ్రాహ్మలు చదువుచెప్పుతున్న చోటికా?' అని నన్ను మళ్లా అడిగినాడు. 'అవును, అక్కడికే' అన్నాను.

బ్రాహ్మడు కాసేపు ఊరుకొని తనలోతాను 'వినాశకాలే విపరీతబుద్ధి' అని చివర విసర్గ లోపంతో అనుకుంటున్నాడు. 'అయ్యా, ఏమిటో సెలవిస్తున్నారు' అని నేను వారిని వినయంగా అడిగినాను. 'ఏమీ లేదు. 'వినాశకాలే విపరీతబుద్ధి' అంటున్నాను. కాకపోతే మటుకు మాలవాళ్లకు మన బ్రాహ్మలు చదువుచెప్పడం ఏమిటి? మీదుమిక్కిలి వాళ్లనుతాకడం! రామ రామ! ఎటువంటిదురవస్థ పట్టిందండీ మన కులగోత్రాలకు!' అని పాపమాయన అన్నాడు. 'నిజమే! తరతరాలనుంచీ వస్తూ ఉన్న ఈ ఆచారాన్ని ఇప్పుడు మార్చివెయ్యాలంటే శ్రోత్రియులైన బ్రాహ్మలూ, వేదాలేతప్ప వేరే శరణ్యం లేదని చెప్పేవాళ్లూ ఎట్లాఒప్పుకుంటారు, ఒకపాళాన్నీ' అని నేను అన్నాను. అప్పుడా బ్రాహ్మడు, 'వేదాల్లలో అక్కడా చండాలురంటే బ్రాహ్మణస్త్రీకి శూద్రునివల్ల పుట్టినవాళ్లు అని ఉన్నది. వాళ్లే అంటరాని వాళ్లు. వాళ్లనుముట్టుకున్నందువల్ల కలిగే దోషమూ, ఆదోషానికి పరిహారమూ అన్నీ శ్రుతిస్మృతులలో వ్రాసేఉన్నవి' అన్నాడు. ఆయనతో వాదప్రతివాదులకు దిగితే వట్టి కంఠశోషతప్ప వేరేమీలాభముండదనుకొని వినయంగా, 'అవధాన్లుగారూ! వెనకటికి ఒకకథ జ్ఞాపకానికి వస్తున్నది. పూర్వం అదేవూళ్లోనో ఏకగర్భవాసాన జన్మించిన అన్నా చెల్లెలూ పసితనంలో దురదృష్టవశాత్తూ కృష్ణలోపడి కొట్టుకొనిపోయినారట! వాళ్ల నెవరెవరో రక్షించి పెంచుకొని పెద్దవాళ్లను చేశారట. తర్వాత కొన్ని సంవత్సరాలకి అన్నా చెల్లెళ్లకు వివాహ మయిందంట. వివాహమయిన దరిమిలా ఆపిల్లలను పెంచుకున్న వాళ్లకు పెండ్లి ఐన వాళ్లిద్దరూ ఒకతల్లిబిడ్డలని తెలిసిందట. అప్పుడు అన్నిశాస్త్రాలు చదువుకున్న పెద్దపండితు డొకాయన ఉపాయంఒకటి చెప్పినాడట. 'అన్నా చెల్లెళ్లకు

నల్లటిబట్టలుకట్టి కృష్ణలోపడేస్తే ఆనల్లవస్త్రాలు ఎప్పుడయితే తెల్లబడిపోతాయో అప్పుడు వాళ్లకు పాప పరిహారం అవుతుంది' అన్నాడట. ఆవిధంగానే వాళ్లిద్దరూ జీడిగింజంటి నల్లటివస్త్రాలుకట్టుకొని కృష్ణలోదిగి భగవత్ప్రార్థన చేసుకుంటూ ప్రవాహంలో పడి కొట్టుకొని పోయినారట. వాళ్లు ఒకానొకగ్రామం చేరగానే వాళ్ల నల్లటిబట్టలు తెల్లబడిపోయినాయనీ అంతటితో వాళ్ల పాపం ఊడ్చిపెట్టుకొని పోయిందనీ చెప్పుకుంటారు. అప్పటినుంచే ఆవూరికి వెల్లటూరు అని పేరు వచ్చిందనీ చెప్పుకుంటారు. మాలవాళ్లను పాపవిముక్తులను చేసేందుకు గూడా ఇలాంటిదే ఒకటి ఏగొప్ప పండితుడన్నా ఆలోచించి ప్రజలమన్ననకూ రాజు మన్ననకూ పాత్రుడై మాలవాళ్లకు మహోత్కృష్టమైన ఉపకారం చేసి పుణ్యంసంపాదించుకోరాదూ!' అన్నాను. నామాటలు విని ఆయన పెదవులు చప్పరించి నాతో మాట్లాడి లాభంలేదని ఊరుకున్నాడు. తరువాత కొంతసేపటికి మేమిద్దరం చీలిపోయినాము. శ్రీకృష్ణాశ్రమం చేరుకునేసరికి రెండుఝాములయింది.

పెదపాలెంలో ఉన్న ఈ శ్రీకృష్ణాశ్రమం స్థాపించింది శ్రీయుతులు నల్లపాటి హనుమంతరావుగారు. వీరికి ముప్పైయైదు సంవత్సరాల ప్రాయముంటుంది. వీరు నియోగి బ్రాహ్మణులు, గుంటూరు తాలూకావారు. మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసైనారు. చాలాకాలం నుంచీ, అందులో అసహాయోద్యమం దేశంలో ప్రచారంలోకి రాక ముందునుంచీ గూడా, వీరు అధోగతిలో ఉన్న పంచములను వృద్ధిలోకి తీసుకొని వచ్చేటందుకు బద్ధకంకణులై నాటినుంచియు అమితోత్సాహంతో పనిచేయుచున్నట్టివారు. దేశంలో పెద్దపెద్ద పరీక్షలు ఇచ్చిన వారుకూడా మాలవాళ్లనుతాకితే తమ కులగోత్రాలన్నీ పోతాయని చెప్పేరోజులలో వీరు విశేష భాగ్యవంతులు కాకపోయినా ధైర్యసాహసాలతో ఎటువంటి కష్టం వచ్చినా సరే లెక్కచేయక పంచములను పైకి తీసుకొని వచ్చేటందుకు పెదపాలెంలో శ్రీకృష్ణాశ్రమాన్ని బయలువెడలదీశారు. ఆరోజుల్లో తమఉద్దేశాలు శ్లాఘించి ఆమోదించేవాళ్లు ఎక్కువమంది లేరు. ఒకవేళ ఉన్నా ధనసహాయం చేసేవాళ్లు అసలే లేరు. అటువంటి దుస్థితిలోకూడా హనుమంతరావుగారు ఏమాత్రం జంకక అధికప్రయాసలతో ఈ ఆశ్రమాన్ని సక్రమంగా నడపడం ఆరంభించారు. కొందరు బుద్ధిమంతులు వీరిని 'మాలవాడు' అని పిలిచిన రోజులుకూడా ఉన్నాయంటే నమ్ముతారో లేదో! ఆరోజుల్లో లోకులేకాక కొందరు దగ్గిరబంధువులూ వీరిని సంఘబహిష్కారమూ, కులబహిష్కారమూ చేశారు. ఈమధ్య, పాపం, వారితండ్రిగారు స్వర్గస్థులైనప్పుడు శవాన్ని వాహకులుగా ఉండేటందుకు ఏవేళకూ ఒక్క బ్రాహ్మణుడైనా వచ్చిన పాపాన పోలేదట! తరువాత ఎట్లానో మరీ దగ్గర బంధువులకు కబురు చేస్తే వచ్చారట. ఇన్ని కష్టాలకు లోనైకూడా ఏమాత్రమూ ధైర్యం వదలక వివృద్ధమవుతున్న సాహసోత్సాహాలతో తమ విధ్యుక్త ధర్మానికి ఎట్టి అంతరాయమూ కలగకుండా ఈనాటివరకూ ఆశ్రమాన్ని సక్రమంగా నడుపుకొని వస్తున్నారు.

వీరిని చూడగానే ప్రతివానికీ వీరు గొప్ప సద్గుణసంపన్నులనీ, మిక్కిలి శాంతస్వభావం కలవారనీ తోచకపోదు. నిరాడంబరముగా ఖద్దరు దుస్తులు ధరించి వీరు వీధివెంట వెడుతూ ఉంటే వీరి ముఖ లక్షణాలుచూసిన ప్రతివానికీ వీరియందు సదభిప్రాయం కలగక పోదు. ఆశ్రమమందు వీరు నిరంతర నివాసమువల్ల విద్యార్థులకందరికీ ఆదర్శప్రాయులై ఉండి వాళ్ల ఆత్మలలో ప్రేమ, భక్తి, శాంతము ఇత్యాది సద్గుణాలోటి వర్ధిల్ల చేయుచున్నారు.

ప్రపంచములో మనకు అనుభవము ఉన్నంతవరకూ ఏ కొద్దిమందోతప్ప ఏదైనా ఒకపని చేయడానికి స్వలాభమో కాకపోతే గౌరవమో అపేక్షించి చేస్తున్నారు. అందులో విశేషంగా యువకులు ఏసందర్భమువల్లనో తమకు కలిగిన తాత్కాలికోత్సాహంవల్ల ఏదో ఒక గొప్పకార్యం చేయడానికి పూనుకొని కొంతకాలం పనిచేసిన తర్వాత ఆ ఉత్సాహం క్షీణించిపోగా అంతవరకు చేసుకొని వచ్చిన దాన్ని నిష్ఫలం చేసుకుంటారు. శ్రీ హనుమంతరావు చేస్తున్నటువంటి సత్కార్యం ఆవిధమైనది ఎంతమాత్రమూ కాదు. అసహాయోద్యమం ఆంధ్రదేశంలో ఉన్మాదము కలిగించిన దానికి రెండు సంవత్సరాలకు ముందే ఈ ఆశ్రమాన్ని స్థాపించినారు. ఆరంభశూరులవలెగాక వీరు 1918 సంవత్సరంలో ఒక చిన్ని

పూరిపాకాలో పంచమ బాలురకు ఒకపాఠశాల ఏర్పరచినారు. రానురాను ఆశ్రమం కొంతమంది దీనబంధువులైన ధర్మాత్ముల ఆదరణాను రాగములకులోనై వృద్ధి పొందుతూ వచ్చింది. 1920 సంవత్సరాంతములో అసహాయోద్యమము విజృంభించినప్పటి నుంచీ ఆశ్రమం మరింత వృద్ధిలోకివచ్చింది. పేరు ప్రతిష్ఠలకోసం ఏమాత్రమూ ఏకోశానా ఆశించక పంచములయెడ నిష్కల్మషమైన ప్రేమతో స్థాపించినది ఈ ఆశ్రమం. అందువల్లనే కాబోలు, నిజమైనటువంటి దేశసేవ, మానవసేవ చేయుచున్న శ్రీహనుమంతరావుగారి పేరు దేశంలో తగిన ప్రసిద్ధికి రాలేదు.

స్మృతికారులేమి చెప్పినా, శ్రోత్రియులేమి చెప్పినా ఈ అంటరానితనము మన దేశానికి మేరలేని కళంకమాపాదిస్తున్నదని చాలామంది సహృదయులు ఒప్పుకున్న అంశమే. సహజమైన మానవనీతికి విరుద్ధమగు భయంకరమైన దురాచార మీయంటరానితనము. ఏడుకోట్లమంది స్వదేశీయులను పశువులకంటే హీనంగా చూస్తున్న మనమీద మనకే ఏవిధంగా అభిమానముంటుందో తోచకుండా ఉన్నది!

ధర్మాధర్మ విచక్షణతో పనిలేనివాళ్లు అంత్యమని ఇంతకాలం హీనదశలో ఉంచినందుకు ఎంతఘోరమైన ప్రతిఫలము రాగలదో ఐనను తెలుసుకోవలసి ఉన్నది. ఇంతకంటె అల్పమైన పరిస్థితులవల్ల ఫ్రాంసు, రషియా దేశాలలో జరిగినవిప్లవములే ఇందుకుసాక్ష్యములు. ఇంత అన్యాయంగా పంచములను పరంపరానుగతముగా చూస్తున్నాము. విద్యఅనేది ఏమాత్రమూ లేకుండా చతుర్వర్ణములవారి దురాగతములకు లోనై వాళ్లుఅధోగతిలో పడి కొట్టుకుంటున్నారు. కాని ఈస్థితి ఎంతోకాలము ఈవిధంగానే ఉండబోదు. నూతనాభిప్రాయములు అతిశీఘ్రముగా దేశమంతటా కలయప్రాకుతున్న ఈరోజులలో విపరీతమైనవారి స్వస్థితి వారికి తెలియరాకపోదు. అప్పుడు వాళ్లు హిందూసంఘమంతటి మీదనూ ఏవిధంగా కసితీర్చుకుంటారో ఆలోచించి అటువంటిపరిస్థితులు రానీయకుండా చేయుట ప్రతి భారతీయుని ధర్మమై ఉన్నది. ఇటువంటి బాధలు పడుతున్న మన పంచమ సోదరులకు దేవుళ్లలాగా మిషనరీలు కనబడ్డారు. విద్యలేకపోంగా కూటికి గుడ్డకు మొహంవాచి గుండె వేలవడిపోయిన పంచములు వందల కొందలు క్రైస్తవులుగా మారుతున్నారు. తమబిడ్డలకున్న వస్త్రాలు ఇచ్చి అంటరానివాళ్లను పరిశుద్ధులనుగా చేస్తున్న మిషనరీ దొరల సహాయమపేక్షించి తమకు విశేషహానిచేసిన హిందూమతము వదలి మతాంతురులుకావడము సంభవిస్తున్నది. ఒక్క గుంటూరు జిల్లాలోనే మాలపల్లెలన్నీ క్రైస్తవపల్లెలైపోయినవి. కొంతకాలమయ్యేసరికి అంటరానివాళ్లంతా క్రైస్తవులుగా మారిపోయి కొత్తపేర్లతో అంటదగినవాళ్లవుతున్నారనే సంగతి గమనించినప్పుడు ఆలోచన గలవాళ్లకు నవ్వురాకపోదు. పంచములు ఈవిధముగానైనా విద్యావంతులై మనపెట్టే నానాబాధలనుంచీ విముక్తులై ఉండటం కొంతమేలే. కాని వీళ్లలో జాతీయత పూర్తిగా నశించి విజాతీయమైన భావాలు కలగడమే కాకుండా హైందవులయందు ద్వేషభావము కలవాళ్లుకూడా అవుతున్నారు. మతాంతరులైన విదేశీయులు ఎంతసదుద్దేశాలతో మన పంచములకు విద్యనేర్పినప్పటికీ ఆవిద్య అక్కరకురాదు. మనవాళ్లకేమి కావలసియున్నదో వాళ్లు తెలుసుకొనలేరు. పంచములను నిజముగా ఉద్ధరించవలసిన బాధ్యత మాత్రమేకాక సామర్థ్యముకూడా మనవాళ్లకే గాని అన్యదేశీయులకు లేదనే విషయము ఒక్కసారి పెదపాలెంవెళ్లి కృష్ణాశ్రమము దర్శించినవాళ్లకు బోధపడుతుంది.

పెదపాలెమునకు మూడు ఫర్లాంగులలో శ్రీకృష్ణాశ్రమం నిర్మాణమైనది. ఏవైపుచూసినా పచ్చని పొలాలూ, తోటలూ కన్నులపండువుగా ఉన్నవి. ఆశ్రమాన్ని ఆనుకునే ప్రవహిస్తున్న కృష్ణకాలవ మనోహరంగా ఉంటుంది. ఈ ఆశ్రమము పూర్వకాలపు ఋషుల ఆశ్రమాలవలె శాంతికి ఉనికిపట్టై ఉన్నది. ఆశ్రమ బాలురను చూచినవాళ్లు నిమ్నజాతి వాళ్లలాగా ఏమాత్రమూ కనపడరు. ప్రాతఃకాలము నేలేచి కాల్యాలు తీర్చుకొని వసతిగృహమునకు కావలసినమంచితీర్థము చేరబోసుకొని వంతులప్రకారము పనులన్నీ నిర్వహించుకుంటారు. ఆరుగంటల ప్రాంతాల రెండువేళలా స్నానంచేసి ఉతికి ఆరవేసుకొన్న బట్టలు కట్టుకొని అంతా కూర్చుని దైవప్రార్థన చేసుకుంటారు. అటుపిమ్మట చదువులప్రకుక

మిస్తారు. బాలురకు నేర్పు విద్యలలో తెలుగు భాష, రామాయణ భారతభాగవతాలు, గణితము, హిందూదేశ చరిత్ర, భూగోళశాస్త్రము, కొంచెం ఇంగ్లీషు ముఖ్యమైనవి. ప్రతి నిత్యమూ నియమిత కాలాలలో విద్యార్థులూ విద్యార్థినులూ నూలు వడుకుతారు.

ప్రస్తుతము ఈ ఆశ్రమములో ముప్పయి మంది బాలురకూ ముగ్గురు బాలికలకూ ఉచితంగా భోజనము పెట్టి విద్య గరపుతున్నారు.

## ఈ ఆశ్రమ ఉద్దేశాలు

౧. ప్రస్తుతం పంచములనే వారికి భోజన వసతు లేర్పరిచి విద్య, చేతిపనులు ఉచితముగా నేర్పడం.

౨. ఇతర గ్రామములలో పాఠశాల లేర్పడడం.

౩. పంచములయందు లోకులకున్న దురభి ప్రాయములు తొలగించడము.

౪. పంచములు మతాంతరులు కాకుండా చూడడము.

ఈ ఆశ్రమానికి మహాత్మా గాంధిగారి శిఫార్సు వల్ల తిలకు స్వరాజ్యనిధినుండి 5,000 రూపాయల విరాళమును ఇచ్చిరి. గుంటూరుజిల్లా కాంగ్రెసు సంఘము వారు 700 రూపాయలను రాష్ట్రసంఘమువారు 500 రూపాయలను దీనికి దయతో విరాళము ఇచ్చిరి. పుతుంబాకవారు కొని ఇచ్చిన యకరము స్థలములో రు 6000 కిమ్మతుగల భవన మొకదానిని నిర్మించిరి. ఇంతవరకు ఆశ్రమానికి ఇచ్చిన విరాళముల మొత్తమూ ఖర్చుపెట్టిన సొమ్మూ తదితర విషయములు ఆశ్రమ స్థాపకులు త్వరలోనే ప్రచురింపనున్నారు.

నూర్గురువిద్యార్థులకు భోజనపు వసతు లేర్పరచి గుంటూరులో 50 మంది బాలురకూ పెదపాలెములో 5 మంది బాలికలకూ విద్యనేర్పవలెనని ఆశ్రమస్థాపకులసంకల్పము. తగిన ధనమున్నచో విద్యార్థుల ఉపయోగార్థము ఒక ఆయుర్వేద వైద్యశాలకూడా పెట్టవలెనని వారి కుతూహలము.

నూర్గురువిద్యార్థుల భోజనపుఖర్చునకుగాను (జొన్నన్నము) దినమునకు పన్నెండురూపాయలు కావలెను. ఉపాధ్యాయుల వేతనములకూ తదితరఖర్చులకూ షుమారు రెండువందలరూపాయలు నెలకు కావలసిఉంటుంది. ఆశ్రమమును నిరంతరాయముగా కొనసాగించడానికి అనమపక్షము ఒకలక్షరూపాయలు కావలసిఉన్నది.

ఈఆశ్రమాన్ని అభిమానించి సర్వవిధములతోడ్పడి ఈ ఉద్యమాన్ని పెంపొందింపచేసే భారం ఆంధ్రదేశీయులపై నున్నది.



# భాగ్యములు

టి. శివశంకరం పిళ్లే గారు

పుడమిలో నితరులు పడుసంకటముఁ జూచి, బాగుగాఁ దీర్చెడి భాగ్యమొసఁగు
జనులందు వినయంబు తనరంగ దైన్యముల్, భయమును బాపెడి భాగ్యమొసఁగు
నాథులులేని యా నారీమణుల నేత్ర,బాష్పముల్ దుడిచెడి భాగ్యమొసఁగు
తల్లిదండ్రులులేని తనయవర్గమునెల్లఁ, బటుప్రీతిబెంచెడి భాగ్యమొసఁగు
గీ. దిక్కు దరిలేక మృతినొందు దీనతతిని, గాచి సంస్కార మొనరించు కరుణ నొసఁగు
నిదురవోయెడివారిని నదనెఱింగి, మెలయ బోధించుదయ నిమ్ము వేదవేద్య!




ఎనమండ్ర నారాయణమూర్తి గారు

శ్రీకరు నిఖిలైకసేవ్యు, భూతేశు,
భవగహనసుపంథ బరమార్థగోప్త
సేవింప నుత్సహించితి జగత్త్రాణు—
బహుపురుషార్థ సంపాదిగానోపు
తనుభిక్షనిడి కృతార్థతనొంద బనిచె
గాన నాకల్యాణకాము సంప్రీతి
ఋణవిముక్తుడ నౌదు నిహపరంబులకు—
మఱిమఱి కల్గునో, మానునో భవము
కలిగి, నిజోల్లోలకల్లోలములను
దహతహవెట్టి శాంతిమడించునేమొ—
అటుగాక మోహమద్యము జూరలిచ్చి
క్రోలించి తన యింద్రజాలంబు నెరపి
మైమఱపించియే మఱుమనో శివుని—
వలనుగలప్పుడే వదల నీకొడిసి
పట్టి చిత్తంబు సత్పథమందు బెట్టి
లోకహితంబును లోకేశుపూజ
గావించి తరియింతుగాక సంసృతిని—
నలుగడ జెలగె సన్ననిచల్లగాలి
ప్రకృతిని నెలకొన్న పరమశాంతైక
రసము బోషించుభారతి వృత్తివోలె—
చుట్టురసాలనిష్కుట వీథినుండి
పికశారికలు చిత్తపీయూషమైన
నవనవస్వరమేళనంబు గావించి
స్వాగతము దయ భాస్కరునికిం బాడె—
అవలఁ బాథోధి నిరంతరాయముగ
గొల్పునోంకార నిర్ఘోషాప్లుతముల
నమరె మనస్కార మమనస్క మందె
రేయెల్ల నిజరూప రేఖలంబాసి
యలుగులవడి తల్లడిల్లి భూతధాత్రి
చెఱగది వీడి వచ్చెడి సాధ్విబోలె
సాదరమతి సుప్రసాదంబు జిల్కె—
ఈశుభావసరాన నీశ్వరార్పణము
గావింతుగాక సంకల్పంబులన్ని
దయచేసి నిఖిలభూత ప్రపంచంబ
సమ్మతింపు—సహాయసంపత్తినింపు
కలగనియ్యకుభావ కాసారవారి
చెదరనియ్యకు నిల్పు శివునభివ్యక్తి—
వలచి మేల్సేయు మంగళశక్తులార!
తెలియక పాలించు దేవతలార!
నాసమయం బవిఘ్నంబుగా బ్రోచి
పావనాచారత, భావనిర్మలత
నర్హునిసేయుడీ హరునాశ్రయింప—
ఇంద్రియగ్రామమా, హృత్కోశమందు
దైహికవాంఛల దగలనీ కాపు—
చిత్తపుదేటి, నీశీలంబు మాని
పరిపరియిటనట బడమానకాగి,
యిలగలపూవులం దెల్ల వేసరక
శివచరణాంభోజసేవపై జొక్కు—
అరిషట్కమా, నీపరాక్రమంబులకు
బనినడ దిప్పు దవ్వుల బెట్టుకొంత—
అడిగి యైహికదైవతారాధనముల
నాత్మరక్షణకు, ధర్మావిరుద్ధముగ
దెచ్చికొందును మాఱుతెఱవు లేనపుడు—
ప్రకృతిమాతృక, నీదు ప్రత్యంగమందు
బ్రత్యవస్థను రూపభావంబులందు
నంతరంగంబున నద్వైతశాంత
శాశ్వతశైవంబు జాటుమా మదికి.

2. విసుగనియావి, నక్కటిక
వీడని రీవి క్షమార్ద్రిశౌర్యతన్

గోపరనిపూర్తి గీడొందవ
గూడని పూన్కి నభంగసింధువై
యసదృశపాండితిన్ భవము
నంతటి కాదరువై భరించు నా
కుసుమశరారి విశ్వమయు
గొల్తుమహేశు ననన్యభక్తిమై.

3. శిరమున జాహ్నవీతటిని
శీతకరుం డిరువంక గౌరియున్
గరిముఖుడున్ గరంబులమ్రు
గం బభయాంకము శూలమక్షమున్
వరల ననంత విశ్వహిత
వైఖరితో శుభమూర్తి విఘ్నరా
డ్గురు డిరవొందు బుద్ధి బురి
కొల్చుచు నా హృదయాబ్జ పీఠిపై.

4. అరనిమిషంబు వాయదు తదేకాకాంక్ష
దరితీపుపుట్టించి దాస్యమొందు
గపట, మోహిని, వ్రజకఠినాత్మ, చంచల,
యట్టి మిన్నందెంచు నిట్టి మన్ను
బోనిలోజొచ్చి బెబ్బులిని మేపుకొ యింత
పాపిష్ఠి దొరసాని ప్రకృతిసేవ,
నమ్మనుదాని, నీనతిమాన నిహపర
సాధనంబట భవచ్చరణభక్తి
కాన నందీశు నెక్కి దిక్తతి నెలుంగ
సురలజయజయ నిర్ఘోష మెరసి మ్రోయ
గౌరితో బుత్రుతో ననుగ్రహము వడసి
రమ్ము నాపూజకై స్వాగతమ్ము గొమ్ము.

5. దివ్యక్షమాపూర్ణ తేజోనిధాన
పరమపూరుష! లోక పావనారంభ
దయచేసి నాదు డెందపుగద్దెమీద
నధివసించి సమర్చ లందు నాచేత—
కలుషము జొరనీదు, కఠినంబు గాదు,
పులకించు నీరూపు పొడసూపునంత—
వరసమాగమ కాంక్ష వృత్తియై వాడు
వధువొనా నీకయి వనట జెందినది
నిను జెప్ప ననలొత్తు నీదాసులన్న
జేతులజేర్చ నీభూతంబు లందు
దయజేపు, నెఱజొక్క, త్యాగంబునించు.

భవపాశమింక వీడవటందువేని
దానసీ సర్వోన్నత స్థానమెక్క—
నిరసింతో నీచాతి నీచంబటంచు?
తొలగుదో నేను మర్త్యుడనె కాదలచి?
తగు నేది నీమహత్త్వ పవిత్రతలకు
తగని దెయ్యది నీదు దాక్షిణ్యమునకు
నిగమాంత గుహ్యుండ వగుదు, బ్రహ్మాన్య
గమ్యుడవై తేమి, కరుణాంబు నిధివి.

పతిత పావనుడవు భక్త వశ్యుడవు:
నీకృప నీపొక్క నిర్హేతుకంబు
కాదు బీజముపంట గానినా సత్త.

6. భువనోద్ధారక రేఖము
భవశరణ స్మరణ మాత్ర పదార్కంబుల్
దివిజర్షి యోగలక్ష్యము
భవ! నీపద యుగళి కిదిగో పాద్యముగొనుమా.

7. అమృతవర్షంబయ్యె నపమృత్యుహతిభీతి
శరణన్న మార్కండి శిరమునందు,
ఘన పితృత్రాణ భరంబు గాసింప సగరైన
తరి భగీరథు జను స్త్రోత్రమయ్యె,
ఫలమయి బహుభావి ఫలమయ్యెభక్తిని
బగను సాధించిన ఫల్గునునకు,
అశనిపాతంబయ్యె దిశల సాధుజనార్తి
మ్రోయించుఘోర త్రిపురములందు
నీకరస్పర్శ—జగదీశ, నేడు జన్మ
పావనంబయ్యె భవమః సంపన్నమయ్యె
నాత్మ నవనీతమైపొంగె హర్షపూర
మగుచు గనులంట దీన నర్ఘ్యంబుగొనుమ.

8. ఉదయరవిప్రభల్ హిమవ
దున్నతశృంగ గతాభ్రశుభ్రమల్,
మృదులకలాకలాపము ల
మేయ మణిద్యుతి హేమకుంభముల్,
వెసత్రివేణికాహృదయ
వీచి జలంబులదెచ్చి నించితిన్,

సదయుడవై గ్రహింపు సుర
　　సమ్నుత యాచమ నీయకంబుగా.

9. సారెసారె నిక్షుసారంబు క్షీరంబు
గోరసంబు నారికేరవారి
బుష్పఫలరసంబు బూరించి వెనుదీసి
రాజసంబు నీకు రమణగామి —

10. ప్రాముఖ్యంబున మేటి నీకు బ్రియతన్
　　బ్రాణంబు మత్పావనం,
బామందాకిని తోయమందు గొని ధ
　　న్యం మన్యభావోద్ధతిన్,
వ్యోమంబంటుచు దివ్యరుద్రనమకం
　　బుత్కంఠ జెప్పన్ సుధా,
స్తోమంబై వరమయ్యె— దీన గొనుమ
　　స్తోకాభిషేకార్చనల్.

11. మెత్తని ధౌతవస్త్రముల
　　మేలిమి బోలిన నీకు భాంకకం,
బొత్తదునా ప్రవాళ రుచు
　　లొల్కు భవచ్చరణాబ్జ యుగ్మకం,
బెత్తుక తన్వితీర భవ
　　మెల్ల ఫలించె నటంచు గన్నులన్,
హత్తుక చొక్కునా పెదవు
　　లందున వక్షమునన్ శిరంబునన్!

12. లోకమునిండు నీకు నను
　　రూపమెకాని దిగంబరత్వ మెం
తో కృతకృత్యుజేయ స్వయ
　　ముత్సుకతన్ గ్రహియింతు సుప్రస,
న్నాకృతి దాల్చి మత్కృత స
　　మర్చల గావున గొన్మువీని న,
స్తోక శరద్వధుద్యుతుల
　　తో నటునేసిన పట్టుపుట్టముల్.

13. వ్రతినై సంయమినై భవాద్భుత విధి
　　ప్రాధిష్ఠితామ్నాయ సం,
హిత లోంకార శిరంబు లైశ్వరకలా
　　న్వాద్యార్థముల్ చేర్చి కూ,
ర్చితి హర్షంబు ముఖాబ్జపజ్క్తి దళుకుల్
　　చిమ్మంప గాయత్రి స,
మ్మతి మేల్కొలు పవిత్రపాత్రమనె—
　　గొన్మా యజ్ఞసూత్రంబిదే.

14. కలలో వైభవ మాదితేయులకు సం
　　కల్పాగ్రమవ్వేధకున్
గలిదుష్ప్రాప మగణ్యపుణ్యవశతన్
　　గాకొంద నీకొల్వు నే
దెలియన్ హర్షము దెల్పు టెట్లు! మణిదీ
　　ప్తిన్ దారలేకాని తా,
రలె యీ భూషలు నీవిలాసనుమ మా
　　ప్రద్యోతన జ్యోతికిన్.

15. ఘనసార మగరు కస్తురి
మనసార గులాబినీట మర్దితమగు చం
దనమందు మెదిపి మెయిం బూ
తునొ మరువపు వీజనములతో వీతునొకొ!

15. నిసిని వెన్నెల మెక్కి నీహారరుచిజొక్కి
　　తెమ్మెరమూపెక్కి తిరుగు దిశల,
ననవిల్తు సమ్మోహనపు వన్నె మేలిమై,
　　కనుగీటు బాలభాస్కరు రహించు,
రాజత సౌవర్ణరత్నదీప్తి నొకింత
　　కైసేయు సరస సౌగంధ్యయుక్తి,
బుడమిచేడియ హాళి బులకించు పులకలో
　　భద్రహాసములొ సౌభాగ్యగతులొ,
యీ సుమంబులు నీపూజకై సృజించి
తొలుత బూజాఫలంబందె నలువ యిపుడు
సార్థకములయ్యె గాకేమి జగతి నీ వి
లాసములరాశి మఱి దేన వాసిగాంచు.

17. బిల్వదళంబ, నీ మహిమ
　　జెర్వొనబూన శివార్చలందు నిన్,
బిల్వ దళంబుగా మహిత
　　బీజపు టక్షరమందు గాని నీ,
కొల్వు ప్రభుప్రసాదధుని
　　కుల్యయె! చిత్తపు నిత్తెమల్లలో,
జెల్వుఘటింపుమా సురల
　　సేవకు మున్బడి తత్పదస్థలిన్.

18. ఇల నిలలేక నీ పదము
లే గతిగా శెరనమ్మి యొక్క పె
ట్టెలుగిడు నా ర్తరావ మటు
హెచ్చి దివిన్ సరళద్రవంపు దా,
వుల వెదజల్లు దేవతరు
వుల్ రజతాద్రినిబోలె నీకు న,
ర్మిలి పచరించి మద్గృహము
రెండవ తావలమట్లొనర్పవో!

19. జ్యోతిర్మయుండ వర్యమ
శీతాంశుప్రభృతియు వహ్ని జీవము నీవే—
యీ త్రైలోక్యజ్యోతులు
నాతనివికిగాదు లావునకె మేర సుమీ.

20. పండినవరిమళ్ల బాడవల్ దాటి
మందారవని బాసి మలయానిలంబు
జలజకల్హారడోలల నోలలాడి
కుసుమితమాలతీకుంజంబు జేరి
యతిమంజుగతి బాడియాడెడిపట్ల—
ప్రతిఫలించు బెడంగు పసిడిపళ్లెములం
బచ్చతాదిన్నెలపై నమర్చితిని
శతవిధఫలమూల శాకసారంబు
బహుదేశమృదుపాక ఘృతిలక్ష్యంబు
నైవేద్యమిదికొమ్మి దేవదేవేశ—
విశ్వభోక్త వనంత విశ్వంబునిన్నె
యమితరూపగుణక్రియాసమేతముగ
జేరి నీకనుభోగ్య సిద్ధితో ముగియు—
అంతటిమేటి కియ్యది యెంతపాటి
యని కొంత శంకించి యనితరాపేక్ష
నీభవ్యకృప నెంచి నాభాగ్య మెంచి
యారటగొని యెంతో యుత్సాహపడితి.

21. కానుకలకొల్కి—పూస మాంగళ్య రేఖ
యిచ్చి ప్రాధేయము, పరిగ్రహించి సుప్ర
సాద మన్యోన్య సారవిశ్వాససాక్షి
కమ్మకప్రంపువిడెముగై కొమ్మ దీని—

22. జయజయ మంగళాలపన
సంగతి నీభువనైకధారకం
బయిన మహోద్ధతిన్ దవిలి
యారసి యారసి మెచ్చి మెచ్చి త
న్మయముగబట్టు నారతియు
నారతి, నామది, నేను, విశ్వమం
తయు నన్నుభాస లీనమగు,
దద్ద్యుతి భావ్యపవర్గసూచియై.

23. వెలుగొందు తేజంబు విస్ఫులింగముగ
దడబడు సంభ్రమంపు తరగతుంపరగ
జెదరి నిన్నుండివచ్చిన నాటగోలె
తుదయు మొదలులేని స్రోవలంబట్టి
పరితపించుచు వేయు బ్రహ్మకల్పంబు
లన వినలేని బ్రహ్మాండంబులెల్ల
ద్రిమ్మరి మితిలేని దేహముల్ దాల్చి
కడకెట్లొ దైవ యోగముచే దమంత
దరియించుటేపాటి దర్పమేపాటి!
నాటికి నేడె పూర్ణప్రబోధమున
దీక్షదీక్షను నీకధీనంబు సేతు
మంత్రపుష్పము పేర మన్మనోబ్జంబు
నాచిత్తమును, బుద్ధి, నా యంతరాత్మ
సంకల్పములు, నభీష్టంబు, లూహలును
నాశక్తి, యాసక్తి, నాదు సర్వస్వ
మారగించి రచింపు మద్వైతసిద్ధి
కై కొంటివేని సంకల్పంబుదీని
భవమెల్ల నీసమర్పణముగా గడపి
పరమందు నీభవ్యపద మాశ్రయించి
యిందునందున నిన్నె యెడ బాయకుందు.

24. జేజే జగత్పావన ప్రావనారంభ, జేశంకరా, చంద్రమౌళీశ్వరా, భానుకోటి ప్రభాభాసమానాంగ, గారీశ, విశ్వేశ, విశ్వాశ్రయా, విశ్వచైతన్య, భద్రాత్మ, నీభద్రసంకల్పమే విశ్వమూలాగ్రముల్, సర్వభూతప్రపంచంబునీలీల, నీ ఱెప్పపాట్లే భవోత్పత్తినాశంబు, లీసూర్య చంద్రుల్ భవన్నేత్రముల్, సర్వతారాగ్రహంబుల్ భవత్తారహారంబు, లీయంతరిక్షంబు నీమేను, నీభర్మచేలాంచలంజప్పదిక్పాలి, నీయేండ్లుకాలంబు, నీజిహ్వవేదంబువే దాంతమున్, సర్వతత్త్వాది సారంబు నీమూర్తి, నీమంద

హాసప్రసాదంబు ధర్మార్థ కామాపవర్గాది రాజ్యాభిషేకంబు, దేవా, మహోద్దామ దివ్యప్రభావా, మహోదారకారుణ్యభావా, కృపాపాంగ నిర్మూలితా జన్మపాపౌఘ, నీమెప్పుకే నెంతవాడన్, మహాపారరోదోంబుధిన్ మూగి తూగాడు గోళాంతరీపంబులన్ నిండుభూతార్బుద శ్రేణియందొక్క నల్లైన గానట్టి నేనేడ, నన్, లోకమున్, గన్నలోకేశుకన్నన్ గరిష్ఠుండవై నన్ను బాలించు దైవంబు వేరేమి పెద్దోడ వీవేడ, నీసర్వభూతంబులన్ దారతమ్యంబులే కొక్కరూపై సదా సర్వలోకైక భాగ్యంబుగానొప్పు నీదివ్యవాత్సల్య మేహేతువౌగాని పక్వాన్న సంప్రాప్తికిన్ నోతునో నోచనోయంచు దొట్రిల్లువేళన్ సుధాసారభోగంబు సంప్రాప్తమైనట్లు నీదర్శనంబయ్యె, నీప్రాపు సేకూరె భూతేశ నేధన్యుడన్ నేడు- నీభవ్య సాక్షాత్కృతి గ్రీష్మమధ్యాహ్న నీహార మట్లంతరించెన్ భవక్లేశలేశంబు లీవైయెహికైశ్వర్యముల్ పాయసాన్నంబు పైనీరసాన్నంబు దిన్నట్టుచేదయ్యె, స్వర్గాదిభోగేచ్ఛలెల్లన్ దివాతారలై మాసె, నింద్రత్వమున్ గైకొనన్ వేడినన్ నేడు; నీపూర్ణభాసంబు గన్నారగన్నంతలో జూపుమేల్కాంచి, యీద్వంద్వ భూయిష్ఠసంసార మీజంగమస్థావరాకార విశ్వంబు నీరూపులోలీనమై నీవెగాకొండు బుద్ధీంద్రియాగోచరంబయ్యె, నిన్ దక్కనేనన్యమున్ గానలేకుంటి; నింతేల, ఖద్యోతబింబంబు నీక్షించుడున్ దక్కలోకంబిరుల్ గ్రమ్మిన ట్లైహికాముత్ర భేదంబె నిస్సీమమైమాసె—నియ్యాంధ్య మెక్కాలమున్ నిల్పు, మెక్కాలమున్ నీవె నాబుద్ధి ప్రేరింపు, నిన్ జూచు కంటన్ జగంబెట్టు వీక్షింతు? నిన్ గొల్చు కేలన్ భవంబెట్టు సేవింతు? నాచెయ్వులందెల్ల నీదాస్యబుద్ధిన్ మదిన్ గొల్పు, నీయందు నానెమ్మనంబీభవంబేమరుంగాక-నాకిట్లిహంబందె యద్వైత భావాప్తిమై నిత్యకైవల్య సంప్రాప్తిగావింపు మీశా, భవోత్థాతలీలాదురాధర్ష కుంభీశ, నీసేవకుం దార్పగారాని యైశ్వర్యమేనొల్ల, నాపూనికిం బ్రోవు, నీప్రీతియేకాని లాభంబు, విప్రీతియేకాక నర్థంపు జిత్తంబు ప్రాపింప నీకో మహాదేవదేవేశ-నీభక్తిబోషింపగానీని, నీపాదసేవా దరాయత్తుగానీని మోదంబు ఖేదంబుగా నంతరంగంబు రోయించి ప్రుక్కింపుతండ్రీ!! ఇదెట్లుండ, జన్మంబు జన్మాంత రారంభ సస్యం, బజ జ్ఞాత పూర్వోత్తరంబాట నీమేటి కేలూత లేకున్నచో సూత్రబంధ చ్యుతిన్ జారి వాతాహతిన్ వ్రక్కలై నేల పాలైన కేలీపతంగంబులీలన్ భవంబెల్ల దుర్దైవమై యుంద నందుం జెడుం గాన నాపాలి దైవంబవున్ ముక్తినిర్ణేతవున్ నీవయై మోక్షనిశ్రేణిగా జెల్లు జన్మంబు సార్థంబుగావించి మోక్షాంతరాయంబుగానీని శ్రేయోదయంబెంతయున్ గూర్చి నాభద్రసంధాతవున్ వజ్రవర్మంబవై ప్రోచి పాలింపు మో సుప్రసన్నా, భవా, భక్తమందార మృత్యుంజయా, శర్వ, శూలీ, విరూపాక్ష, మాహేశ్వ భూషితార్ధాంగ, గంగోత్తమాంగా, కపాలీ, కపర్దీ, హరా సర్వశక్తీ, నమస్తే, నమస్తే, నమస్తే.



# భద్రావతి ఇనుము, కలపభృతి పరిశ్రమ

వి. యస్. చిన్నస్వామి గారు, బి.ఏ.,

వ్యవసాయమునకు పేరుగాంచిన భారతదేశమున ఐరోపామహాసంగ్రామ సమయమున నొక్కమారుగ పరిశ్రమాభివృద్ధి గావింపవలయునను గొప్ప చలనము గలిగినది. భారతదేశమందలి అన్నిరాష్ట్రముల యందును, స్వదేశసంస్థానములయందును పరిశ్రమలు బయలుదేరినవి. స్వదేశసంస్థానములలో నెల్ల మైసూరునందలి పారిశ్రామికాభివృద్ధిని బరికింతుమేని ఆశ్చర్యము గలుగక పోదు. అచట పెక్కు పరిశ్రమలు జయప్రదముగ సాగుచున్నవి. వానిలో మైసూరులోని సబ్బులపరిశ్రమ( The Mysore soap Factory), బెంగుళూరు మైసూరులందలి చందనతైలగ్రహణ యంత్రశాలలు (Sandalwood Oil Factories in Mysore & Bangalore), భద్రావతి ఇనుము, కలపస్రుతిపరిశ్రమ(Bhadravati Iron&wood distillation works) ముఖ్యముగ పేర్కొనవలసినవి. ప్రస్తుతము మనప్రశంస శ్రీ సర్. యమ్. విశ్వేశ్వరయ్యగారు యంత్రములను తయారుజేయుటకు పనికివచ్చు పరికరముల పరిశ్రమలవిషయమై కావించుచున్న యద్భుతకృషి విషయమైనది.



మైసూరు ఇనుముపరిశ్రమాలయము

బ్రహ్మాండమగు నీపరిశ్రమను నెలకొల్పుటకు మూలధనము నూటయేబదిలక్షల రూపాయ లయ్యెను. ఇనుముపరిశ్రమ కనుకూలము లెక్కువగాగల అన్యదేశములీవ్యాపారమును గుత్తగొన్నట్లు,లాభమును పొందుచున్న సమయమున, దీనికై యింతపెద్దమొత్తమును వినియోగించుట కెంతయో పట్టుదల, కార్యనిర్వహణకౌశలము, మనోధైర్యము నావశ్యకములు.

పాశ్చాత్యపద్ధతుల ననుసరించి, ఇనుము, ఉక్కు పరికరములను అధికముగ తయారుచేయుటకు తొలుదొల్త టాటాకంపెనీవారే ప్రయత్నించిరి. భారతదేశము అమూల్యములగు ఇనుపగనులకు ప్రఖ్యాతి గాంచినది. ప్రాచీన భారతదేశము లోహవిజ్ఞానమున నెంతనేర్పుగల్గి యుండియున్నను, ఖండాంతరములనుండి దిగుమతియగుచున్న చౌక ఇనుము, ఉక్కుపరికరములవలన నిపుడు ఇక్కడ గనులనుండి త్రవ్విన యినుమును కరిగించి శుభ్రముచేయుపని సంపూర్ణముగ నశించినది. బొగ్గుగనులు, సామానుల ఎగుమతిదిగుమతులు చేయుటకు వలసిన సౌకర్యములు సమీపమున లేకుండుటవలన నవీనపద్ధతుల ననుసరించి గొప్పఇనుము పరిశ్రమాలయములను స్థాపించుటకు వీలుగాకున్నది. కాని పై సదుపాయములు కొన్నియైన నుండుటచేతనే జంషెడ్పురమున టాటాకంపెని జయప్రదముగ సాగుచున్నది.

భారతదేశమున మైసూరురాజ్యము ఖనిజసంపదకు పేరుగన్నది. అచ్చట గనులలో చాలకాల

మునుండి బంగారము దొరకుచున్నది. ప్రపంచమునకు వలసిన మాంగనము (Manganese) చాలవరకు భారతదేశముననే లభించుచున్నది. అందు మూడువంతులు మైసూరురాజ్యమున నుత్పత్తియగుచున్నది. నారరాయి (Asbestos), క్రోము ఇనుపరజము (Chrome iron Ore) మాగ్నిసైట్ (Magnesite), మొదలగు నితర ఖనిజములనేకములుకూడ నచట విస్తారముగ దొరకుచున్నవి. ఇట్టి లోహపుగనులుగల 46, 446 ఎకరములభూమిని మైసూరు రాజ్యాంగమువారు కవుళ్లకిచ్చియున్నారు. భద్రావతి పరిసరప్రదేశములయందు మిగుల విలువగల యినుము దొరకుచున్నది. కాని బొగ్గు ఆసమీపమున లభింపమిచేత ఇనుముపరిశ్రమ అధికముగ చేయుటకు వీలుగాకున్నది.

కడచిన యుద్ధసమయముననే కలపనుండి ధృతిని, కొన్ని యితరఉపయోగకరము లగు వస్తువులను, సంపాదింపవచ్చుననియు, అది లాభకరమగు నొక ముఖ్యపరిశ్రమయనియు తేలినది. అమెరికా, జర్మనీ, ఫ్రాన్సుదేశములయందు ఏఁటేట వేలకొలదిటన్నుల కలపనుండి ధృతి దీయుచున్నారు. విస్తారముగ అడవులులేకుండుటచేకలప చాలతక్కువగా దొరకు ఇంగ్లాండుదేశమునగూడ ఈపరిశ్రమ సాగుచున్నది. ఇట్లు పారిశ్రామిక ప్రపంచమున, జరుగుచున్న మార్పులను, ప్రవేశించిన నవీనమార్గములను, అభివృద్ధిని మిగుల శ్రద్ధతో గమనించి శ్రీవిశ్వేశ్వరయ్యగారు తమ సూక్ష్మబుద్ధిచే పరిశుభ్రమగు పోత యినుము పరిశ్రమను సాగించునుపాయమును కనుగొనిరి. ఇనుము గనులకు చేరువను ఎడతెగకుండ కఱ్ఱదొరకు అడవులుండుటచే ఈపరిశ్రమను సాగించి లాభమును బొందు ప్రయత్నములు జరిగెను. మిగుల కాకనిచ్చెడుబొగ్గు(Charcoal of high calorific value), పెక్కురకము లగు పిరోలిగ్నియస్ ఆసిడు (pyroligneous acid), లోహామ్లము (Sodium acetate), సున్నము, రాగి, సీసములు గూడిన అసిటేటులు(Acetates of lime, copper and lead), కలపమద్యసారము (Methyl-wood alcohol) ఫార్మలీను (Formalin), అసిటోను (Acetone), అయిడోఫారము (Iodoform), కీలు. తారు, ఇతర విధములగు పలుచని తైలములు పైలోహపరిశ్రమ వలన లభించు ఇతరపదార్థములు. ఇవిమాత్రమే కావు; ఇంకనుఎన్నియో విలువగల పదార్థములుకూడ లభించుచున్నవి.

భారతదేశమున బొగ్గు అధికముగ తయారగుచున్నది. కాని తయారుచేయుపద్ధతివలన చాలనష్టము గలుగుచున్నది. కాల్చుచున్న కఱ్ఱకు తగినంతబొగ్గు తేలుటలేదు. చాల కఱ్ఱ వ్యర్థమగుచున్నది. నవీనపద్ధతుల ననుసరించి కలపధృతిని ఇనుముతోగాని, ఇటికలతోగాని, పూర్తిగా మూసియుండునట్లు కట్టబడినబట్టీల (Retorts) నుండి తీయుచున్నారు. దానికి అనేకజాతులగు అడవి కఱ్ఱనుపయోగించి పరీక్షింపగా నూటికి 30 వంతులు బొగ్గు, 6 లేక 7 వంతులు తారు, $2\frac{1}{2}$ వంతులు అసెటిక్ ఆసిడు (Acetic acid) 1.3 వంతుకఱ్ఱ ధృతి (Wood spirit) లభించునని విశదమగుచున్నది. ఒకసంవత్సరకాలమున 6000 టన్నులకఱ్ఱను బట్టీచేయుటకుగాను వలసిన యంత్రాదులను సమకూర్చుకొనుటకు రమారమి లక్షరూపాయలగును. ఈవిధమునను నూటికి 20వంతులు కఱ్ఱ తరుగుచున్నది. బట్టీ వేసిన ప్రతి నూరు టన్నులకఱ్ఱనుండి కనీసము 2000 రూపాయలు విలువగల పదార్థములు దొరకుచున్నవి. నికరము 6000 టన్నులకఱ్ఱనుబట్టీవేయుటకు తరుగుతో కలిపి 7,500 టన్నుల కఱ్ఱ కావలెను. ఒకటన్ను వెల అధికపక్షము రు. 5లు అయిన ఈ 7,500 టన్నులు కఱ్ఱవెల 37,500 రూపాయలగును. ఈకఱ్ఱనుండిలభించువస్తువుల విలువ రు 120,000. ఉద్యోగులజీతములు, కూలీలు, మూలధనముపై వడ్డి, ఇతరములగు తరుగులు మొదలయిన వ్యయము పోగా సుమా రేబదివేలరూపాయలకు మించుగనే నికరాదాయము తేలవచ్చును.

నవీనపద్ధతుల ననుసరించి మూతవేసిన యినుపబట్టీలలో కఱ్ఱను పేర్చవలెను. వెలుపలతయారుచేసిన నిప్పు కొలిమినుండి గొట్టములద్వారమున వేడిని ప్రవేశపెట్టి బట్టీలో పేర్చినకఱ్ఱను కాల్చవలెను. ఇట్లు చేసినచో 24 గంటల కొకమారు బట్టీ ముగియుచుండును. బట్టీనుండి లభించిన ద్రవపదార్థములు ఘనీకరణయంత్రములగుండను (Condensors) పదార్థవిభజనయంత్రములగుండను (Separators) వచ్చును. బట్టీయందలి మిగిలిన నిరుపయోగమగు వాయుపదార్థమంతయు బట్టీక్రింద మంటకొఱకుపయోగించును. బట్టీవలన లభించిన ద్రవరూపమయినపదార్థమును కొంతకాలమట్టె యుండనిచ్చిన మూడు వేరు వేరుపొరలుగ నేర్పడును.



మద్యసారమును ఘనీకరించు యంత్రభాగములు (Alcohol condensors)

గోధుమవన్నెయు, నలుపువన్నెయు గల రెండు పొరలకు నడుమనున్న పొరయే పిరోలిగ్నియస్ ఆసిడు (Pyroligneus acid) అనుపదార్థము. మిగిలిన క్రింది, పై పొరలు మడ్డితారును, అసెటిక్ ఆసిడు (Acetic acid) ను గలిసిన మిశ్రపదార్థము. దానినుండి ఆవిరిమూలమున అసెటిక్ ఆసిడు (Acetic acid)ను, పలుచని ఇతర తైలమును వేరుపరుపవచ్చును. పిమ్మట నిలువయున్న తారును మరలబట్టీచేసినయెడల కొన్ని చిక్కని తైలములు, కీలు, తారు, లభించును. నడిమిపొరయగుపిరోలిగ్నియస్ఆసిడు (Pyroligneus acid)ను సున్నముతో విరిచినయెడల గోధుమవన్నెగల అసిటేట్ అఫ్ లైము (Brown acetate of lime) అనుపదార్థము లభించును. కాని సాధారణముగా ఈపిరోలిగ్నియస్ ఆసిడును (Pyrolignens acid) మరల బట్టీచేసి దానినుండి ఇతర పరిశ్రమలకు మిగుల నుపయోగించుకఱ్ఱసారాయము (Wood alcohol) ను, అసెటిక్ ఆసిడు (acetic acid)ను తయారుచేయుచున్నారు.

## ఉపయోగములు

కఱ్ఱసారాయి (Wood alcohol) ని అనేక విధముల నుపయోగించుకొనవచ్చును. విశేషముగ ఫార్మలిను (farmalin) మొదలయినవానిని తయారుచేయుట కది ఉపయోగపడును. నునుపు మెరుపు గల అసెటిక్ ఆసిడు ('Glacial, acetic acid) అను పదార్థమును సంగ్రహించిన పిదప సారము కొరవడిన అసెటిక్ ఆసిడు (weakacetic acid) ద్రవమును సున్నమును, రాగిని, సీసమును జేర్చి విరిచివేయుదురు. రాగికలపిన అసిటేటు (Copper acetate) ముఖ్యముగా రంగువేయుట కుపయోగించును. బూడిదరంగుగల సున్నపు అసిటేటు (Brown acetate of lime) ను బట్టీచేసిన దానినుండి అసిటోను(acetone) అను విలువగల పదార్థము లభించును. అసిటోను తుపాకిమందు చేయుటకు కావలసినవస్తువులలో ముఖ్యమయినది. ఇంకను పైన చెప్పిన పట్టికయందుగల యితరపదార్థము లన్నియు ఒక్కొక ముఖ్యపదార్థముతో ఉచితమైన ఒక్కొకవిరుపు పదార్థమునుచేర్చి తయారుచేయుటచేత లభించుచున్నవి. భారతదేశమంతటను కఱ్ఱబొగ్గుయొక్క ఆవశ్యకత అధికముగ గలదు. కాని అది భద్రావతి ఇనుపపరిశ్రమాలయమున ఇనుపరజమును కరగించుటకే వినియోగింపబడుచున్నది. మైసూరురాజ్యమునకును, తన్మూలమున భారతదేశమునకును, ఆయువుపట్టగు పరిశ్రమయైన ఈయినుము పరిశ్రమను ప్రారంభించునపుడు కలపభృతి పరిశ్రమవంటి గొప్ప పరిశ్రమ సహాయపరిశ్రమగా ఏర్పడుట మిగుల నాశ్చర్యకరమగు విషయము. కఱ్ఱబొగ్గుయొక్క సహాయమువలన భద్రావతి ఇనుముపరిశ్రమాలయమున సంవత్సరమునకు 15 మొదలు 20 వేలటన్నులవరకు పోతయినుము

ము తయారగుచున్నది. ఇంతేకాక భారతదేశమున కలప తొలూకు మద్యసారము (Methylised alcohol) బూడిదరంగుగల సున్నపు అసిటేటు (Grey acetate of lime) మైసూరునమాత్రమే తయారగుచున్నది.

భారతదేశము దారిద్ర్యపీడిత మని పలువురుచెప్పి యున్నారు. ముడిపదార్థములు (Raw materials) గూడ ఇతరదేశములకంటె భారతదేశముననె అధికముగ గలవని మరికొందరు నొక్కిచెప్పియున్నారు. కాని ఇచట సామాన్యముగ పరిశ్రమాభివృద్ధిపట్ల అభిమానముతో తగిన యేర్పాటులను గావింపకుండుటెంతయుశోచనీయమయిన విషయము. ఆలోచనాశక్తి, దూరదృష్టి, కార్యదీక్ష వీని లేమియే భారతదేశముయొక్క లేమికి ముఖ్యకారణము. ఒకొక్కప్పు డట్లుండుటయే గొప్పగా పరిగణింపబడు చున్నది కాని అది నిర్మూలించుటకు ప్రయత్నింపవలసిన రోగమునకన్న గొప్పవిషయముకాదు.

వంటచెఱుకుకంటె కఱ్ఱ వేఱగ ప్రయోజనకారి కాదని మానవసామాన్యాభిప్రాయము. చిన్న పడవలు, తెప్పలు, కాటామరములు మొదలగువానికిగూడ నుపయోగించునని జాలరివాని తలంపు. మానవోపయోగకరములగు ననేకోపకరణములను నిర్మించుటకును బనికివచ్చునని వడ్లవాని భావము. ఉపయోగముననుసరించి ప్రతిభిన్నావస్థ యందును వస్తువుయొక్క విలువ హెచ్చుచుండును. క్రమముగ రసాయన, నిర్మాణశాస్త్రవేత్తలు (Chemists & Engineers) కఱ్ఱనుండి ధృతులను, పెక్కు ఉపయోగకరములగు వస్తువులను సంగ్రహించుచున్నారు. ఇన్నివిధములనుపయోగించునది కఱ్ఱయేకాని ఉపయోగాను గుణముగ దానివిలువ పెరిగినది. ఎట్టి నిరుపయోగవస్తువునైన ఆర్థికాభివృద్ధికి మిగుల ప్రయోజనకారిగా మార్చుటయందావశ్యకమయినది సహజమగు బుద్ధికుశలతయే. అందే యైశ్వర్యము నెలకొనియున్నది. దీనినిబట్టి భారతదేశ పరిస్థితులు తేటతెల్లముగ విశదముకాగలవు. ఐరోపా మహాసంగ్రామసమయమున ననేక నూత్నపరిశ్రమలు దేశమున నెలకొనినవి కాని అవి చాల వఱకు నచిరకాలముననే నశించినవి. ఇట్టిదుస్థితికి ధనాభావము, కార్యనిర్వాహణాసామర్థ్యము, వ్యాపారజ్ఞానశూన్యత, మొదలయినవే కారణము లగుచున్నవి. పరిశ్రమను ప్రారంభించుటకు బూర్వమే దాని భావ్యభివృద్ధినిగూర్చి చక్కగా నాలోచింపవలయును. లేకున్న జయప్రదముగా పరిశ్రమ సాగకపోవచ్చును.

భద్రావతి యినుపపరిశ్రమ మంచి యేర్పాట్లతో ప్రారంభమయినది. దానికి వలసిన మూలధనమును మైసూరు సంస్థాన మొసగియున్నది. కార్యనిర్వాహకులు గడుసమర్థులు. ఈపరిశ్రమయం దుత్పత్తియైన వస్తువుయొక్క విక్రయవ్యాపారాదులను వలసినంతశ్రద్ధతో పరిశీలించి జరుపుచున్నారు. కాబట్టి ఇట్టి పరిశ్రమను ప్రారంభించుటకు మంచియేర్పాటు లావశ్యకములని మఱియొకమారునొక్కి చెప్పుచున్నాను. భద్రావతిపరిశ్రమవలన లభించు వస్తువులన్నియును విస్తారముగా ఇపుడు బజారునందు విక్రయమునకు దొరకుచున్నవి. ప్రశస్తమైన ఇట్టిపరిస్థితులతోను, ఏర్పాట్లతోను ఈ పరిశ్రమ దినదినాభివృద్ధిని జెందగలదని విశ్వసించెదము. చిన్నవిగాని, పెద్దవిగాని నూతనపరిశ్రమలను పైవివరించినవిషయములను మనమునం దుంచుకొని బాగుగా ఆలోచించి ప్రారంభింపవలెను. అట్లు ప్రారంభించిన పరిశ్రమలే చిరస్థాయులై భారతదేశమునకు స్థిరసంపదలై విలసిల్లునవి.



# విష్ణుసర్వోత్తమ శ్రీకృష్ణస్తవము

సుసర్ల రామమూర్తిగారు

శ్రీధామంబగు నీపదద్వితయ సంసేవన్ మదిన్ గోరి, దు
ర్బాధాసంకులమైన యీవిషయ దుర్వ్యాపారముల్ మాని, ని
న్నీధాత్రిస్థలిఁ బెక్కుమార్గముల మౌనీంద్రుల్ నుతుల్ సేయ, లో
కాధీశా! కరుణన్ వహించెదవు కృష్ణా! విష్ణు! సర్వోత్తమా!

చతురంభోధిపరీతమౌ జగతి నిచ్చల్ పూని వర్ధిల్ల స
మ్మతి రక్షింతువు నేర్పుమీఱ మఱియున్ భావింపగా లోక సం
తతికిన్ భర్తవుఁ గర్త వన్నిటికి వింతల్ నీపనుల్ గోపికా
సతులన్ గూడిన లీలలెంచగనుఁ గృష్ణా! విష్ణుసర్వోత్తమా!

సరవిన్ గోవులు ఘాసఖాదనరతిన్ జాలించె సంప్రీతిమై
నురగస్తోమము లాడఁగాఁ దొడఁగెఁ బెల్లుల్లాస ముప్పొంగ, నీ
మురళీగానము నాలకించి యని సమ్మోదింతు రాక్యల్ కదన్
దరమే నీకరుణన్ గణింపగను గృష్ణా! విష్ణు! సర్వోత్తమా!

ప్రాతఃకాలమునుండి సంజవఱకున్ బ్రాల్మాలికన్ మాని, యా
శాతీవ్రంబున నాలుబిడ్డలకు భిక్షంబెత్తి యద్దాన ను
ద్భూతంబౌ క్షుధ మాన్చు పేదయును సంతోషంబుతో లోకవి
ఖ్యాతుండౌ నిను నమ్మినా చెడఁడు కృష్ణా! విష్ణు! సర్వోత్తమా!

జగతిన్ మానవకోటికే వినుతవిజ్ఞానంబు లభ్యం బటం
చుఁ గదన్ మూర్ఖులు పల్కుచుండెదరు సంశోధింప హంసాళి కా
ర్యగురుత్వంబున క్షీరనీరముల వేఱౌభంగి గావింపవే
జగదీశా! భవదీయ చిత్రమిది కృష్ణా! విష్ణు! సర్వోత్తమా!

తను సంబంధ సుఖంబులన్ మఱచి కాంతారప్రదేశమ్ములన్
మునులౌ వారు తపంబు సల్పెదరు నీమూర్తిన్ గనన్ గోరి, తా
నినినున్ జూడఁగఁజాల రెంతకుఁ దగన్ నీదర్శనం బిచ్చి మ
న్నన గావింపవె గోపికాతతులఁ గృష్ణా! విష్ణు! సర్వోత్తమా!

# వేంగిచాళుక్యులు

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

## ౧

బాదామినగరము రాజధానిగఁ బరిపాలించిన మొదటి కీర్తివర్మ కుమారులలో నొకఁడగు సత్యాశ్రయ పృథివీవల్లభ పులకేశిమహారాజు క్రీస్తుశకము ౬౦౯ లో చాళుక్యసింహాసనము నధిష్ఠించెను. ఈతడు చాల పరాక్రమవంతుఁడు. పూర్వ దక్షిణ దేశములను జయింపఁ బూనికఁ గొని తన యనుజుఁడును, అప్రతిమానవీరుఁడును, విషమములైన స్థల, జల, వనదుర్గములను సాధించి విషమసిద్ధి యనుబిరుదమును వహించినవాఁడును అగు శ్రీపృథివీవల్లభ విష్ణువర్ధనుని యౌవరాజ్యంబున కభిషిక్తునిం గావించి జైత్రయాత్రకు రణభేరి మ్రోయించెను.

పులకేశి మహారాజు దండయాత్రకు బయలువెడలునప్పటికి తూర్పు సముద్రతీరమున వేఱువేఱురాజులు స్వతంత్ర రాజ్యములను గట్టుకొని పరిపాలనము నెఱపుచుండిరి. ఇప్పటి చెన్నరాజధాని కుత్తరభాగమున కళింగదేశమును గాంగవంశపురాజులు పాలించుచుండిరి. కృష్ణా గోదావరీనదులకు మధ్యస్థమయిన వేంగిదేశమును దెందులూరు రాజధానిగ విష్ణుకుండిప్రభువు లేలుచుండిరి. కృష్ణానదికి దక్షిణభాగమును కాంచీపురము రాజధానిగ పల్లవులు పరిపాలించుచుండిరి. కళింగరాజులకు మొట్టమొదట నొకప్పుడు పిష్ఠపురము రాజధానిగ నుండెను[1] కాని యది వారిక్రింద చాలకాలముండినట్లు కన్పట్టదు. అనతికాలముననే కళింగదేశ దక్షిణభాగము విష్ణుకుండి ప్రభువుల యధీనమయ్యెను. దక్షిణ కళింగమునందలి పటి(ష్జ) కిరాష్ట్రమున విష్ణుకుండి ప్రభుప్రదత్తములైన అగ్రహారములు లేచెను[2]. అప్పటినుండియు విష్ణుకుండి ప్రభువులకు దెందులూరుపురము రాజధానిగ నుండినను పిష్ఠపురముకూడ వారిరాజ్యమున నుత్తర భాగమునందలి ప్రధానదుర్గములలో నొక్కటియై వారి దక్షిణకళింగరాజ్యమును సంరక్షించు సామంత సైన్యాధిపతుల ప్రధానస్థానముగ నుండెను. అయినను అప్పటికిని కళింగాధిపతులైన గాంగవంశరాజులు తాము గోలుపోయిన దక్షిణ కళింగరాజ్యమును మఱల సంపాదించుకొనుటకై ప్రయత్నముల నడపతడపఁ జేయకయుండలేదు. ఇట్టి సందర్భములను స్ఫురింపఁ జేయునదియే విష్ణుకుండి మూఁడవ మాధవవర్మయొక్క పులింబూరు (పొలమూరు) శాసనము[3]. పుల

1. Ep. Ind. Vol xii P.1. 2. Ep. Ind. Vol xii P.133. 3. Cp. No. 7 of 1913—14.

కేశిమహారాజు పూర్వ దిగ్విజయయాత్రకై బయలు వెడలినప్పటికి పిష్ఠపుర మింకను విష్ణుకుండి ప్రభువుల క్రిందనే యుండెను. మహారాష్ట్రకులను, కోసలులను, కాళింగులను జయించిన చాళుక్యవాహిని శత్రుజనదుర్గమమును, దుస్సాధ్యమునైన పిష్ఠపురదుర్గమును ముట్టడించి, మహాభయంకరయుద్ధ మైనపిదప దానిని స్వాధీనపఱచుకొనెను. పులకేశిమహారాజుయొక్క యజేయవీరవాహిని దుస్సాధ్యమని యెన్నికఁగన్న పిఠాపురపుకోట నెప్పుడు లగ్గలుపట్టి స్వాధీనపఱచుకొనెనో నాఁడె పూర్వదేశమున చాళుక్యాధికారమున కంకురార్పణ మయ్యెను.

కోసల, కళింగ, వేంగీదేశములనే కాక చాళుక్యసైన్యములు కృష్ణవేణ్ణానదిని దాటి పల్లవరాజ్యమునుకూడ జయించి శ్రీశైలము మీఁదుగా స్వదేశమయిన కుంతలమునకు మఱలిపోయెను. కాని యవిస్వదేశాభిముఖము లైనపిదప విష్ణుకుండి ప్రభువులు మఱల స్వాతంత్ర్య సంపాదనమునకుఁ జాల పెనఁగులాడియున్నారు కాని పిఠాపురదుర్గము కాని, దక్షిణ కళింగరాజ్యము కాని వారికి స్వాధీనమై యుండలేదు.

నూతనముగ ప్రాక్సముద్రతీరమున చాళుక్యాధికారమునకు లోఁబడిన రాజ్యమున మొట్టమొదట పిష్ఠపురమే 'మొదలి' దుర్గమయ్యెను. ఈ పిఠాపురదుర్గమును జయించుట క్రీస్తుశకము ౬౦౯-౬౧౦ లోగాని లేక రెండుమూఁడుసంవత్సరము లంతకుపూర్వము కాని అయియుండవచ్చును.

పులకేశిమహారాజు పిష్ఠపురదుర్గమును జయించి దానిని తన సైన్యాధిపతు లెవరియధికారమునకైన నుంచియుండవచ్చును; కాని యట్టివారి పరిపాలనము తనకు సంతృప్తిగ లేనికారణముననో లేక మఱియేహేతువు చేతనో పులకేశిమహారాజు అదివఱకే యౌవరాజ్యమునకు పట్టాభిషిక్తుఁడైన తనయనుజుఁడగు శ్రీ సత్యాశ్రయపృథ్వీవల్లభ విష్ణువర్ధనుని తాను నూతనముగ జయించిన వేంగీరాజ్యమునకు క్రీస్తుశకము ౬౧౫ లో నధిపతిగ నియమించెను. ఈనియామకము జరిగినప్పటినుండియే విష్ణువర్ధనుని రాజ్యపరిపాలన సంవత్సర పరిగణనము ప్రారంభ మగుచున్నది. వేంగీరాజ్యమునకు అధిపతి యైనపిదపఁగూడ విష్ణువర్ధనుఁడు పశ్చిమ చాళుక్యరాజ్యముననే కొంతకాల ముండినట్లు ఆతని సతారా శాసనము [1] వలనఁ దెలియుచున్నది. యువరాజపదమున నుండినప్పుడే పులకేశిమహారాజుయొక్క అష్టమ విజయ రాజ్యసంవత్సరమున అనఁగా క్రీస్తుశకము ౬౧౬-౬౧౭ లో అతఁడు బాదామి చాళుక్యరాజ్యమునందలి శ్రీనిలయభోగములోని భీమరథీతీరస్థమగు అలందతీర్థమను గ్రామమును దానము చేసెనని సతారా శాసనము తెలుపుచున్నది. ఈయలందతీర్థము సతారాసమీపమునఁ గల అలుందా యైయుండునని కొందఱి యభిప్రాయము. ఈసంవత్సరముననే ఆతఁడు వేంగీదేశమునకు వచ్చియుండును. ఇట్లు వేంగీదేశమునకు వచ్చునపుడు కాలకంపుఁడనునతఁడు ఇతనికి సైన్యాధిపతియై

1. Ind. Ant. Vol XIX P. 303.



గోఖ్లేహాలులో మద్యపాననిషేధసంఘసభ్యులకు మహాత్మునిహితోపదేశము. డాక్టరు బిసెంటమ్మగారి ఉపన్యాసము.




ఆదిద్రావిడజన సంఘమున మహాత్ముని ఉపన్యాసము

శ్రీ టి. వి. శేషగిరి అయ్యరుగారు మహాత్మునిచెంత నున్నారు

ఏ. రత్నా అండు కో., చెన్నపురి.

యతనియాజ్ఞఁ గైకొని దద్దరుఁడను శత్రురాజు నొకనిం జయించెను. కాని యీదద్దరుఁ డెవ్వఁడో, ఏదేశపురాజో యింతవఱకుఁ దెలియరాలేదు. ఈకాలకంపుఁడు పట్టవర్ధన వంశజుఁడు. విష్ణువర్ధనునినాఁటినుండియు పట్టవర్ధన వంశజులు వేంగీచాళుక్యులకు నమ్మిన బంటులై అత్యంతము రాజభక్తితత్పరులై యుండిరి.

సత్యాశ్రయ పృథివీవల్లభ విష్ణువర్ధనుఁడు యువరాజుగనే వేంగీదేశమునకు వచ్చినను స్వతంత్రుఁడయియే రాజ్యమును బరిపాలింపఁదొడంగెను. ఆతనికి కుబ్జవిష్ణువర్ధనుఁ డని కూడ ప్రసిద్ధమైన పేరు గలదు. అది యాతని రూపము ననుసరించి వచ్చినపేరై యుండవచ్చును. కుబ్జవిష్ణువర్ధనునిశాసనములు విశాఖపట్టణ మండలమునందలి చీపురుపల్లి, సర్వసిద్ధి తాలూకాలలో దొరకుటవలనను, అతఁడు దానమొసంగిన గ్రామములు పైనుడివిన తాలూకాలలోనే కాన్పించుచుండుటవలనను దక్షిణ కళింగరాజ్యముమాత్రమే ఆతనిస్వాధీనమున నుండినట్లును, పిష్టపురమును రాజధానిగఁ జేసికొని యాంధ్రదేశమున నూతనముగ సంస్థాపింపఁబడిన చాళుక్యరాజ్యమును ఆతఁడు పరిపాలించినట్లును విస్పష్ట మగుచున్నది. పలికి (ప్లు)విషయ, దిమిలవిషయములు ఆంధ్రదేశమున చాళుక్య పరిపాలనమును కన్నులారఁ గాంచిన మొదటిదేశములు.

దెందులూరు రాజధానిగ కృష్ణా, గోదావరీ మధ్యస్థమయిన వేంగివిషయమును బరిపాలించుచుండిన విష్ణుకుండిప్రభువులు పులకేశి మహారాజుచే నోటువడినను ఆతఁడు స్వదేశమున కరిగినపిదప మఱల వారు తమ స్వాతంత్ర్యపతాకలను విప్పి తమరాజ్యమును గాపాడుకొనఁ బ్రయత్నములు సలిపియుండిరి. ఇట్టి విష్ణుకుండిప్రభువులలో మూఁడవ మాధవవర్మ యొక్క కుమారుఁడైన మంచన్న భట్టారకుఁడు కడపటివాఁడు. కుబ్జవిష్ణువర్ధనుని కుమారుఁడైన శ్రీ పృథివీ జయసింహావల్లభుని కాలమునగాని వేంగిరాజ్యము పూర్తిగ చాళుక్యులకు స్వాధీనము కాలేదు.

మహాకవియైన దండి ఈచాళుక్య విష్ణువర్ధనునికి సమకాలికుఁడు. యువరాజుగనుండినప్పుడు విష్ణువర్ధనుని ఆతఁడంటిపెట్టుకొని యుండియు, ఆతనివలనఁ దనకుఁదగిన యాదర, సమ్మానములు జరుగకపోవుటవలన ఆతనికి సమకాలికుఁడై, కాంచీపురపల్లవ రాజ్యమునేలుచుండిన పల్లవరాజగు మొదటి మహేంద్రవర్మకడ నాతని యాస్థానకవిగఁ జేరి యారాజుచే మన్ననలను, మర్యాదలను బొంది ప్రసిద్ధికెక్కినవాఁడు.[1]

కుబ్జవిష్ణువర్ధనునికి మకరధ్వజుఁడు, కామధేనువు, విషమసిద్ధి యను బిరుదములుకలవు. ఈతఁడు క్రీస్తుశకము ౬౧౫ మొదలు ౬౩౩ వఱకు రాజ్యముచేసెను.

ఈతనితరువాత ఆంధ్రదేశచాళుక్య సింహాసనము నధిష్ఠించినవాఁడు ఈతనితనయుఁడైన శ్రీ పృథివీజయసింహ వల్లభుఁడు. ఈ

1. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచే నూతనముగ ప్రకటింపఁబడిన అవంతిసుందరీ కథాసారముచూడుఁడు.

తనితండ్రియు, నతఁడునుకూడ తాము పరమ భాగవతులమని చెప్పుకొనియున్నారు. ఈ జయసింహావల్లభుఁడు అనేకశాస్త్రార్థతత్త్వజ్ఞుఁడు; సకలలోకాశ్రయుఁడు; స్వబాహుబలోపార్జితసర్వసిద్ధియై సర్వసిద్ధియని బిరుదమును వహించినవాఁడు. చాల పరాక్రమవంతుఁడు. ఈ తని కాలమునుండియు కళింగాధిపతులైన గాంగవంశపురాజులు తాము గోలుపోయిన దక్షిణ కళింగ రాజ్యమును మఱల సంపాదించుటకు చాల ప్రయత్నములు చేసియున్నట్లూహింపవలసియున్నది. ఏలయనఁగా జయసింహుని శాసనములన్నియు పిఠాపురమునకు దక్షిణముననే దొరకినవికాని విశాఖపట్టణమండలములో నొక్కటియైన నింతవఱకుఁ గాన్పింపలేదు. అందువలన పిఠాపురము మొదలుకొని చీపురుపల్లి, సర్వసిద్ధి తాలూకాలవఱకుఁగల చాళుక్యరాజ్యమును మఱల కళింగాధిపతులుజయించి చాళుక్యులనుండి గైకొనిరాయని సంశయింపవలసియున్నది. పై నుడివిన తాలూకాలలో జయసింహావల్లభుని కాలమునాఁటిచాళుక్య శాసనములేవియుఁగాన్పింపకపోవుటయే యిట్టియూహ కెడమిచ్చినదికాని అంతకన్న ప్రబలమైన యాధారమేమియుఁ గానరాదు. ఒకవేళ చాళుక్యులు జయసింహావల్లభుని కాలమున దక్షిణకళింగమును, దానితోపాటు పిష్టపురదుర్గమును గోలుపోయినను వారిరాజ్యము పిఠాపురము దక్షిణభాగమున బాగుగ విస్తరించెను. గుద్దవాడివిషయము, వేంగీవిషయము, గుద్రహారవిషయము, గండేఋవాటి విషయము, చనూర్పల్లి విషయము—ఇవియన్నియు జయసింహుని కాలమున చాళుక్యాధికారమునకు లోఁబడిపోయెను. కట్టకడపట నింకను తనయధికారప్రాభవములను నిలబెట్టుకొనఁ బ్రాఁకులాడుచుండిన వేంగీవిషయాధిపతియగు విష్ణుకుండిప్రభువు మంచనభట్టారకునో, లేక యాతని సన్నిహితబంధువునో జయసింహావల్లభుఁడోడించెనని యూహించుట కవకాశముకలదు 1. ఈ పై 'విషయము'లనన్నిటిని ఆతఁడు విష్ణుకుండిప్రభువులనుండియు, పల్లవులనుండియుఁ గైకొనియుండును. గుద్దవాడివిషయము గోదావరీమండలములోని యిప్పటి రామచంద్రపురము తాలూకాను, వేంగీవిషయము ఏలూరు ప్రాంతమునకును, గుద్రహారవిషయము నూజవీడు, గుడివాడ తాలూకాలకును, గండేఋవాటి విషయము ఇప్పటిగుంటూరు, రేపల్లెతాలూకాలకును సరిపోవుచున్నది. కృష్ణానదికి దక్షిణభాగమున పల్లవరాజులు పరిపాలించుచుండినట్లు ఈవఱలో మనకుఁ దెలియును. గండేఋవాటివిషయము కృష్ణానదికి దక్షిణభాగమున నుండుటవలన ప్రత్యక్షమైన శాసనప్రమాణమేమియు లేకపోయినను ఆదేశమును జయసింహావల్లభుఁడు కాంచీపుర పల్లవరాజుల నోడించియే కైకొనినట్లూహించుట సమంజసము. ఈతనికి సమకాలికుఁడైన పల్లవరాజు సుప్రసిద్ధుఁడైన మొదటి మహేంద్రవర్మయొక్క కుమారుఁడగు నరసింహావర్మ. ఈతఁడు క్రీస్తుశకము ౬౨౫ మొదట ౬౪౫వఱకు రాజ్యము

1. Telugu Academy Plates of Vishnukundi Madhava Varma III, published in the Journal of Letters, Calcutta by the Late K. V. Lakshmanarao Pantulu garu

చేసినవాఁడు. తనతండ్రికాలమునఁ దమకు చాళుక్యులచేఁ గలిగిన పరాభవాగ్ని నార్పు కొనుటకై ఈనరసింహవర్మ బహుళసైన్యము లను గూర్చుకొని కుంతలదేశముపై దాడి వెడలి చాళుక్యరాజధానియైన వాతాపినగర మును ముట్టడించి పల్లవరాజ్యమును నిరంకుశ ప్రతాపముతో మైసూరు మండలమువఱకు వ్యాపింపఁజేసెను. ఈవిధమైన తొందరలలో నుండి నరసింహవర్మ తనయుత్సాహశక్తిని, మంత్రశక్తిని, ప్రభుశక్తిని అంతను చాళుక్యవి జయము నిమిత్తము వినియోగపఱిచిన కాల మున నే జయసింహవల్లభుఁడు కృష్ణానదీ దక్షిణభాగమునందలి పల్లవరాజ్యమును జయించి యుండవచ్చును. ఈతఁడు రాజ్యము చేయుచుండిన కాలముననే సుప్రసిద్ధ చీనాయాత్రికుఁడైన యువాన్‌చ్వాంగ్ ఆంధ్ర దేశమునకువచ్చెను. జయసింహవల్లభుని శాస నముల ననుసరించి ఒకనూతనవిషయముమన కుఁదెలియుచున్నది.

బౌద్ధయుగమునాఁటి ధాన్యకటకము వంటి విశ్వవిద్యాలయములు చాళుక్యుల కాలమున నున్నట్టు కన్పట్టవు. పూర్వము ప్రతి అగ్రహారము నొకచిన్న విద్యాపీఠముగ నుండెను. వేదవిద్యను తామభ్యసించి ఇతరులకు బోధించుపండితోత్తములకు అగ్రహారప్రదాన ముఁ గావించి పూర్వపురాజులు విద్యనుపోషిం చియున్నారు. పూర్వము విద్యయనఁగా వైది కవిద్యయె. కాని ఇంతమాత్రమున ప్రతిఅగ్ర హారమును పెద్దవిశ్వవిద్యాలయ మనుట సరి కాదు. ప్రత్యేకము విద్యాప్రదానమునకు పేర్పడసిన విద్యాపీఠములు కొన్ని యుండెడివి. వాటిని 'ఘటికలు', లేక 'ఘటికాస్థానములు' అనువారు. జయసింహవల్లభుని కాలమున నాంధ్రదేశమున పేరును, బెంపునుగాంచినది 'అసనపురఘటికాస్థానము.' ఈ 'ఘటిక'లో 'సామాన్యుఁడు' (సభ్యుఁడు)గ నుండిన తైత్తి రీయ సబ్రహ్మచారియు, హారిత సగోత్రుఁ డును, మండశర్మ మనుమఁడును, శివరుద్ర శర్మపుత్రుఁడును అగు కాటిశర్మకు గండే ఱువాటి విషయములోని నిడుంబఱ్ఱు (ఇప్పటి నిడమఱ్ఱును)దానము చేసిజయసింహవల్లభుఁడు తన విద్యాభిమానమును, విద్వత్పరిపోషణ మును వ్యక్తపఱిచినాఁడు.[1] ఇట్టి ఘటికాస్థా నము లాకాలమున నొక్క ఆంధ్రదేశముననే కాక కర్ణాట, ద్రమిళదేశములందును నుండి నట్లు శాసనములు తెలుపుచున్నవి. పల్లవ రాజుల రాజధానియైన కాంచీపురము ప్రసిద్ధి కెక్కిన ఘటికాస్థానము; కదంబరాజులకు మూలపురుషుఁడైన మయూరశర్మ తనవిద్యను పరిపూర్తిచేసికొనుటకై పెక్కుఘటికాస్థాన ములు తిరిగి, తిరిగి తుదకు కాంచీపురఘటికా స్థానము చేరినట్లు తెలుపఁబడినది. ఇట్లే కర్ణాటదేశమున హెంజరపట్టణము మహాఘటి కాస్థానమని తెలియుచున్నది. సామవేదమున ఉత్తంకుఁడు చెప్పినరీతిని ఘటికాశ్రమ మేర్పా టుచేయఁబడినదని యొకకన్నడ శాసనమునఁ దెలుపఁబడినది. అందువలన ఘటికాస్థాన మన వేదవిదులైన పండితోత్తములు తర్కప్రసంగ

1. Cp. No 7 of 1916-1917.

ములు, ధర్మమీమాంసలు చేయుచు, విద్యాపిపాసార్దితులైన విద్యార్థులకు విద్యాప్రదానముఁగావించు విద్యాపీఠమని నిస్సంశయముగ నుడువవచ్చును. ఈయసనపురమెచ్చటిదో యింతవఱకుఁ దెలియరాలేదు. జయసింహవల్లభుఁడు అసనపుర వాస్తవ్యుఁడగు రుద్రశర్మయనుమఱియొకనికి పులింబూరు (ఇప్పటిపాలమూరు - గోదావరీ మండలమునందలి రామచంద్రపురము తాలూకాలోనిది) అను గ్రామమును దానముచేసియున్నాఁడు.1 ఇట్లే విష్ణుకుండి మూఁడవ మాధవవర్మ పై నుడివిన రుద్రశర్మతండ్రియగు శివశర్మకు ఈ గ్రామమునే దానము చేసియున్నాఁడు.2 ఈ జయసింహవల్లభుని సోదరునియొక్క కుమారుఁడైన రెండవ విష్ణువర్ధనుఁడుకూడ అసనపుర వాస్తవ్యుఁడును, తైత్తిరీయ సబ్రహ్మచారియు, కశ్యపగోత్రుఁడును, వేదవేదాంగేతిహాసపురాణన్యాయానేక ధర్మశాస్త్ర విదుఁడును, అగ్నిష్టోమాది పౌండరీక పర్యంతానేకక్రతుయుష్టువునైన ధ్రువశర్మపౌత్రుఁడును, దోచిశర్మ పుత్రుండును, అధీత వేదద్వయుండును అగుధ్రువశర్మకు గుద్రహారవిషయములోనిపట్టివాడలోఁ గొంత భూమి దానము చేసియున్నాఁడు.3 ఈ విధమున అసనపురఘటికాస్థానమును, అసనపుర వాస్తవ్యులును కూడ చాళుక్యులకాలమునఁ జాల ప్రసిద్ధి వహించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. కాని యింతవఱకు ఈయసనపురమెచ్చటిదో తెలియరాలేదు. పెద్దాపురము దగ్గఱ హాసనపురము దిబ్బ అని పాడువడిన యొకయూరి దిబ్బ కలదు. ఒకవేళ నీయసనపురము ఆహాసనపురమై యుండునేమో. పూర్వమొకప్పుడు ప్రసిద్ధి వహించిన పురరాజములు కాలముయొక్క దౌర్జన్యమువలన భూస్థాపితములగుట మనకుఁ దెలియని విషయము కాదు. కాని మఱియొక్క విషయముకూడ నిచ్చటఁ దెలుపవలసియున్నది. ఆదిబ్బకే హుసేనుపురము దిబ్బయనికూడ జనప్రతీతి కలదు. అసనపురము హాసనపురము, హుసేనుపురము నని జనప్రతీతిలో మాఱియుండవచ్చును. అయిన నీవిషయము నిదమిత్థ మని నిర్ణయింప వీలులేదు.

జయసింహవల్లభుఁడు ముప్పదిమూఁడేండ్లు రాజ్యముచేసెనని తరువాతి చాళుక్యశాసనములు తెలుపుచున్నవి: అనఁగా నీతఁడు క్రీస్తుశకము ౬౩౩-౩౪ మొదలు ౬౬౬-౬౬౭ వఱకు రాజ్యముచేసెను. ఈతనికాలమంతయు కళింగగాంగులతోడను, కాంచీపుర పల్లవులతోడను పోరాడి చాళుక్యరాజ్యమును స్థిరముగ నాంధ్రదేశమున స్థాపించుటకు చేసిన ప్రయత్నముతోనే సరిపోయినది. ఈతనికాలమునఁనే చాళుక్యుల కాలమునందలి మొట్టమొదటి తెలుఁగు (శిలా) శాసనము గుంటూరుమండలమునందలి నర్సారావుపేట తాలూకాలోని విప్పర్లగ్రామమునఁ గాన్పించుచు

1. Cp. No. 5 of 1913-1914.

2. Cp. No. 7 of 1913 1914. ఈ మూఁడవ మాధవవర్మ చేసిన యీయగ్రహార దానమును జయసింహవల్లభుఁడు శివశర్మకొడుకైన రుద్రశర్మకు మఱల స్థిరపఱిచి, ఆతనికి దానశాసనము నిచ్చియున్నాఁడు.

3. Ind. Ant. Vol vii p. 191.

న్నది 1. అది యీజయసింహవల్లభుని అష్టమ విజయరాజ్య సంవత్సరమునాఁటిది. ఇదియే ఉత్తరసర్కారులలో నింతవఱకుఁ గాన్పించిన మొట్టమొదటి తెలుఁగుశాసనము (అనఁగా తెలుఁగుబాసను వ్రాయఁబడిన శాసనము). ఈజయసింహవల్లభుని నాఁటికే యతనిసోదరపుత్త్రుఁడైన రెండవ విష్ణువర్ధనుఁడు బాగుగ నెదిగి పెద్దవాఁడైనట్లు కాన్పించుచున్నది. అందువలన జయసింహవల్లభుని యొక్కయు, ఆతని సోదరుఁడును, తనతండ్రియునగు ఇంద్రభట్టారక వర్మయొక్కయు యుద్ధములం దీతఁడును పాలుగొనుచు పితృ, పితృవ్యులకుఁ దోడ్పడుచుండిన ట్లూహింపవచ్చును. ఈకారణమున జయసింహుఁ డీతని నత్యంతము ప్రేమించుటచేఁ గావచ్చును ఒకశాసనమున నీవిష్ణువర్ధనుఁడు జయసింహవల్లభ తనయుఁడని తెలుపంబడినది. 2 అదిగాక ఈజయసింహవల్లభుని రాజ్యముయొక్క అంత్యకాలమున రెండవ విష్ణువర్ధనతనయుఁడైన మంగియువరాజుకూడ పెద్దవాఁడయినట్లూహింప నవకాశముకలదు. 3 విష్ణువర్ధనుఁడును, ఆతనికుమారుఁడు మంగియువరాజునుగూడ జయసింహవల్లభుఁడు తలపెట్టిన చాళుక్యరాజ్య సుప్రతిష్ఠాపన కార్యమును కొనసాగించి వాసియు, వన్నెయుం గాంచిరి.

పుత్త్రులు లేని కారణముననో, మఱియే హేతువుననో పృథివీవల్లభ జయసింహునిపిదప నాతనిసోదరుఁడగు ఇంద్రభట్టారక నామాంతరముననంబరగు ఇంద్రవర్మమహారాజు సింహాసనము నధిష్ఠించెను. ఇతనికి త్యాగధేనువని బిరుదముకలదు. ఇతనిసోదరుఁడైన జయసింహవల్లభుని కాలమున ప్రారంభమైన వేంగీచాళుక్య, కళింగగాంగ యుద్ధములు ఇంద్రభట్టారకుని కాలమునఁగూడ నంతరింపలేదు. పృథివీమూలరాజుయొక్క గోదావరి తామ్రశాసనము 4 ననుసరించి చాళుక్యులచే నోటువడి రాజ్యపదభ్రష్టులైన రాజులందఱు తంత్రముచేసి కుట్రపన్ని యీ చాళుక్యవంశజుఁడైన ఇంద్రవర్మ మహారాజును సింహాసనభ్రష్టునింగావింప ప్రబలప్రయత్నములంగావించిరి. ఈ యుద్ధములలో నీ పై నుడివిన పృథివీమూలరాజు మొదలగువారి సాయమున కళింగాధిపతియైన గాంగవంశజుండగు అధిరాజేంద్రుఁడు చాళుక్యరాజగు ఇంద్రవర్మను నిహతునిం గావించెనని యూహింప నవకాశము కలదు; కాని యీఅధిరాజ-ఇంద్రుఁ డెవ్వరో తెలియవచ్చుటలేదు. ఇంద్రవర్మ అను పేరుగల కళింగాధిపతులు పెక్కురు గలరు. వీరిలో నేయింద్రవర్మ యీచాళుక్యాధిపతిని నిహతుం గావించెనో శాసనములవలన స్పష్ట

---

1. గంటూరు మండలమునందలి నర్సారావుపేట తాలూకాలోని చేజర్ల గ్రామమున మఱియొక పురాతనాంధ్రశిలాశాసనముకలదు. అది విషమసిద్ధిది. విషమసిద్ధి బిరుదము మొదటివిష్ణువర్ధనునికి, రెండవవిష్ణువర్ధనునికిఁగూడనుండుటవలన అది యేవిష్ణువర్ధనునిదో నిర్ణయింప వీలులేకపోవుటవలన నేను దానిని మొట్టమొదటి తెలుఁగు శాసనముగఁ జాటింపలేదు.

2. Cp. No. 14 of 1916-1917.   3. Cp. No. 9 of 1919-1920.

4. Jour. Bo. Br. As. Soc. Vol xvi P 114; Ind. Ant. Vol xx, P 97

మగుటలేదు. కళింగాధిపతులపరిపాలనకాలము కూడ ఇంకను సరిగా నిర్ణయము కాలేదు. కళింగగాంగులు గాంగశకమనుపేర నొకశకమును ప్రారంభించి తామొసంగిన దానశాసనములలో గాంగేయ వంశప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములందు శాసనకాలమును దెలిపియున్నారు. ఈగాంగశక మెప్పటినుండి ప్రారంభమైనదియు నింతవఱకు సరిగా నిశ్చయముకాలేదు. అందువలన కళింగాధిపతులైన గాంగవంశప్రభువు లెవ్వరెవ్వ రెప్పటినుండి ఎప్పటివఱకుఁ బరిపాలించినది తేలలేదు. ఈకారణమున చాళుక్య ఇంద్రవర్మ మహారాజునకు సమకాలికుఁడైన కళింగాధిపతియగు ఇంద్రవర్మను నిర్ణయించుట కష్టము. ఎట్లయిన నేమి, చాళుక్యాధిపతియైన ఇంద్రభట్టారకుఁడు సంకులసమరమున దివంగతుఁడైనను ఆతనికుమారుఁడైన విష్ణువర్ధనుఁడును, ఆతనికుమారుఁడైన మంగియువరాజును చాళుక్యరాజ్య మాంధ్రభూమినుండి యంతరింపకుండ శౌర్యప్రతాపములను నెఱపి కాపాడియున్నారు. కాని కట్టకడపటి మాటే ఇంద్రవర్మమరణముతో చాళుక్యులు దక్షిణకళింగాధిపత్యమును గూడఁ గోలుపోయి రని స్పష్టమగుచున్నది.

ఇంద్రభట్టారకునిపిదప ఆతనికుమారుఁడైన విష్ణురాజ నామాంతరమునం బరగు విష్ణువర్ధనుఁడు రాజ్యమునకు వచ్చెను. తరువాతి చాళుక్యశాసనముల ననుసరించి యీతఁడు క్రీస్తుశకము ౬౬౭ మొదలు ౬౭౬ వఱకు తొమ్మిదిసంవత్సరములు పరిపాలించెను. ఇతఁడు మన్వాదిప్రణీత ధర్మశాస్త్రములం దందె వేసినచేయి. ఇతనికి విషమసిద్ధియనియు, ప్రళయాదిత్యుఁడనియు, మకరధ్వజుఁడనియు బిరుదములు కలవు. ఇతఁడు మహావితరణశాలియై సర్వలోకాశ్రయుఁడని పేరొందినవాఁడు. కమ్మరాష్ట్రీయము, వెలనాడు విషయము, గుద్రహారవిషయము- ఇవియన్నియు నీతని యధికారమునకు లోఁబడియుండుటచేత ఈతఁడు దక్షిణకళింగరాజ్యమును గోలుపోయినను జయసింహవల్లభసముపార్జితమైన మిగిలినచాళుక్యరాజ్య మంతయు వేంగీదక్షిణభాగమున సురక్షితముగనే యుండెను. కాంచీపుర పల్లవులవలన నీ చాళుక్యులకు తొందరలేమియు కలుగకపోవుటకును, పల్లవులు కమ్మరాష్ట్రము, వెలనాఁడు విషయము మొదలగు చాళుక్యదేశములపై దండెత్తి వెళ్లకపోవుటకును కారణము లేకపోలేదు. మొదటి నరసింహవర్మ పిదప కాంచీపుర సింహాసనమునెక్కిన పల్లవరాజు పరమేశ్వరవర్మ. ఈపరమేశ్వరవర్మ కాలము వఱకుఁగూడ బాదామి చాళుక్యులకును, కాంచీపురపల్లవులకును నిరంతరము యుద్ధములు జరుగుచునేయుండెను. నరసింహావర్మ ప్రతాపమునకు బాదామి చాళుక్యులు కొంతకాలమొదిగి, యోసరిల్లి యుండవలసినవారైనను, పరమేశ్వరవర్మకాలమున ప్రాతపగ మనసునసుంచుకొని సత్యాశ్రయ పృథివీవల్లభపులకేశి తనూజుఁడైన మొదటి విక్రమాదిత్యుఁడు బలవంతుఁడై చతురంగసేనాసమేతుఁడై పల్లవరాజ్యముపై దండెత్తివచ్చి నెల్లూరు

మండలము నాక్రమించి యాతనింజయించుట యేకాక తుదకు కాంచీపట్టణమును కూడ స్వాధీనపఱుచుకొనెను. అందువలన పల్లవరాజులు వేంగీచాళుక్యులకు జ్ఞాతులైన బాదామి చాళుక్యులవలన నోడింపఁబడి యార్ధత్యముఁ దక్కియుండుటచేత దక్షిణమున వేంగీచాళుక్య రాజ్యమునకు వారివలన భయములేక యది సురక్షితముగ నుండుటకుఁ గారణమయ్యెను. ఈరెండవ విష్ణువర్ధనుఁడు ఇతని పితృవ్యునివలెను, పితామహునివలెను భాగవతోత్తముఁడని కాక పరమ మాహేశ్వరుఁడని యొకానొక శాసనమున వర్ణింపఁబడి యుండుటచే నీతఁడు శైవమతము నవలంబించిన శైవమతాభిమానియని యూహింపఁదగియున్నది. అంతియేకాక ఈతఁడు ఇతని కుమారుఁడైన మంగి యువరాజుయొక్క యొకానొకశాసనమున 'అనేకసమరసంఘట్టోపలబ్ధవిజయ యశఃప్రసూతాన్యామోద గంధాధివాసితసకలదిఙ్మండలుఁ'డనియు, 'నానాశాస్త్రాభ్యాసోపబృంహిత విమలవిశాలబుద్ధి' యనియు, 'త్యాగౌదార్య ధైర్యశాంత్యాది గుణాలంకృతుఁ'డనియు వర్ణింపఁబడియున్నాఁడు.

ఈతనిపిదప వేంగీచాళుక్య సింహాసనము నధిష్ఠించినవాఁడు విష్ణువర్ధన కుమారుఁడైన మంగియువరాజు. ఈతనికి మంగి మహారాజు, మంగి వర్మ, మంగి దువరాజు, విజయాదిత్యుఁడు అని నామాంతరములు కలవు.[1] ఈతఁడు సమతిశయిత పితృగుణశక్తి సంపన్నుఁడు; ఆన్వీక్షక్యాది విద్యాప్రయోగములందు విజయసిద్ధియగుట విజయసిద్ధియని బిరుదము వహించినవాఁడు; సర్వలోకాశ్రయుఁడు; సమస్తభువనాశ్రయుఁడు. ఈతఁడు క్రీస్తుశకము ౬౭౬ మొదలు ౭౦౧ వఱకు ౨౫ సంవత్సరములు పరిపాలించెను. ఇతనికి జయసింహావల్లభుఁడు, విష్ణువర్ధనుఁడు, కోకిలివర్మ అని మువ్వురు పుత్రులును, పృథివీపోత్రి[2] అను నొకకూఁతురును గలరు.

మంగియువరాజుపిదప ఆతనిజ్యేష్ఠపుత్రుఁడైన జయసింహావల్లభుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు క్రీస్తుశకము ౭౦౧ మొదలు ౭౧౪ వఱకు పదుమూఁడు సంవత్సరములు రాజ్యము చేసెను. ఈతనికి సర్వసిద్ధి, సర్వలోకాశ్రయ బిరుదములు కలవు. మొట్టమొదటిమాఱు మహమ్మదీయు లీతనికాలముననే హిందూదేశముపై దండయాత్రలు సలుపఁదొడంగిరి. క్రీస్తుశకము ౭౧౦-౧౧లో కాసిమ్ కుమారుఁడైన మహమ్మదుసైన్యాధిపత్యము క్రింద అరబ్బులు సింధుదేశముపై నెత్తివచ్చి, తుదకు దానిని స్వాధీనముచేసికొని, రాజ్యమును స్థాపించి మొట్టమొదటిమాఱు భారతభూమిని చంద్రధ్వజమును బాదుకొల్పిరి. ఈజయసింహావల్లభుని కాలమున పేర్కొనఁదగిన విశేష మిది యొక్కటియే.

ఇంకను ఈతనికాలమునాఁటికి బాదామి చాళుక్యులకును, కాంచీపుర పల్లవులకును

1. భారతి, సం. ౧, సం. ౧౨. పుట ౯౯.　2. భారతి-సం.౧, సం. ౧౨; Cp. No. 10 of 1919-20

వైరము లంతరింపలేదు. ఉభయులునుగూడ వీరిపైవారును, వారిపై వీరును కత్తిదూయుచు మహాభయంకర యుద్ధముల దక్షిణాపథమును వీరవర్యుల వేడిరక్తముతోఁ దడుపుచునే యుండిరి. ఇతరదేశము లీవిధమున సంక్షోభము నొందుచున్నను వేంగీచాళుక్యరాజ్యము నిమ్మకు నీరెత్తినట్లు చలనములేక ప్రశాంతముగనే యున్నదని ఇంతవఱకుఁ గాన్పించిన శాసనముల ననుసరించి యూహింపవచ్చును.

ఈతనిపిదప నితని సవతితల్లికొడుకును, విష్ణువర్ధనుని యగ్రజుఁడును అగు కోకిలివర్మ వేంగీచాళుక్య సింహాసనమునధిష్ఠించెను. ఈతనికి కొక్కిలియనియు, విక్రమాదిత్యభట్టారకుఁడనియు నామాంతరములుకలవు. ఇతఁడు విజయసిద్ధియని బిరుదము వహించినవాఁడు. అగ్రజుఁడైన విష్ణువర్ధనుఁడుండఁగా నీతఁడెట్లు రాజ్యమునకువచ్చెనో బోధపడకున్నది. ఇందుల కొక్క కారణము నూహింపవచ్చును.

కాంచీపురపల్లవులు కృష్ణానదికి దక్షిణభాగమునఁ దమరాజ్యమును గోలుపోయినను వైరము కారణముగ నిరంతరము వారికి బాదామిచాళుక్యులతో యుద్ధములు సంభవించుచుండుటచేత వేంగీచాళుక్యులతో స్నేహభావమున నుండకపోయినచోఁ దమరాజ్యమున కుత్తరమునుండి వారివలన ముప్పు వాటిల్లునని వారితో మైత్రింబాటించి యుండవచ్చును. మొదటి నరసింహవర్మ తరువాత కాంచీపుర సింహాసనము నెక్కిన మొదటి పరమేశ్వరవర్మ కాలముననే కాంచీపురము కొంతకాలము బాదామి చాళుక్యాధికారమునకు లోఁబడియుండెను. పరమేశ్వరవర్మ తరువాత రాజ్యమునకు వచ్చినవాఁడు రెండవ నరసింహవర్మ. ఈతనితోను, ఈతని కుమారుఁడైన రెండవ పరమేశ్వరవర్మతోను కుట్రచేసి వారి సాయమును బొంది కోకిలివర్మ చాళుక్య సింహాసనము నెక్కియుండును. ఈతఁడు ఎంతకుట్రచేసి రాజ్యమును సంపాదించినను పల్లవుల సాయములేనిదే తన రాజ్యమును నిలుపుకొనలేక పోయెను. కాని పల్లవు లీతనికి చాలకాలము సాయముచేయుటకు వీలుచిక్కలేదు. ఏలయన వారికి బాదామిచాళుక్యులతోడి వైరముటులుండ వారిలో వారికే సింహాసనమునకై తగవులు సంభవించెను. రెండవ నరసింహవర్మ దాయాదియైన రెండవ నందివర్మ బలవంతుఁడై రెండవ పరమేశ్వరవర్మను పదభ్రష్టునింగావించి తాను పల్లవరాజ్యమున కధిపతికావలెనని తంత్రములు పన్నఁజొచ్చెను. ఇంటిలో నిటువంటి కలహములు సంభవించుటచే రెండవ పరమేశ్వరవర్మ కోకిలివర్మకు సాయముచేయుటకు వీలుపడదయ్యెను. ముందాతఁడు తనరాజపదమును తాను కాపాడుకొనవలసినయావశ్యకత సంభవించెను. ఈతరుణమును జూచి అగ్రజుఁడైన విష్ణువర్ధనుఁడు విజృంభించి బలవంతుఁడై వేంగీచాళుక్య సింహాసనమును స్వాధీనపఱుచుకొని తనయనుజుఁడైన కోకిలివర్మను దేశమునుండి వెళ్లఁగొట్టెను. తుదకు కాంచీపురమున రెండవపరమేశ్వరవర్మయు, వేంగిలో కోకిలివర్మయుఁగూడ రాజ్యపదభ్రష్టులైరి. ఈ కారణమున

కోకిలివర్మ వేంగిచాళుక్య రాజ్యమును ఆఱు మాసములు మాత్రమే పరిపాలించుట సంభవించెను.

దేశమునుండి వెళ్లఁగొట్టఁబడిన కోకిలివర్మగత్యంతరముఁగానక కళింగమునకుఁబోయి యచ్చట పూర్వముచాళుక్యులు కోలుపోయిన దేశమును మఱల సంపాదించి యచ్చట స్వతంత్రుఁడై పరిపాలనము నెఱపెను. ఇంతవఱకు మనకు దొరకిన ఆతనియొక్కయు, ఆతనిసంతతివారి యొక్కయు శాసనములు అప్పటివే; మధ్యమకళింగములోని భోగపురవిషయమున- అనఁగా నిప్పటి సర్వసిద్ధి తాలూకాలో దొరకినవే.[1]

ఈ కోకిలివర్మకు మంగి యువరాజను కుమారుఁడుకలఁడు. ఈతనికిని విజయసిద్ధియను బిరుదము కలదు. ఈతఁడును మధ్యమకళింగమును పరిపాలించినవాఁడే. ఈతనిశాసనము కూడ నొకటి పైనుడివిన తాలూకాలోనే దొరకినది. మంగియువరాజనామము ధరించిన చాళుక్యులలో నీతఁడు రెండవవాఁడగుటచే నితనిని రెండవ మంగిరాజందురు. ఈతని కుమారుఁడు వినయాదిత్యమహారాజు. ఈతని శాసనము లింతవఱకేవియు దొరకలేదు. ఇతనిపుత్రుఁడు (రెండవ) కోకిలివర్మ మహారాజు. ఈతనికి 'అనివారిత'బిరుదము కలదు. ఈతఁ డనివారితశక్తిత్రయ సంపన్నుఁడు. ఈతనిశాసనములుకూడ రెండు దొరకినవి.[2] ఇతఁడును తాత ముత్తాతలవలెనే ఎలమంచి(యల్లమంచిలి) రాజధానిగా మధ్యమకళింగము నేలెను. ఈవిధమున కోకిలివర్మయొక్కయు, ఆతని సంతతివారి యొక్కయు శాసనములన్నియు కళింగములోనే దొరకుటవలనను, వారు తమశాసనములందుఁదాము మధ్యమ కళింగమును పాలించితిమని చెప్పుకొనియుండుటచేతను వేంగిదేశమునుండి తఱుమఁగొట్టఁబడినపిదప కోకిలివర్మ సంతతివారికి మఱల వేంగిచాళుక్యరాజ్యము లభింపలేదనుట స్పష్టము. మనకోకిలివర్మను గుఱించికాని, ఆతని సంతతివారిని గుఱించికాని యింతకెక్కువ తెలియరాదు.

మొదటి మంగియువరాజు కుమారుఁడైన విష్ణువర్ధనుఁడు కోకిలివర్మను వెళ్లఁగొట్టి తాను క్రీస్తుశకము ౭౧౮ లో రాజ్యమునకు వచ్చి ౩౭ ఏండ్లు-అనఁగా ౭౫౫ వఱకు రాజ్యముచేసెను. ఈతనికి విష్ణురాజనియు నామాంతరముకలదు. ఇతఁడు విషమసిద్ధి బిరుదాం

1. Cp. No. 13 of 1908-1909 : C p. No 12 of 1908-1909

2. Cp. No 10 of 1908-1909 ; Cp. No. 11 of 1908-1909. ఈ శాసనములందు పేర్కొనఁబడిన కోకిలివర్మ లేక కక్కులి మహారాజును, మొదటి మంగి యువరాజు కుమారుఁడైన కోకిలివర్మ మహారాజును ఒక్కరుకారని నాయభిప్రాయము. ఈ కోకిలివర్మ మంగియువరాజు పౌత్రుఁడు; వినయాదిత్య మహారాజు పుత్రుఁడు. మొదటికోకిలివర్మవలెఁగాక ఈతనికి అనివారిత బిరుదముకలదు. మొదటి కోకిలివర్మ కుమారుఁడైన రెండవమంగియువరాజు నెఱుంగుదుము గనుక వినయాదిత్యుఁ డీతని కుమారుఁడనియు, రెండవకోకిలివర్మ ఈ రెండవ మంగియువరాజు పౌత్రుఁ డనియు, వినయాదిత్యునిపుత్రుఁడనియు నూహించుట సమంజసముగ నుండకపోదు.

చితుఁడు; తండ్రివలెనే సర్వలోకాశ్రయుఁడు; సమస్త భువనాశ్రయుఁడు. ఈతనియొక శాసనము బెజవాడలోని 'నడుంబివసతి' అను జైనుల యాలయమునకు ఈతఁడు చేసినదానమును దెలుపుచున్నది. ఈతని కాలమున జైన, బ్రాహ్మణమతములు రెండును ఆంధ్రదేశమున వర్ధిల్లుచుండెను. జైనులకు బెజవాడ ప్రధానస్థానముగ నుండెను. ఈవిష్ణువర్ధన మహారాజు జైనుల యాలయమునకును, బ్రాహ్మణులకునుగూడ భూదానాగ్రహార దానములు చేసియుండుటచేత రెండు మతములను గూడ సమబుద్ధితో నాదరించుచుండెనని యూహింపవచ్చును. జైనమత ప్రస్తావమాంధ్రదేశమున చాళుక్యులకాలమున మొట్టమొదట నీవిష్ణువర్ధనుని శాసనములందే కనప్పట్టుచున్నది.

---

## కృష్ణా!

గుండిమెడ వెంకటసుబ్బారావుగారు

హాతమార్చి హాతమార్చి యారిపోయెఁ దనంత, పృథివి నజేయమౌ భీష్మవహ్ని!
తెగముంచి తేలించి, యిగిరిపోయెఁ దనంత, దుస్తరంబైన యాద్రోణజలధి!
ఉట్టూఁతలూఁచి యెట్లో శాప హాతవాటాట, నడఁగెను కర్ణఝంఝూనిలంబు!
రిపు రక్తదాహ సంతృప్తయై తనయంత, శాంతించె గురుపుత్త్ర శస్త్రధాటి!

గీ. ఏల నీలైదు, చెప్పుమా వ్రేలుమడచి, పేరుఁగాంచిన యేమహావీరు నీవు
విజయుచేఁ బౌరుషమునఁ గూల్పించినావొ! కృష్ణ! చెప్పుమ యేమొనర్చితివొ నీవు!

సీ. భీష్మప్రతాపోగ్ర విలయాగ్ని చెలరేగ, భయమంది చక్రంబుఁ బట్టినావు!
ద్రోణాస్త్రధాటి మీసేన పాఱుచునుండ, శూన్యదృష్టుల దిశల్ చూచినావు!
అంగభూవర శరాహతుల ధర్మజుఁడేడ్వ, నరుచెంత వెడనవ్వు నవ్వినావు!
నారాయణాస్త్ర సంధాతయై గురుపుత్త్రుఁ, డరుదేరఁ గేల్మోడ్చి మరలినావు!

గీ. పాండుసుతులకు మేటిప్రాపకమవేమొ! దిట్టతనమున జగమేలు జెట్టివేమొ!
కలదె యింతకంటెను నైచ్యమిలను, కృష్ణ! చెపుమ, యేమిచేసితో కురుక్షేత్రమందు!

గీ. సరియె, పోనిమ్ము నీపౌరుషమున కేమి! సారథివి నీవు, నీకేమి పౌరుషంబు!
ధర్మసంరక్షణైక తత్పరుఁడ వేమొ! నిలిచెనే ధర్మమేని నీవలనఁ గృష్ణ!

సీ. ఋజుమార్గ వర్తియై యెసఁగు ధర్మజుమెడల్, వంచి యొప్పించి, బొంకించు టొకటి!
పృథుశాప నిహతమై రథము క్రుంగినవేళ, విజయుచేఁ గర్ణుఁ గూల్పించు టొకటి!
మహి నకాల దివాస్తమయముఁ గల్పించి, వంచించి, సైంధవునిఁ జంపించు టొకటి!
ధర్మంబువిడచి, గదాయుద్ధమున భీము, చే సుయోధనుఁ గూల్పఁ జేయు టొకటి!

గీ. అబ్బ!-యెంతని వివరింతు నయ్య, నీవొనర్చి యున్న యధర్మ సంతతులు, కృష్ణ!
ఒక్క... నీవుమాత్రము లేక యున్న, భరత, యుద్ధమది ధర్మబద్ధమై యుండునేమొ!



# సాభిప్రాయ విశేషములు

## గాంధిమహాత్ముని సంచారము

జాతకకథలు సిద్ధార్థుని విజయయాత్రల నతిరమణీయముగను వివరించుచున్నవి. గౌతమబుద్ధు డేయూరికి బోయినను వేలకు వేలు ప్రజలు శ్రీమంతులు సామాన్యులు, పండితులు పామరులు, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు మూగుచు బుద్ధదేవుని సందర్శించుచు కృతార్థులైనవిధమును గాంధిమహాత్ముని విజయయాత్రలు సంస్మరింపజేయుచున్నవి. లోకోపకారార్థమవతరించిన మహానుభావులు, బంధువులు, స్వాములు, గురువులు, దేవులు. దుఃఖభూయిష్ఠమైన సంసారప్రవృత్తియందు దుఃఖోపశమనమునకును సుఖప్రాప్తికిని సాధనంబులను బోధించెడి మహానుభావుడు, ప్రత్యక్షమైన పరదేవత. గౌతమబుద్ధు, డనిత్యములైన రాజ్యమును, భార్యాపుత్రాదులను, భాగ్యభోగములను బరిత్యజించి లోకకల్యాణమున కాత్మసమర్పణమును జేసి శాశ్వతానందమును బడసినవిధమునను గాంధిమహాత్ముడు సర్వసంగ పరిత్యాగమును జేసి లోకహితార్థ మాత్మసమర్పణమును జేసి లోకారాధ్యతను బడయగలిగెను. గాంధిమహాత్ముడు దేశమును ప్రజలను నావరించిన దుఃఖమును తనదుఃఖమునగను సంభావించుచు పాపపరిహార్థ మాత్మసమర్పణమును జేయుచు లోకప్రియత్వమును బడయుచున్నవిధమును మహాత్ముని దక్షిణదేశ సంచారము విశదముచేసినది. శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమునందు దెలిపినటులు మహాత్ముడు సర్వత్రసమత్వమును వహించుచు నిందాస్తోత్రములను పరిగణింపకను ధర్మారాధనమును జేయుచు లోకోద్ధరణమును జేయుచున్నాడు.

'సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి నప్రియః;
యే భజన్తి తు మాంభక్త్యా మయి తే తేషుచాప్యహమ్.'

మహాత్ముడు వారినిసందర్శించిన ప్రజలకు జాతిమతకులగౌరవభేదభావములను పాటింపకను స్వధర్మారాధనమార్గమును బోధించి సమత్వసిద్ధిని విశదముచేసెను. మనీషాపంచకమునందు శ్రీ శంకరస్వాములు బోధించిన వేదాంతార్థమును గాంధిమహాత్ము డనుష్ఠించుచు తత్త్వార్థమును నిత్యజీవనమునందు ప్రజలకు సువ్యక్తముచేసి స్వీయమాహాత్మ్యమును విశదముచేసెను. గోచిపాతరాయని ధర్మరాజ్యప్రాభవము నాక్షేపించినవారు సయితము సందర్శనసంకీర్తనము చేయుట యవసరంబైనది. శ్రీమంతులు నిరుపేదలు, బ్రాహ్మణులు పంచములు, వృద్ధులు బాలురు, స్త్రీలు పురుషులు, వారి

మనోభీష్టములను గాంధి మహాత్మునియందు సందర్శించి యానందపరవశత్వమును బడయ గలిగిరి. మమకారాహంకారపరాయణులకు గాంధిమహాత్ముని యుపదేశాచరణములు సంతృప్తినిగలుగజేయకపోయినను ధర్మాత్ములకు పరమానందమును గలుగజేసినవి. గాంధిమహాత్మునిసందర్శించి వారి పవిత్రోపదేశముల విన గలభాగ్యమె భాగ్యము. గతమాసాంతమునం దీభాగ్యమును బడసిన దక్షిణదేశవాసులు ధన్యులు.

* * *

ప్రజాస్వాగతము

వేనవేలు ప్రజలు మహాత్మునకు స్వాగతంబునొసంగి వారికిగల యవ్యాజభక్తి విశ్వాసములనుసహస్రముఖములను విశదముచేసిరి. మహాత్మునకు చెన్నపురినుండి కన్యాకుమారి వరకును ప్రజలు మహోత్సవములను జేసి మంగళహారతులను సమర్పించిరి. ప్రజలు గంటలకొలదికాలము వారినిజూచి యానందించుటకు వేచియుండిరి. తిరువాన్కూరు మహారాణియును ప్రజలును నొసంగిన సత్కారాతిథ్యములు మహాత్ముని ప్రతిభ వృద్ధిని బొందుచున్నవిధమును విశదముచేసినవి. చెన్నపురి యందలి ప్రజలుచూపిన యుత్సాహమును మహాత్ముని ప్రతిభను విశదము చేసినది. శ్రీ మహారాణి విషయమై మహాత్ముడు యంగు ఇండియాపత్రికయందు వ్రాసిన సంకీర్తనమును శ్రీమంతులు మననముచేయుదురుగాత! చెన్నపురి కార్పొరేషను సమర్పించిన స్వాగతపత్రము మహాత్ముని ప్రతిభాతిశయమును విశదము చేసినది. పంచములు పంచమోద్ధారకుడని యును, రాజ్యాంగాందోళకులు స్వరాజ్యోద్ధారకుడనియును, స్త్రీలు స్వాతంత్ర్యధర్మోద్ధారకుడనియును, విద్యార్థులు గురువరేణ్యుడనియును, ప్రజలవతారపురుషుడనియును, భావించి యారాధించిరి. బుద్ధిజాడ్యముగల యభిమానాంధులు దివ్యప్రభావమును జూడజాలకుండుట వారిప్రారబ్ధకర్మఫలముగాని ప్రజల యుత్సాహలోపముగాదు. గాంధిమహాత్ముడనవరతముచేసెడి సత్యాహింసాధర్మములు ప్రజాపాలకులదృష్టి నుచితరీతి నాకర్షించి గాంధి మహాత్ముని సంచారమునకనురూపమైన ఫలమును భగవంతుడు ప్రసాదించుగాత!

* * *

మహాత్ముని యుపదేశములు

విజయమునకు మూలమైన ధర్మసంకల్పము మహాత్ముని యుపదేశములకు మూలబీజము. సకలమతసారమును సనాతనమునునైన 'సత్యాన్నాస్తి పరోధర్మః' 'సత్యమేవ జయతేనానృతం' ధర్మములను మహాత్ముడు సంపూర్ణమైన జీవనవిధానమునకు సమన్వయము చేయుటకు జేయుచున్న ప్రయత్నములు ప్రపంచదృష్టి నాకర్షించినవి. సత్యవ్రతానుష్ఠానమున కాధారమైన యహింసాధర్మము హింసాపూరితమైన వర్తమాన యుగమునుద్ధరించుట కవసరమైనది. ఆయవసరమునకనురూపముగను భారతసంస్కారమునకు పరిపాటియైన యహింసాధర్మమును పునరుద్ధారణచేయుటకు గాంధిమహాత్ముడు ఖద్దరు యోగసాధనము నుపదేశించుచున్నాడు.

అహింసాయోగాభ్యాసమునకును, మానవ ధర్మారాధనమునకును, దుఃఖనివృత్తికిని, స్వరాజ్య సంపాదనమునకును ఖద్దరుయోగసాధమును మహాత్ముడుపదేశించుచున్నను, ప్రజల దృష్టి జయజయధ్వానములందు లగ్నమైన విధమునను ఖద్దరునందు లగ్నముగాకుండుట ప్రారబ్ధకర్మఫలముగ నున్నది. గాంధిమహాత్ముడు తనసంచారమునం దన్ని సందర్భములందును ఖద్దరుయోగము నుపదేశించెను. మహాత్ముడు తిరిగి రెండుమూడుమాసములకు దక్షిణదేశసంచారమునుజేయుట కేతెంచనున్నాడు. అప్పటికైనను మహాత్ముడు ప్రార్థించునటులు ప్రజలు ఖద్దరుధారణమును జేయుచు సత్యాగ్రహదీక్షార్హతను బడయుదురని విశ్వసించుట కవకాశములు గన్పట్టకున్నవి. సభావేదికలయందు గంభీరోపన్యాసములను జేసెడి నాయకులకే చిత్తశుద్ధి గలుగనపుడు జనసామాన్యమును నిందించుట యనుచితము. ప్రజలు గాంధిమహాత్ముని సందర్శించుటకు జూపిన యుత్సాహము నందొకపాలైనను కార్యాచరణమునందు జూపిన మహాత్ముని సంచారము సార్థకమై భారతమాత ధన్యతను బడయగలదు. ప్రజోత్సాహ మపారముగను వ్యక్తమగుచున్నను నిరంకుశప్రభుత్వమునకు ప్రబోధోదయముగలుగకను నధికారదౌర్జన్యము యథేచ్ఛగను నేలుచున్నది. ప్రజలకు గాంధిమహాత్ముడుకోరునటులు ప్రతిఘటన సామర్థ్యము గలుగనంతవరకును భారతమాతకు తరణోపాయము దుర్లభముగ నున్నది.

* * *

ప్రభుత్వనిర్లక్ష్యము

నిరంకుశప్రభుత్వము ప్రజాశయముల పట్లను జూపుచున్న నిర్లక్ష్యప్రతిఘటన భావములు దినదినాభివృద్ధిని గాంచుచున్నవి. వంగరాష్ట్రనిర్బంధశాసనమును సామ్రాజ్యశాసనసభలును ప్రజలునునిరసించినను రీడింగుప్రభువు సమర్థించి నిరంకుశాధికారప్రాబల్యమును విశదముచేసెను. సామ్రాజ్యశాసనసభయును రాష్ట్రీయశాసన సభలును చేసిన తీర్మానములును నిర్ణయములును మృతాక్షరములుగ నున్నవి. సమర్థనాధికార వినియోగమే పరిపాలనమునకు సామాన్యలక్షణముగ బరిణమించినది. మాంటుఫర్డు సంస్కరణముల నిరుపయోగత్వము విశదమైనది. సంస్కరణములు కోట్లరూప్యముల వ్యయమును మాత్రము ప్రసాదించినవి. సంస్కరణములు ప్రజాస్వాతంత్ర్యమును స్వరాజ్యమును వెనుక బెట్టినవిగాని ముందునకు నడుపలేదు. నిరంకుశాధికారవర్గమునకు వేతనాధికారములు ప్రతిబంధకములు లేకను వృద్ధినిబొందుచున్న విధమును గ్రేటుబ్రిటనునందలి వ్యవహారములును విశదముచేయుచున్నవి. పౌరసేవోద్యోగవర్గము యొక్క ప్రయోజనములను రక్షించుటయందుగల యభిమానము భారతరాజ్యాంగవికాసమును జేయుటయందు బర్కెన్ హెడ్డు ప్రభువునకు గాని రీడింగుప్రభువునకు గాని రాష్ట్రపాలకులకుగాని గనుపడదు.

* * *

పౌరసేవోద్యోగవర్గము

లీకమిషను సిఫార్సులను సామ్రాజ్యశాసనసభ నిరాకరించినను వానినాచరణమునందు బెట్టుటకు పార్లమెంటునందు బర్కెను హెడ్డు ప్రభువు శాసనమును ప్రవేశపెట్టి సంస్కరణముల దౌర్బల్యమును వ్యక్తము చేసెను. రాజ్యాంగములందు బ్రిటీషుపౌర సేవోద్యోగుల ప్రాబల్యమును తగ్గించుటకు బదులు శాసనము వృద్ధిచేయుచున్నది. సంవత్సరమునకు కోటిరూప్యములకు మించినవ్యయ

భారము గలుగుచున్నది. పౌరసేవోద్యోగుల మీదను శాసనసభలకును మంత్రులకును నింతవఱకును గల స్వల్పాధికారమును సయితమంతరింప జేయుచున్నది. భారతీయులు స్వరాజ్యమును గోరుచుండగను బ్రిటీషు ప్రభుత్వము దుర్భరమైన పౌరసేవోద్యోగపాశమును దృఢముగను బంధించుచున్నది. దేశక్షేమమునకు సాధనములైన సంస్కరణములను విమర్శించుటకు బ్రిటీషు ప్రభుత్వవర్గము నిరాకరించుచు దేశారిష్టములకు మూలమైన నిరంకుశవర్గమును చిరకాలము రక్షించుటకు బూనుకొనుచున్నది. కర్నలు వెడ్జివుడ్డు రాజ్యాంగసంస్కరణములు వర్తమాన పరిస్థితులందు వికాసమును బొందుట కవకాశములు లేవని విశదము చేసెను. రీడింగు ప్రభువును నితరాధికారులును జేయబూనిన స్వదేశయాత్రకు నిరంకుశాధికార సంరక్షణమే ఫలమని పరిస్థితులు విశదము చేయుచున్నవి. రాజ్యాంగములందు నిరంకుశాధికారవర్గమును, వారియభిమానులును భారతీయుల సహకారమును దుర్లభము చేయుచు స్వరాజ్యపక్షనాయకుల సహకారమునుగోరుట విచిత్రముగనున్నది. స్వరాజ్యపక్షనాయకులు దేశబంధు దాసు మోతీలాల్ నెహ్రూ, విట్టలుభాయి పటేలుగార్లు మొదలగువారు ప్రతిష్టంభనతంత్రము నవలంబించి ప్రభుత్వపరాజయమును జేసినను ప్రభుత్వవ్యవహారములు ధ్రువపత్ర సాధనమునను యథాప్రకారము సాగుచున్నవి. బర్కెన్ హెడ్డు ప్రభువు దాసుగారిని దౌర్జన్యమార్గనిరసనమున కభినందించుచు ప్రభుత్వ దౌర్జన్య మార్గ వ్యాపనమునకు తోడ్పాటును కోరుట నిరంకుశ ప్రభుత్వము నావహించిన యవినయమును దెలుపుచున్నది. ఆత్మగౌరవముగల భారతీయులు ప్రభుత్వమునకు దోడ్పడుట దుర్లభమని దాసు మోతీలాలు నెహ్రూ మొదలగు వారి ప్రసంగములును శాసనసభలవ్యవహారములును విశదము చేసినవి. స్వరాజ్యపక్ష ప్రాబల్యము లేకను ప్రభుత్వావలంబనపక్షముగల చెన్న రాష్ట్రమునందు సయితము గోషెను ప్రభువు ధ్రువపత్రసాధనము నవలంబించుట సంస్కరణముల దుర్విపాకమును విశదము చేయుచున్నది. నిరంకుశవర్గమునందు హృదయపరివర్తనము గలుగక పోయినను దాసుగారి సాహచర్యమును బర్కెను హెడ్డు ప్రభువును వారియనుచరులును నుపేక్షించుట బాలిశభావమును విశదము చేయుచున్నది. భావికాలమందు స్వరాజ్యపక్షదంశనీతి యేరూపము దాల్చినను గతించిన రెండేండ్లయందును నవలంబించిన ప్రతిఘటనసాధనము నిరంకుశ ప్రభుత్వమునకు జ్ఞానోదయమును గలుగజేయజాలి యున్నను నిరంకుశదుర్గమునందు సుఖాసీనమైన నిరంకుశవర్గమునకు జ్ఞానోదయము గలుగలేదని నిత్యవ్యవహారములు విశదము చేసినవి. భారతరాజ్యాంగవ్యవహారములు నిరంకుశాధికారబలమును భారతీయులదుర్బలమును వేయినోళ్లను తెలుపుచున్నవి. భారతీయులందఱును పరస్పరవిభేదములను విసర్జించి యేకోన్ముఖులై పాటుపడవలసిన యవసరమును, గాంధిమహాత్ముడు తనయాచరణములవలనను ఉపదేశముల మూలమునను చేయుచున్న త్యాగప్రభావమును గ్రహించి వారి ప్రయత్నములకు దోడ్పడి స్వధర్మనిర్వహణమును జేసి మాతృదేశవిమోచనమునకును లోకకల్యాణమునకును దోడ్పడి ధన్యవాదములను బడయుదురుగాత!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

Edited and Fublished by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T. Madras.